
మళ్లీ ఐదు సంవత్సరాలు
ఎలా గడుపాల్రా దేవుడో!!


పాపం! గెల్చినోళ్లు పదవి కోసం ఎలా
కుమ్ములాడుకుంటారో ఆలోచిస్తుంటే
తెగ నవ్వొస్తుంది బావా!


డిపాజిట్లు కూడా దక్కలేదు పాపం


ఓడిపోయిన మంత్రులు
వారి
మనస్తత్వం
Raju


ఓడిపోయిన దగ్గర నుండి ప్రతి చిన్న
విషయానికి అంతెత్తు లేస్తున్నారు పిన్నీ!!


మీరు ఓడిపోయారు కదా ఇప్పుడు
ఏం చేద్దామనుకుంటున్నారు?
మళ్లీ నా పాత వృత్తి
చేసుకుందామనుకుంటున్నా?

# రైతుల పాలిటి కల్పతరువు
# రామగుండం యూరియా




ఆంధ్రప్రదేశ్‌లో తయారు చేయబడుతున్న
యూరియా, రామగుండం యూరియా,
అన్ని పంటలకు, అన్ని కాలములకు అనువైన ఎరువు,
వాడండి
రామగుండం యూరియా.

**స్వస్తిక్ బ్రాండ్**
**యూరియా**




**ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్**
**ఆఫ్ ఇండియా లిమిటెడ్**
అమ్మకపు విభాగము
6-2-30/C, లకిడి కా పూల్,
హైదరాబాదు-500 004.



## లోకం పోకడ * ఊరిమెన్











# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం : 28–1–’83
దుందుభినామ సం పుష్య-మాఘ. శు. పౌర్ణమి
సంపుటము 75 : సంచిక 22

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 1–50 |
| ఆరుమాసాల చందా | రు. 42–90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 85–80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి సరిత
(ఫొటో : శ్రీ. [illegible])

# తెలుగుదేశం అద్భుతవిజయం!

ఆంధ్రప్రదేశ్ శాసనసభకి జనవరి 5న జరిగిన ఎన్నికలలో ప్రజలు యిచ్చిన తీర్పు తలలు పండిన రాజకీయ నాయకులకి కూడా దిగ్భ్రాంతిని కలిగించింది. తెలుగుదేశం పార్టీ ఎవరూ ఎదురు చూడని విధంగా విజయాన్ని సాధించడమే కాక శాసన సభలో మూడింట రెండువంతుల పైగా మెజారిటీని సంపాదించుకున్నది. ఇంత గొప్పగా గెలిచిన ఈ పార్టీని కేవలం తొమ్మిది నెలల క్రితమే ప్రఖ్యాత సినీ నటుడు శ్రీ ఎన్. టి. రామారావు స్థాపించారు. చాలా కాలంగా ఉన్న జాతీయ స్థాయి ప్రతిపక్షాలలో వేటితోనూ పొత్తు కుదరకపోయినా తమకు తాముగానే (దాదాపు ఒంటరిగా) ప్రచార గధ సారధ్యాన్ని వహించి తమ అభిమానులతోపాటు అన్ని వర్గాలవారిని ఆకట్టుకోగలిగరని ఈ ఎన్నికల ఫలితాలు నిరూపించాయి.

కేంద్రంలో, రాష్ట్రంలో ఎంతో కాలంగా పరిపాలన సాగిస్తున్న ఇందిరా కాంగ్రెసు పట్ల ప్రజలకి కలిగిన అసంతృప్తి ఈ ప్రాంతీయ పార్టీ విజయానికి దోహదం చేసింది. ఎప్పుడూ, తెలుగు ప్రజల ఆదరాభిమానాలు ఇందిరా కాంగ్రెసుకే ఉంటాయన్న పలువురు రాజకీయ పరిశీలకుల నమ్మకాలన్నీ వమ్ము అయిపోయాయి.

ఇందిరా కాంగ్రెసు పట్ల వ్యక్తమైన ఈ అసంతృప్తిని జాతీయస్థాయి ఉన్న ఇంకే రాజకీయ పక్షంవారూ తమకి అనుకూలంగా వినియోగించుకోలేక పోవటం కూడా చెప్పుకోదగిన విషయం.

కొత్తగా ఏర్పడిన తెలుగుదేశం పార్టీ అన్ని శాసనసభ స్థానాలకు పోటీవెయ్యడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. ఒక్క ఇందిరా కాంగ్రెసు మినహా మరే రాజకీయ పార్టీ అన్ని సీట్లకు తమ అభ్యర్థులని నిలబెట్టలేకపోవడం కూడా ప్రాంతీయపార్టీ విజయానికి దోహదం చేసింది.

ఎన్నికల ప్రచారం జోరులోకూడా కొత్తదనం వెల్లి విరిసింది. కాసెట్ల యుద్ధం ప్రజలని ఆకర్షించింది. తెలుగుదేశం అధ్యక్షుడు శ్రీ రామారావు రూపొందించిన 'ప్రచార 'రథం' దేశంలో ఎంతోమందికి ఆసక్తిని కలిగించింది. తెలుగుజాతి ఆత్మగౌరవాన్ని నిలబెట్టడానికి తమ పార్టీకి ఓటువెయ్యమన్న శ్రీఎన్.టి.ఆర్. నినాదం తెలుగుదేశం విజయానికి బాగా తోడ్పడింది. స్త్రీలకి ఆస్తిహక్కు, రక్షణ కల్పిస్తామన్న హామీ ఆడవారి ఓట్లని బాగా ఆకర్షించింది. కిలో బియ్యం రెండు రూపాయలకే యిప్పిస్తామన్న ఆయన మాట పేద, బడుగువర్గాల ప్రజల ఓట్లని ఆకట్టుకున్నది. ఇవన్నీ కలిసి తెలుగుదేశానికి అద్భుతమైన విజయాన్ని సాధించి పెట్టాయి.

ఆంధ్రప్రదేశ్ కొత్త ముఖ్యమంత్రిగా ఏకగ్రీవంగా ఎన్నిక అయిన శ్రీ ఎన్. టి. రామారావు తమ వాగ్దానాలన్నీ నెరవేరుస్తామని హామీ యిచ్చారు. కేంద్రంతో సహకరిస్తామని, జాతీయ సమైక్యతకి తమ పార్టీ కట్టుబడి ఉంటుందని స్పష్టం చేశారు.

రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి అందరి సహకారం తీసుకుంటూ ఆశ్రిత పక్షపాత రహితమైన, అందరికీ న్యాయం జరిగే నిష్కళంకమైన పరిపాలనని తెలుగుదేశం ప్రభుత్వం అందిస్తుందని అందరూ ఎదురుచూస్తున్నారు.

—ఎం. ఆర్.



ఆంధ్రప్రదేశ్ కొత్త ముఖ్యమంత్రిగా ఏకగ్రీవంగా ఎన్నికైన శ్రీ నందమూరి తారక రామారావు

# తాతా, బిర్లా, నెహ్రూ...




విమానాలని నిర్మించే ఇంజనీరులు లెక్కలు వేసి భ్రమరం ఎగరలేదంటారు. వాయు గమన శాస్త్రం ప్రకారం ఆ కీటకం ఎగర లేదని వారి వాదం. కాని, పురుగు వాయు గమనశాస్త్రం చ దు వు కో లే దు కదా ? అందుకని హాయిగా ఎగురుతూనే ఉంటుంది. శాస్త్రవేత్తలు తలలు పట్టుకుని పుస్తకాలు తిరగేస్తూనే ఉంటారు.

ఈ పద్ధతిమీదనే భారతదేశం ఒక దేశంగా మన్నలేదు. మన్నలేదనే ఎందరో విదేశీ నిపుణులు అంటూ ఉంటారు వారికి వంత పాడే దేశవాళీ నిపుణులకీ కొదువలేదు దేశవాళీ నిపుణులు " ఆధునిక " రాజకీయ సిద్ధాంతాలని చదువుకున్నవారు. భారతదేశం ఈ 'ఆధునిక''సిద్ధాంతాలని చదువుకుందా ? లేదనే అనుకోవాలి. ఆధునిక సిద్ధాంతాలని వేటినయినా చదువుకున్నా అవి ఏ లండన్ స్కూల్ ఆఫ్ ఇకనామిక్స్‌లోనో, హార్వార్డ్ విశ్వవిద్యాలయంలోనో నేర్చే సిద్ధాంతాలుకావు విచిత్రం ఏమిటంటే, ఇవేవీ చదువుకోకుండానే భారతదేశం ఒక దేశంగా కొనసాగుతోంది, అభివృద్ధి చెందుతోంది, ఒక తరంలోనే అగ్రరాజ్యం కావచ్చుకూడా.

భారతదేశంలో ''ఆధునిక'' సంస్థలు ఏవీ పెంపొందలేవుట. అందుకనే ఇది ఒక దేశంగా నిలువలేదుట. సరే, బాగానేఉంది కాని " ఆధునిక సంస్థ " అంటే ఏమిటి ? ''ఆధునిక సంస్థ''లలో వర్గంకాదు వ్యక్తి ముఖ్యం. వ్యక్తుల వలననే ఒక దేశం నిలవ గలదు అంటారు''నిపుణులు''. భారతీయులకి గతంలో కుటుంబం, కులాన్ని ఎలాగ నిలపాలో తెలుసు కాని నేడు ఆధునిక ప్రపంచానికి కావలిసిన సంస్థలని నిలపటం తెలీదుట. ఈ ఆధునిక సంస్థలు ఏమిటి ? శాసనసభలూ, రాజకీయపక్షాలూ, విశ్వవిద్యాలయాలూను. వీటిని భారతీయులు సక్రమంగా నిర్వహించ లేకపోతున్నారుట.

ప్రతి సమాజానికీ నిర్మాణాంశాలు కొన్ని ఉంటాయి — ఒక కట్టడానికి ఇటికలు ఉన్నట్టే. ప్రతి జీవికీ కూడా ఇలాంటి అంశాలు ఉంటాయి కదా ? చెట్లలోనూ, జంతువులలోనూ జీవకణాలు ఉంటాయి కదా? భారతీయ సమాజం యొక్క ప్రధాన నిర్మాణాంశం కుటుంబం. ఇది తప్పా ? పాశ్చాత్యదేశాలలో కుటుంబవ్యవస్థ క్షీణించి పోయినంతమాత్రాన భారతదేశంలోనూ క్షీణించుకుపోవాలా ? ఇదీ అనివార్యమా ? వాంఛనీయమా ? యూరోపులో మతం, సంస్కృతి వలన కుటుంబం ప్రాముఖ్యం పోయి వ్యక్తి ప్రాముఖ్యం పెరిగింది. భారత దేశంలో కుటుంబ వ్యవస్థ ఇంకా నిలవటానికి ఎన్నో గట్టి కారణాలు ఉన్నాయి.

భారతదేశానికి పారిశ్రామికాభివృద్ధికావాలి. అయితే, కుటుంబ వ్యవస్థ దీనికి అడ్డు వస్తోందిట. ఇది కొందరి సిద్ధాంతం. ఇదొక అర్థంలేని సిద్ధాంతం. అసలు పారిశ్రామికాభి వృద్ధిద్వారా తప్ప ''ఆధునీకరణం'' వీలు కాదనటంలో అర్థంలేదు. యూరోపు, అమెరికాలలో పారిశ్రామికాభివృద్ధి చరిత్ర తీసుకుంటే అది అక్కడ కొన్ని కుటుంబాల చరిత్రే అనిపిస్తుంది. పెద్ద పాశ్చాత్య వాణిజ్య సంస్థలు కుటుంబ సంస్థలే పశ్చిమ జర్మనీకి చెందిన క్రుప్, ఇటలీలోని ఫియట్, అమెరికాలో రాక్‌ఫెల్లర్, బ్రిటన్‌లో లీవర్ సంస్థలు కుటుంబ సంస్థలే కదా ? జపాన్‌లోని పెద్ద వాణిజ్య సంస్థలు సయితం కొన్ని కుటుంబాల చేత నడపబడేవే. సోనీ, హిటాచీ, నేషనల్ సంస్థలని కొందరు వ్యక్తులు ప్రారంభించారు. అవిచాలా పెద్దవయి పోయాయికాని వాటిని స్థాపించిన వారి కుటుంబాల వారే ఇంకా వాటిని నడుపుతున్నారు. ప్రస్తుతం కొన్ని అంతర్జాతీయ పాశ్చాత్య సంస్థల మీద కుటుంబాల అదుపులేనిమాట నిజమేకాని అది వేరేసంగతి. అసలు విషయం ఏమిటంటే, పాశ్చాత్యదేశాలలో కూడా పారిశ్రామిక సంస్థల పునాదులు కొన్ని కుటుంబాలు వేసినవే. తరువాత ఏమి జరిగితేనేమి ?

భారతదేశంలో పరిశ్రమలని అధికంగా స్థాపించినవారు కొన్ని కొన్ని ప్రముఖ కుటుంబాలకి చెందినవారే కదా ? ఒక తాతా అనంతరం మరొక తాతా, ఒక బిర్లా తరవాత మరొక బిర్లా–ఇదే జరిగేది. బొంబాయిలో తాతా, ఢిల్లీలో డి సి. ఎమ్; మదరాసులో కొఠారీ సంస్థలలో కొన్ని కుటుంబాల పెత్తనం ఎంతో ఫియట్, సోనీలతో కొన్ని



కుటుంబాల పెత్తనమూ అంతే పోయిన ఏడాది తాతా ఇండస్ట్రీస్ అధ్యక్షుడుగా జె. ఆర్. డి తాతా విరమించుకున్నప్పుడు ఆయన వారసుడుగా వచ్చినవారు పాల్కీవాలా కాదు, మూల్‌గావ్‌కర్ కాదు - జె ఆర్. డి. తాతా నప్తు ఆర్. ఎస్. తాతా. భారతదేశంలో కెల్లా అధునిక వ్యాపార సంస్థ ఏదంటే తాతాలదే అంటారు ఎందరో [ "ఆధునిక" అంటే అర్థం ఏమిటో వాళ్ళు సరిగ్గా చెప్పలేరనుకోండి. ]

భారతదేశంలోని పరి(శమలు కొందరి చేతులలో లేకపోయినట్లయితే ఇంకా బాగా పెరిగేవి, అంటారు కొందరు. ఇది అర్థంలేని మాట. (ప్రభుత్వరంగం ఎవరి చేతులలో ఉంది ? (ప్రభుత్వం చేతులలోనే కదా ? దానిలో ఎంత డబ్బు పోశారు ? అది ఎంత సమర్థవంతంగా నడుస్తోంది ?

ఇదంతా వ్యాపారం. రాజకీయాల సంగతి తీసుకుందాము. అందులోమా(త్రం కుటుంబాల పా(త తక్కువదా ? జవహర్‌లాల్ నె(హూ ఒక గొప్ప ఆధునికుడంటారు. యూరోపు నుంచి ఏవో గొప్ప సంస్థలని దిగుమతి చెయ్యటానికి (ప్రయత్నించాడంటారు. వాటిని భారతదేశంలో నాటడానికి కృషిచేశాడంటారు. కాని, ఆయన స్వంత వ్యాపారం రాజకీయాలు. ఈ వ్యాపారంలో ఆయన తాతా, బిర్లాలనే అనుసరించాడు. తమ కుమార్తెని రాజకీయాలలోకి తీసుకువచ్చి ఆమెని కుర్చీ మీద కూర్చోపెట్టటానికి ఆయన కృషి చెయ్యలేదూ ? భారతదేశంలో వాణిజ్య సంస్థలని కొన్ని కుటుంబాలు తమ అదుపులో ఉంచుకుంటున్నాయని అరిచేవారు నె(హూ కుటుంబం యొక్క స్వంత వ్యాపారం రాజకీయాలే అనీ, అందులో కుటుంబ పద్ధతి కొనసాగుతూనే ఉందనీ ఒప్పుకోరేమి ?

అసలు ఉన్న సంగతి ఏమిటంటే, "ఆధునిక" మయినది ఏమీలేదు – కొందరు నిపుణులు అనేట్లు పడమర నుంచి వచ్చిన దంతా ఆధునికం, తూర్పులో ఉన్నదంతా బూజుపట్టిపోయినదీ అంటే తప్పు (ప్రపంచంలో ఒకచోట ఆధునికంగా తోచేది మరొకచోట పాతదిగా తోచవచ్చు. సుమారు 5000 సంవత్సరాలపాటు భారత దేశంలో కుటుంబం ఒక సంస్థగా నిలిచి దేశాన్ని కూడా నిలబెట్టింది. ఇక దీని ఆయుష్షు అయిపోయింది ఫాషన్‌ని అనుస రించి ఇంకొక సంస్థ దేనినయినా ఎంచు కోవాలి — అనుకోవటం సహేతుకంగా ఉండదు. భారతీయ సమాజాన్ని కాని, భారత దేశాన్ని కాని పెరగకుండా అడ్డు నిలవలేదు కుటుంబం అనే సంస్థ ఎప్పుడూ. నిపుణులుగా చెలామణీ అయ్యేవారు తగినంత సాక్ష్యాన్ని చూపించకుండా దానిని తిట్టిపోసినంత మా(త్రాన దానిని వదులుకోవాలా ? మనదేశం ముందు ముందు ఎన్నో యుద్ధాలు చెయ్యవలసి ఉంది. వీటన్నిటిలోనూ కుటుంబం అనే సంస్థ మనకి బాగా పనికిరాగలదు !

# ఉద్యోగం

సుజీసేవ సుందరరామయ్య

'...ఏమండీ! నాక్కూడా ఉద్యోగం చేయాలనుంది!' రెండేళ్ళ క్రితం లలిత అన్నమాటలు విశ్వం చెవుల్లో మార్మోగుతున్నాయి.

ఆనాడు ఆమె మాటలను హాస్యంగా తీసుకొని ఆట పట్టించాడు తను.

అప్పటికి తమ పెళ్ళయి నాల్గేళ్ళయింది. బుజ్జిగాడికి మూడేళ్ళ వయసు.

'మీ దృష్టిలో ఆడదంటే భర్త అడుగులకు మడుగులొత్తుతూ అణిగి మణిగి వంటింట్లోనే పడివుండాల్సిన యంత్రం! స్త్రీకి స్వాతంత్ర్యం ఇవ్వాలంటే మీ చేతిలోంచి ఏదో అధికారం జారిపోతున్నట్లే మీరు ఫీలవుతారు... మీ మగవాళ్ళంతా స్వార్థపరులండి!' ఆవేశంతో పలికింది లలిత.

తను చప్పట్లు కొడుతూ, 'మార్వెలస్! కథలు గట్టా రాయాలంటే ఈ మాత్రం భావావేశంచాలు! నా మాట విని ఉద్యోగం సంగతి మర్చిపోయి కలం పుచ్చుకొని కథల్రాయవోయ్! అతి త్వరలో రచయిత్రిగా ఫేమసవుతావు!' అన్నాడు.

'ప్రతిదీ మీకు వేళాకోళంగానే వుంటుంది.. స్త్రీ స్వాతంత్ర్యం అవసరమని రెండు ముక్కలు చెబితేనే మీరు సహించలేక పోతున్నారు కదా! రేపు ఆదర్శాలను, అభ్యుదయ భావాలను కథల్లో ఏకరువు పెడితే మీరు నన్ను కాపురం చేయనిస్తారా?'

'చూడు లల్లీ! భార్యాభర్తలిద్దరికి అన్ని విషయాల్లోను ఒకే రకమైన అభిప్రాయాలుండాలని ఎక్కడాలేదు అయితే అవసరం దృష్ట్యా ఎవరో ఒకరు మరొకరి అభిప్రాయాలతో రాజీ పడాలి!'

'నేను ఉద్యోగం చేయటం మీ కిష్టంలేదు కదూ?'

'నిజమే! కాని అందుక్కారణం స్త్రీ స్వేచ్ఛకు అడ్డుతగలాలని కాదు! మా బుజ్జిగాడి భవిష్యత్తు దృష్ట్యా మనిద్దరిలో ఒక్కరే ఉద్యోగం చేయటం వాంఛనీయం! జీవన సముద్రంలో దారి తెలియక సతమతమయ్యే నావికుల్లాంటి వారు పసివారు తల్లికాని, తండ్రికాని వారి పాలిట దిక్సూచియై సరైన మార్గాన్ని చూపించి తమంతటి వారిని చేయాలి. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే మనిద్దరం ఉద్యోగాలు చేస్తూ కూర్చుంటే సరైన ఆలన పాలన లేక బుజ్జిగాడి భవిష్యత్తు దెబ్బ తినవచ్చు!'

'నన్ను క్షమించండి! మీ మనసులోని ఉద్దేశాన్ని తెల్సుకోలేక పోయాను. మీరు చెప్పిన దాంట్లో అసత్యంలేదు. నాక్కూడా బుజ్జిగాడికి బంగారు భవిష్యత్తును ఏర్పరచాలని వుంది. నేను కూడా కొద్దో గొప్పో సంపాదించ కల్గితే మీకు సంసార రథాన్ని లాగటంలో సాయం చేయటమే కాకుండా బుజ్జిగాణ్ణి పెద్ద పెద్ద చదువులు చదివించటానిక్కూడా అవకాశం వుంటుంది.'

ఆ నాటి లలిత మాటలను తను పెడచెవిని పెట్టాడు. కాని ఈనాడు ఆమె అన్న మాటల్లో నూటికి నూరుపాళ్ళ నిజం వుందన్న విషయం అవగతమౌతూంది.

తను చేసేది ప్రభుత్వోద్యోగమే!

తన సంపాదన నాల్గు అంకెల మీదే!

కాని పి ఎఫ్‌లోన్, కోపరేటివ్ బ్యాంకు లోన్, ఇన్సూరెన్స్, ఫెస్టివల్ ఎడ్వాన్స్ వగైరా కటింగ్స్‌పోగా తనకు నెలనెలా చేతికి వచ్చేది కొన్ని వందలు మాత్రమే...

ఆ వచ్చే డబ్బుతో నెలంతా గడవాలంటే గగనమే!

ప్రభుత్వం పుణ్యమా అని అప్పుడప్పుడు కరువు భత్యంలో పెరుగుదల వుంటుంది.

కాని ఏం లాభం?

కరువుభత్యం నూటికి నాల్గు రూపాయిలు పెరిగితే బజార్లో ధరలు ఎనిమిది రూపాయిలు పెరుగుతాయి. పెరుగుతున్న ధరలు ఓ పక్క, వచ్చే పోయే చుట్టాల తాకిడి మరో ప్రక్క, అనుకోకుండా అవసరమయ్యే ప్రయాణాలు వేరో ప్రక్క, రోగాలకయ్యే ఖర్చులు ఇంకో ప్రక్క మధ్యతరగతి మనిషిని వేధించుకు తింటున్నాయి.

ఈ ధరలు ఇలా పెరుగుతుంటే తన లాంటి మధ్య తరగతి వాళ్ళు నెలకు వచ్చే జీతం రాళ్ళతో పెళ్ళాం బిడ్డలను బ్రతికించటం కష్టం!

జీతం కాక అదనంగా ఏదైనా సంపాదన వుంటే తప్ప సంసారాన్ని సాగించటం సాధ్యం కాదు!

తను చేస్తున్న ఉద్యోగంలో మామూళ్ళు గట్రా దొరకవు! అసలు దొరికినా తీసుకొనే మనస్తత్వం కాదు తనది! ఏదైనా వ్యాపారం చేసి డబ్బు సంపాదించవచ్చు. కాని అందు క్కావలసిన ధనము, దక్షత తనకు లేవు. కాబట్టి తనకు మిగిలిందల్లా ఒక్కటే మార్గం! అది లలిత కోరిక తీర్చటం! అయితే ఇది తనకు సాధ్యమేనా?

గత కొద్ది నెలలుగా తను లలిత ఉద్యోగం కోసం ప్రయత్నం చేస్తూనే వున్నాడు. కాని తన ప్రయత్నాలేవీ ఆమెకు తెలియనివ్వటం లేదు. అందుక్కారణం సంవత్సరం క్రితం జరిగిన సంఘటనే! ఆ సంఘటన జరిగిన దగ్గర్నుంచీ తలెత్తి తను ఆమె వద్ద ఉద్యోగ ప్రస్తావన తీసుకు రాలేకపోతున్నాడు.

ఆ రోజు శనివారం...

తను రెండు గంటలకల్లా ఇంటికి వచ్చేశాడు.

తను ఇంట్లోకి అడుగు పెట్టగానే 'ఏమండీ! కోమలికి, మీ ఆఫీసులో ఉద్యోగం వచ్చిందటగా!' అని నిలదీసి అడిగింది లలిత.

తనకు తెలుసు! ఏదో రోజున లలిత తనని ప్రశ్న అడుగుతుందని.

'ఎవరు చెప్పారు?' అని అడిగాడు తను.

'ఇంతకు ముందే కోమలి వచ్చి వెళ్ళింది. పోస్టింగ్ ఆర్డర్ కూడా చూపించింది. ఇంటర్వ్యూకు వెళ్తే ఈ ఉద్యోగం తప్ప కుండా నాకే వచ్చేది. ఇంటర్వ్యూ కమిటీ చైర్మన్ మీ ఆఫీసరేనట! ఆయనకు మీరంటే చాలా గౌరవం, ఇష్టమూనట కదా! మరీ జాబ్‌కు అప్లయ్ చేయమని నా కెందుకు చెప్పలేదండి?' మనసులోని వ్యధనంతా ఒక్కసారే బయట పెట్టింది లలిత.

'లలితా! మంచీ చెడులను గుర్తించే విజ్ఞత నాక్కూడా వుంది. ఆఫీసులో పోస్ట్ వచ్చిందని తెలుసు! ఇంటర్వ్యూ కమిటీ చైర్మన్ మా ఆఫీసరనీ తెలుసు! నేను చెబితే ఆయన తప్పకుండా నిన్ను సెలక్ట్ చేస్తారని కూడ నాకు తెలుసు! కాని నా మంచితనాన్ని, పరపతిని ఈ రకంగా క్యాష్ చేసుకోటం నా కిష్టంలేదు. ఉద్యోగం అన్నది అర్హతను బట్టే లభిస్తే బాగుంటుందని నాఅభిప్రాయం. మనింట్లో నేను ఉద్యోగం చేస్తున్నాను. తిండికి లోటు లేకుండా రోజులు గడుస్తున్నాయ్. కాని కొన్ని కుటుంబాలు ఇంట్లో చదువు కొన్నవారు వున్నప్పటికీ ఉద్యోగం ఏ ఒక్కరికి లేని కారణంగా పస్తులుంటున్నాయి. అలాంటి కుటుంబాల్లో వారికి ఈ ఉద్యోగం వస్తే కొన్ని జీవాలకు క్షుద్బాధ తప్పినట్టేగా! మరో సంగతి ఏమిటంటే ఇది కేవలం టెంపరరీ పోస్ట్! మూడు నెలలు మాత్రమే!—

తన సమాధానంతో లలిత తృప్తి పడలేదు

'కోమలి నాకంతా చెప్పింది. పేరుకు టెంపరరీ అయినప్పటికి పర్మనెంట్ అయ్యే అవకాశాలున్నాయట! మీరీ ఉద్యోగానికి రికమెండ్ చేయకపోయినా నేను బాధపడేదాన్ని కాను! నా బాధల్లా ఒకటే! మీ ఆఫీసులో కాళీ వచ్చిందని తెల్సి కూడా గుప్తంగా వుంచారు. ఇంటర్వ్యూకు వెళ్ళి నా అదృష్టాన్ని నేను పరీక్షించుకొనే దాన్నిగా! ఉద్యోగం అర్హతనుబట్టే యివ్వాలన్నారు కాని. ఇప్పుడు

# శ్రీ పిలకా గణపతిశాస్త్రి కాలధర్మం

ప్రముఖ రచయిత, కవి, పండితుడు శ్రీ పిలకా గణపతి శాస్త్రిగారు జనవరి 2 వ తేదీ రాత్రి 2 – 35 ని. లకు మదరాసులో తమ 72 వ ఏట కాలధర్మం చెందారు.

శ్రీ శాస్త్రిగారికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె ఉన్నారు. ఆయన ముగ్గురు సోదరులలో ఇదరు సుప్రసిద్ధ హోమియో వైద్యులు శ్రీ దీక్షితులు, శ్రీ కృష్ణమూర్తి గారు. మూడవ సోదరుడు శ్రీ నరసింహ మూర్తి ప్రముఖ చిత్రకారులు.

శ్రీ గణపతిశాస్త్రిగారికి ఆంధ్రపత్రికతో దాదాపు మూడు దశాబ్దాల అనుబంధం ఉన్నది. ఆంధ్రపత్రిక, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, భారతిలలో ఆయన దాదాపు రెండు దశాబ్దాలపాటు పనిచేశారు. పది సంవత్సరాల క్రితం ఉద్యోగ విరమణ చేశారు.

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఆయన కధానికలు ఎన్నో వెలువడి అసంఖ్యాక పాఠకుల ఆదరణని చూరగొన్నాయి. 'ప్రాచీన గాథా లహరి' అన్న శీర్షిక క్రింద ఆయన రాసిన కథలు ధారావాహికంగా ప్రచురింపబడి ఆబాల గోపాలాన్ని ఆకట్టుకున్నాయి.

ఆంధ్రపత్రిక ఆదివారం అనుబంధంలో శాస్త్రిగారి మహాభారతం, దేవీభాగవతం పరంపరగా ప్రచురితం అయినాయి. ఆయన రాసిన 'శ్రీకృష్ణభాగవతం' ప్రస్తుతం ప్రచురింపబడుతూ ఉంది.

శ్రీ గణపతిశాస్త్రిగారు కవిగా, నవలా రచయితగా కూడా ప్రసిద్ధులైనారు. ఆయన రాసిన 'విశాల నేత్రాలు' నవల 1966 – 67 లో ఉత్తమ నవలగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డుని అందుకున్నది. ★

**తాజా వార్తలకు ఆంధ్రపత్రిక దినపత్రిక చదవండి!**



## ఉద్యోగం

జరిగిందేమిటి? ఆ ఉద్యోగం ఓ పోలీసాఫీసర్ కూతురుకు వచ్చింది. ఉద్యోగం ఆమెకు అవసరం కాదు! కేవలం హాబీ! మరిప్పుడు ఆ ఉద్యోగం ఎన్ని జీవాలకు క్షుద్బాధ తీర్చ కల్గిందో చెప్పండి?'

తను వెంటనే సమాధానం చెప్పలేక పోయాడు. కారణం ఆమె మాటలో అసత్యం ఏ మాత్రం లేదు.

'అసలు ఉన్న కొద్దీ మీకు ఇలాంటిభావాలు కల్గుతున్నాయేమిటండీ? ఒకింట్లోనే ఇద్దరు ఉద్యోగం చేస్తే అది నేరమా? దేశ ద్రోహమా? దాని మూలంగా నిరుద్యోగ సమస్య పెరుగుతుందా?

మరి ఒక ఇంట్లోనే కుటుంబ సభ్యులందరి పేర్లతోనే కాక, కుక్క, పిల్లి వగైరా పెంపుడు జంతువుల పేర్లతో ఆస్తిపాస్తులను రాయించి ఇన్‌కమ్‌టాక్స్ ఎగగొట్టడం న్యాయమేనా? అది దేశద్రోహం కాదా? సామ్యవాదానికది గొడ్డలి పెట్టు కాదా?

కేవలం నేనొక్కదాన్ని ఉద్యోగం చేస్తేనే దేశమంతా కన్నీరు కారుస్తుందా?—'

'సారీ! లలితా! ఈ విషయాన్ని వింద కింత సీరియస్‌గా తీసుకొంటున్నావ్? ఉద్యోగం కావాలని నీవు పదే పదే అడగనవసరం లేదు! ఏదో నాటికి నీవు ఉద్యోగిని వవుతావు! నేనే నీ కోసం ఉద్యోగం సంపాదించి పెడతాను... ప్లీజ్... వెయిట్ ఫర్ సమ్ టైమ్...'

'ఉద్యోగం చేయాలన్న కోరిక నాలో చచ్చి పోయిందిలెండి! ఇంక ముందు మీ దగ్గర ఈ ప్రస్తావనే తీసుకురాను, సరేనా?' అంటూ కొంగుతో కళ్ళు అద్దుకొంది

ఆనాటి సంఘటన గుర్తుకురాగానే విశ్వం కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

మనసులో సంచలనం కల్గింది.

వివేకం వెన్ను తట్టింది.

ఆత్మ విశ్వాసం అభయమిచ్చింది.

నెమ్మదిగా లేచి నిలబడ్డాడు.

'వెంటనే శేషగిరిని కల్సుకొని లలిత ఉద్యోగం గురించి అటో ఇటో తేల్చుకోవాలి...' అనుకొంటూ వరండాలోంచి వంటగదిలోకి వచ్చాడు.

తడిసిన బొగ్గులు కావట చేత కాబోలు పొయ్యి సరిగ్గా మండటంలేదు. విసనకర్రతో విసురుతూ పొగమధ్య ఉక్కిరిబిక్కిరవుతోంది లలిత

"లల్లీ! నేను శేషగిరి దగ్గరకు వెళ్ళొస్తాను!" అన్నాడు విశ్వం ఉత్సాహంగా.

"అంత అర్జంటు పనేమిటండీ? ఓ ప్రక్క ముసురుపట్టి బయట వర్షం కురుస్తుంటేనూ..." అంది లేచినిలబడుతూ.

"ఇలాంటి సమయంలోనే వాడు దొరుకుతాడు హోటల్ గదిలో ...." అన్నాడు చొక్కా తొడుక్కుంటూ.

శేషగిరి విశ్వానికి క్లాస్‌మేట్. స్కూల్ ఫైయిల్ కావటంతో తండ్రి చేస్తున్న రోల్డ్ గోల్డ్ వ్యాపారాన్ని చేపట్టాడు. వ్యాపార దక్షత వల్ల అతి తక్కువ కాలంలోనే ఊళ్ళోని ప్రముఖ వ్యాపారవేత్తగా పేరుపొందాడు. డబ్బుకు కొదువలేదు విలాస జీవితానికి అలవాటు పడ్డాడు. ఎన్నో వ్యాపకాలు వున్న మనిషి కావటం చేత అతని దర్శనం దొరకటమే కష్టం. ఆ ముందు రోజే అతను ఊళ్ళోకి వచ్చాడని తెలియటం చేత విశ్వం అతని దగ్గరకు ప్రయాణమయ్యాడు. చీర కొంగుకు చేతులు తుడ్చుకొంటూ వరండాలోకి వచ్చింది లలిత.

"ఆయన్ని ఈ వర్షంలో కల్సుకోకపోతే

(60 వ పేజీ చూడండి)

## ఇస్రో ప్రదర్శన

అంతరిక్ష ప్రదర్శనలో భారతీయులు సాధిస్తున్న ప్రగతిని తెలియచేసే ప్రదర్శన ఒకటి ఇటీవల పశ్చిమ జర్మనీలో జరిగింది. భారతీయ పరిశోధనా సంస్థ ఇస్రో, జర్మనీ పరిశోధనాసంస్థలు దీనినిసంయుక్తంగా నిర్వహించాయి. అంతరిక్ష పరిశోధనలో రెండు దేశాల మధ్య 1971 లో ఒక ఒప్పందం కుదిరింది. ఆ తరువాత క్రమేణా ఇది ఇతర సాంకేతిక రంగాలకు విస్తరించింది. ఇటీవల భారత దేశం ప్రయోగించిన ఉపగ్రహాలు జర్మనుపౌరుల దృష్టిని ఆకర్షించాయి. టెలి కమ్యునికేషన్స రంగంలో వీటి ప్రాముఖ్యతను జర్మను పౌరుల దృష్టికి తీసుకురావడం జరిగింది.

# వారఫలం

28-1-1983 శుక్రవారం మొదలు
3-2-1983 గురువారం వరకు

**♈ మేషం:** పరిస్థితులు చాల విధాల అనుకూలం. ప్రతిభ రాణించే సమయం, పదిమందిలో పేరు తెచ్చి కొనే అవకాశం గలవారం. భారీ వ్యాపార మై, అది పత్రిక, గ్రంథ ప్రకటన మైతే మంచి లాభం చేకూరు తుంది. స్త్రీలకు: ఆదాయం, అభిమానుల వలని మేలు, ఆత్మీయులు యింటికి రావటం జరుగు తుంది.

**♉ వృషభం:** 'నిజమాడితే నిష్ఠురమే' అని అనిపిస్తుంది కొన్ని విషయాలలో, గృహ విషయాలు ఎంతో శ్రద్ధాసక్తులతో సరి చేసు కోవటం అవసరం. బంధు తాకిడి, తమ్మూలంగా వ్యయం చెప్పదగిన అంశాలు. స్త్రీలకు: విద్యార్జనావకాశాలు, కొందరకు ఉద్యోగావకాశా లుంటాయి.

**♊ మిధునం:** ఆదాయం గలవారం కళా సాహితీ రంగాలలో సదవకాశాలు లభిస్తాయి. కొందరకు ప్రయాణంలో 'ప్రమాదం' చెప్ప అనువైన గ్రహస్థితి గలదు. చాల మంది ఆస్తి పెంపొందించే ప్రయత్నాలు చేస్తారు. స్త్రీలకు: అన్ని రంగాలలో అభివృద్ధి చెప్ప దగి యున్నది.

**♋ కర్కాటకం:** విలువగల వస్తువులు సేకరిం చుకో గలుగుతారు ఉపయుక్తములైన సంబంధములు, మిత్రులతో గోష్ఠి ఏర్పడే అవకాశ మున్నది. న్యాయంగా ఒకానొక విషయంలో మీకు మెలు జరుగ నున్నది. స్త్రీలకు: నూతన విషయాలు గ్రహించటం, వృత్తి ఉద్యోగాల యందభివృద్ధి చెప్పదగిన అంశాలు.

**♌ సింహం:** ఆదాయ మున్నది. చాల మందికి చేతికి అంద వలసిన పైకం అందుతుంది. అప్పులు కూడా వసూలయ్యే మార్గ మున్నది. స్త్రీలకు: రాజకీయంగా మేలు, దూర ప్రాంతాలకు ప్రయాణం చేయ వలసి రావటం కొందర విషయాలలో చెప్ప దగిన అంశాలు.

**♍ కన్య:** కళా సాహిత్య రంగాలలో కొందరకు సముచిత మైన అభివృద్ధి చెప్పదగి యున్నది అలంకారాని కి అనువైన వస్తువులు సేకరించుటకు వీలున్నది. నూతన వ్యక్తులను కలిసికొనే అవకాశం, నూతనాంశాలు తెలిసికొనే అవకాశం, రాజకీయంగా చాలమందికి మేలు జరిగె అవకాశ మున్నది. స్త్రీలకు: ఆదాయం, అభివృద్ధి గౌరవం అన్ని విధాలా చెప్ప దగిన వారమే

**♎ తుల:** వృత్తి ఉద్యోగాలలో, సాహితీ రంగాన, రాజకీయ రంగాన సాంఘిక రంగాన, మికు మేలు జరుగ గల దని చెప్ప వలసి యున్నది. స్త్రీలకు విలాస వస్తు సేకరణకు, విందు భోజనాలకు అవకాశం గౌరవస్తులతో సంభాషణలు చెప్పదగిన అంశాలు.

**♏ వృశ్చికం.** మీ ప్రతిభ రాణించే అవకాశాలు ఏర్పడ గలవు. మి ఆదాయం అభివృద్ధి చెంద గలదు. అనుకూలత అన్ని రంగాలలో ఏర్పడ గలదని గ్రహించాలి. స్త్రీలకు: ఉద్యోగంలో కొందరకు 'ప్రమోషన్' లభించే అవకాశా లుంటాయి.

**♐ ధనుస్సు.** ధన విషయంలో గాని, వృత్తి విషయంలో గాని, గృహ విస్తరణ కార్యక్రమంలో గాని, సాహితీ పరంగా గాని, రాజకీయ రంగాన గాని, మీకు ఏ విధంగా యిబ్బంది రాదు. ప్రగతికి అనువైన కాలమే స్త్రీలకు: నగలు వస్త్రాలు, సేకరించుకొనే అవకాశ మున్నది.

**♑ మకరం:** మీ మేలు కోరినవారు, మీకు అనుకూలత చేకూర్చ గలవారు, మీరు కోరిన వస్తువులను సేకరించు కొనుటకు అనువైన వారం. స్త్రీలకు: శుభ కార్య ప్రస్తావనలతో, బంధువుల హడావుడి తో వారం గడచి పోతుంది.

**♒ కుంభం:** ప్రజా రంగంలో మి కీర్తి ప్రతిష్ఠలు అతిశయింప గలవు సాహితీ పరంగా మీకు సదవకాశాలు లభించ గలవు. దూర ప్రాంతాలకు ప్రయాణించ వలసిన పరిస్థితులు ఏర్పడ వచ్చు. స్త్రీలకు: నూతన ప్రయత్నాలు ఫలిస్తాయి. బంధు గోష్ఠికి అవకాశం గలవారం

**♓ మీనం:** అన్ని వ్యవహారాలను మిక్కలి శ్రద్ధాసక్తులతో నెరవేర్చి కోవాలి. పోయిన వస్తువుల వదలి నూతన మైనవి సేకరించుకో ప్రయత్నించాలి. గౌరవ పదవి కొందరకు లభించ వచ్చు. స్త్రీలకు: ఉన్నత విద్యావకాశాలు ఫలిస్తాయి. సమయానికి ధనం అంది అవసరాలు తీరుతాయి.

— విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి ★

# వ్యక్తిగతం



స్థానం నరసింహారావుగారు ఆడ వేషాలు వేసి ప్రసిద్ధి పొందారు. ఇప్పుడు సినిమాలలో మగవారు ఆడ వేషాలు వెయ్యటం చాలా తక్కువ! కాని, ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు డస్టిన్‌హాఫ్‌మాన్ "టూట్సీ" అనే సినిమాలో ఆడ వేషాలు వేసే ఒక మగ నటుడుగా వేషం వేస్తున్నారు...



ఆయన అసలు ఆస్ట్రియా దేశానికి చెందినవాడు. తన పదిహేనవఏట హైందవ మతాన్ని పుచ్చుకున్నాడు. ఇప్పుడు వయస్సు 60. అమెరికాలో (సిరక్యూస్ విశ్వవిద్యాలయంలో) మానవ తత్వశాస్త్రంఅధ్యాపకుడుగా పనిచేస్తున్నాడు. రిటయిరయిన తర్వాత (ఆది శంకరాచార్యులవారి రాష్ట్రం కనుక) కేరళలో స్థిరపడిపోతాడుట. "హైందవ మతం క్షీణించటంలేదు బాగా అభివృద్ధి చెందుతోంది" అని ఆయన నమ్మకం. రజనీష్ లాంటి "గురువు"లని చూస్తే ఆయనకి అసహ్యం. ఎవరూ ఎవరిని మతం మార్చటానికి ప్రయత్నించకూడదు. ఇష్టం వస్తే—తనలాగే—వారే మారుతారని 6 అడుగుల 5 అంగుళాల పొడుగు సన్యాసి డాక్టర్ అగ్‌హానందభారతి అంటాడు. ఆయనకి జర్మన్, ఇంగ్లీషు, ఫ్రెంచి, హిందీ, బెంగాలీ, గుజరాతీ, టిబెట్‌భాష, సింహళ భాష, లాటిన్, గ్రీక్, సంస్కృతం, పాలీ వగయిరాలు వచ్చు...



క్రైస్తవ మతాధిపతి పోప్‌ని చంపటానికి ప్రయత్నించినమెహమెట్ అలీ ఆగ్‌కా జెయిలులో ఉన్నాడు. తనని ఈ పని చెయ్యటానికి పురమాయించినవ్యక్తి బల్గేరియా దేశం యొక్క విమాన సంస్థ (బాల్కన్ ఎయిర్‌లయిన్‌స్) అధిపతి ఇకానోవ్ ఆంటోనోవ్ అని అతను అంటున్నాడు. కొంతదాకా సాక్ష్యం ఆగ్‌కా ఆరోపణని బలపరిచేట్లే ఉందని ఇటలీ పోలీసువారు అంటున్నారు.

## (గత సంచిక తరువాయి)




గిరిజను ఆ రోజు వుండిపొమ్మంది. ఉంటే గారెలు చేసి పెడ్తానంది. అలా మాట మార్చి పనుల్లో నిమగ్నమైనా— మనస్సు రవిచంద్ర దగ్గరకే పరుగు తీస్తోంది.

తన భర్త మరణ పర్యంతం తన దుఃఖంలో సంతోషంలో భాగం పంచుకుంటానని ప్రమాణం చేసిన భర్త సాహిత్యతో వున్నాడు.

తనను ప్రేమించినట్లే— తనను లాలించినట్లే— తనను ముద్దుచేసినట్లే— అంతే ప్రేమగా— కోరికగా సాహిత్యతో వుంటున్నాడా ? ఇన్నాళ్ళ సాహిత్యను తమ మధ్యకు రానిచ్చేది కాదు— మూడో మనిషికి తమ మధ్య స్థానం లేదు— బయట మనిషిని— తలపుల్లోకి రానిచ్చేదికాదు. కాని గిరిజ లాంటి దగ్గిర స్నేహితులు— ఆత్మీయులు వచ్చినప్పుడు తప్పనిసరిగ ఆ మూడోమనిషిని తెస్తున్నారు. ఇది కల్పనకాదు, భ్రాంతికాదు— సాహిత్య రవిచంద్ర రెండో భార్య— చట్టం ఒప్పుకోకపోయినా, ఆ పెళ్ళి పెళ్ళికాదు అన్నా— ఎది నిజంకాదు—చెల్లదుఅన్నా— రవి చంద్ర సాహిత్యతో కాపురం చేస్తున్నమాట వాస్తవం— దానిని ఎవ్వరూ కాదన లేరు.

రాత్రి రవిచంద్ర సాహిత్యను దగ్గిరపెట్టుకొనేనా తనకు ఫోన్ చేశాడు ? అదంతా తనమీద ప్రేమలే అనుకుంది. వెళ్ళేటప్పుడు అందుకే అంత హుషారుగా వున్నాడు— కారులో వారిద్దరే ప్రయాణం చేసి వుంటారు— రవిచంద్ర— అందమైన అమ్మాయి ప్రక్కన వుంటే చేతులు వూరుకోవు... ఇంకా దీరజ్ పుట్టక మునుపు— ఎన్నో కొంటె పనులు చేసేవాడు— వూపిరి బిగపెట్టే పనులు— చేసేవాడు.

"కారులో దూరప్రయాణం బోర్‌గా వుందా! అందమైన అమ్మాయి ప్రక్కన వుంటే బోర్ ఏమిటి? అందులో పెళ్ళాం అయితే ఇక చెప్పనే పని లేదు— ఏదీ ఇలా చెయ్యి ఇవ్వవూ... కాస్త దగ్గరకు రా— నేను డ్రైవ్ చేస్తున్నా నాకున్నది ఒక చెయ్యి" అంటూ తన చెయ్యి పట్టుకుని గుండె మీద కాసేపుపెట్టుకుని —ఆచేతిని వడిలో పెట్టుకున్నాడు. వులిక్కిపడి లాగేసుకుంది.

"అక్కడ కరెంటు తీగేమైన తగిలిందా ! షాక్ కొట్టిందా !" అంటూ పకపక నవ్వి "నీవు హెరాల్డ్ రాబిన్స్ నవలలు చదవలేదా లక్ష్మీ—వాడి హీరోలు ఎయిరోప్లేన్స్‌లోనే ఎక్కి దిగే లోపల ఘనకార్యాలు చేసేస్తారు. వాడు ఎయిరోప్లేన్‌లో చేయంగ— మనం మన కారులో— నీవు...నేను..."

క్లైమాక్స్ సీనులో, కారు పోతుంటే — భయంగ కళ్ళు మూసుకుంది. కారును రోడ్డు నుంచి ప్రక్కకు పోనిచ్చి — గతుకుల రోడ్డుపై పడుతూ లేస్తూ వెళ్ళి ఓ చెట్టు చాటుకు తీసుకు వెళ్ళాడు.

"ఫారిన్‌లో ఇదొక క్రేజ్— కారులో ప్రేమట. అందుకే క్లైమాక్స్‌లో చెట్టుకు గుద్దేస్తారు —" అంటూ నవ్వాడు లక్ష్మిని దగ్గరగా— మరీ దగ్గరగా తీసుకుంటూ.

దీరజ్ పుట్టాక — పుట్టింటి నుంచి వస్తుంటె ట్రైన్‌లో ఫస్ట్‌క్లాస్‌కంపార్ట్‌మెంటు కాబిన్ తలుపు మూసి — వచ్చి ప్రక్కన పడుకున్నాడు — రాత్రి ప్రయాణం— రైలు మరీ వేగాన్ని పుంజుకుంది — రైలు కుదుపుతో కుదుపు కలుపుతో ......

"అత్తగారు — అల్సేషన్‌లా కాపలా వుంది. దగ్గరకు చేరనీయలేదు. చూడు ఎలా చిక్కిపోయానో— మూడు నెలలు — మరింకోసారి నో పుట్టిళ్ళు..."

అలా తనకు ప్రతి నిముషం— గంట ఈ పది సంవత్సరాలు మైమరపించిన రవిచంద్ర — రవి తన భర్త — సాహిత్యతో తిరుగుతున్నాడు — అని అనుకుంటే గుండె గట్టిగా పట్టుకున్నట్లైంది.

ఆరాటం అంతకంతకు ఎక్కువవుతుంది. చిరు చెమట ముఖాన్ని కప్పేసింది — వెన్నులో సన్నగా చలి ప్రారంభమైంది — ఆ బాధలో మొదలు నరికిన మహావృక్షంలా— క్రిందికి వాలిపోయింది. "అమ్మో!" అంటూ గిరిజ — లక్ష్మిని వళ్ళో పెట్టుకుని — బిగ్గరగా ఏడ్వసాగింది.

* * *

సాహిత్య— రవి చంద్రలు — అమరావతిలో వున్న అమరేశ్వరుని ఆలయానికి వెళ్ళారు. ఆలయ ప్రవేశం చేసేముందు ప్రక్కనే వున్న కృష్ణలో కాళ్ళు కడుక్కొని, నీళ్ళు తల మీద చల్లుకున్నారు.

రవిచంద్ర చెయ్యిపట్టుకుని సాహిత్య గట్టుపై నిలుచుని — కృష్ణానది అందాన్ని చూచింది. పడమటి నుంచి తూర్పుకు ప్రవహిస్తున్న కృష్ణానది అక్కడ వంపు తిరిగి ఉత్తరం నుంచి దక్షిణానికి పోయింది. అమరేశ్వరుడు దేవతల కోరికపై అక్కడ వెలిశాడు.

నదులు దిక్కులు మారిన చోట — పవిత్రంగ ఎంచి సాధారణంగ ఆలయాలు నది వొడ్డున కట్టుతారు.

గంగ తల మీద వున్నా — గంగ ఎక్కడ ప్రవహిస్తుంటే అక్కడ శివుడు వెలుస్తుంటాడు. సాధారణంగ శివాలయాల్ని గంగ వొడ్డున చూస్తాం.

రవిచంద్రను తీసుకుని దిగంతాలకు వెళ్ళిపోదాం అని వుంది సాహిత్యకు.

"ఇక్కడే వుండి పోయేలా వున్నావు— ఆలయం చూడవా" అంటూ చెయ్యిపట్టుకుని నడిపించుకుంటూ ఆలయ ప్రవేశం చేశాడు.

మూలవిరాట్‌ను చూసి సాహిత్య కళ్ళు పెద్దవైనాయి. పాలరాతిలో వున్న లింగం— పదిహేను అడుగుల పొడవుంది. పూజారి మెట్లమీదగ వెళ్ళి పూజ— అభిషేకం చేస్తున్నాడు.

"దేవుడుకాబట్టి ఎంతపొడగైనా పెంచేస్తాడు. నీ పొడవు ఆరంగుళాలు చాల్లే అన్నాడు." సాహిత్య చెవిలో గుసగుసలాడినాడు రవిచంద్ర. ముద్దమందారంలా వున్న సాహిత్యను చూసి— పూజారి పూజకు రమ్మని పిలిచాడు.

ఇక్కడ పుణ్యక్షేత్రం చాలా ప్రసిద్ధమైనది. కృష్ణానది ఒడ్డున మహాలింగమూర్తి వుండటమే కాక— స్థలపురాణం ప్రాముఖ్యత కూడా వుంది. ఇక్కడ శివుడ— ప్రాణేశ్వరుడు— అగస్త్యేశ్వర— కోటేశ్వర— సోమేశ్వర— పార్వతీశ్వర పంచలి గాలలో వుద్భవించాడు. అదీగాక, శివభక్తుడైన తారకాసురుడు, తన ప్రాణాన్ని శివలింగంలో వుంచి— తన కంఠంలో వుంచుకున్నాడు. కుమారస్వామి తారకాసురుని కంఠాన్ని ఛేదించినప్పుడు ఐదు ముక్కలైన లింగము ఐదు స్థలాలలో పడింది.

భీమేశ్వరంలో ఒకటి (కాకినాడ), పాలకొల్లు రెండు— మూడు ద్రాక్షారామము, నాల్గు కోటిపల్లి (ఈస్టుగోదావరి)లో అంటూ— కధ చెప్పి— హారతి యిచ్చాడు— పూజారి. అవి కూడా చూడాలి అంటూ మరో ప్రయాణానికి ప్లాను వేసింది సాహిత్య.

పూజారి దక్షణ ఇచ్చి — దగ్గరలో శిధిలమైన బౌద్ధ స్థూపం చూశారు. అమరేశ్వరాలయంలో ఉన్న తెల్లరాయిలో వున్న లింగము— అసలు, అశోకుని స్థంబమని, తర్వాత, శివలింగముగా మార్చి 11 వ శతాబ్దంలో మార్పు జరిగిందని చెప్తారు.

బౌద్ధ విగ్రహాలు — విరిగిన శిల్పాలు — ఒక్క దగ్గర చేర్చిన మ్యూజియం చూసి — చెట్టు క్రింద చేరారు.

వెల్లకిలా పడుకున్న రవిచంద్ర — చెట్టు కొమ్మపై పిచుకల సరసాలు చూస్తూ — "ఇప్పుడు మనం పిచుకల్లా మారిపోతే ఎంత బాగుంటుంది ... పూర్వం దేవతలు ఏ రూపం కావాలంటే ఆ రూపంలో మారి సెక్స్ జరిపించేసేవారు— అలాగేకాదా అశ్వినీ— దేవతలు పుట్టింది."

**జరిగిన కథ—13 :** రవిచంద్ర 'రచన' వార మాస పత్రికలో మేనేజింగ్ ఎడిటర్‌గా పనిచేస్తుంటాడు. అతనికి పి.ఎ. గా చేరిన సాహిత్య తన అభిమాన రచయిత రవిచంద్రను ఎంతగానో ప్రేమిస్తుంటుంది. ఆమెకు ఎంత దూరంగా వుండాలనుకుంటున్నాడో అంతగా దగ్గరవుతుంటాడు రవిచంద్ర. ఎలాగైనా అతన్ని తనవాడిగా చేసుకోవాలని నిర్ణయించుకొంటుంది. జూలాజికల్ పార్క్‌లో రవిచంద్ర లీలలు చూసిన గిరిజ ఆ విషయం ఫోన్ ద్వారా లక్ష్మికి తెలియజేస్తుంది. ఇక ఇలా ఎంతోకాలం సాగదని, దాగదని తెలుసుకొన్న రవిచంద్ర, సాహిత్యలు కలకత్తా పోయి పెళ్ళి చేసుకోవడానికి నిర్ణయించుకొంటారు. కానీ ఇంట్లో పరిస్థితి అర్థం చేసుకొన్న రవిచంద్ర ఆ పని చేయలేకపోతాడు. ఫలితంగా సాహిత్య అతనిని ఛీదరించుకొంటుంది. చచ్చిపోవడానికి స్లీపింగ్ టాబ్లెట్స్ మింగిన సాహిత్యను పెళ్ళి చేసుకొని బ్రతికిస్తాడు రవిచంద్ర. రవిచంద్ర, సాహిత్యలు హనీమూన్ ట్రిప్ క్రింద అమరావతి వెళ్తారు.



రవిచంద్ర మాటలు వినటం లేదు సాహిత్య. పిచుకలను చూస్తున్న తన మనస్సు మరేదో ఆలోచిస్తోందని రవిచంద్ర గ్రహించాడు.

"ఏయ్ సత్యా!" అని తియ్యగా పిలిచాడు. చెట్టా పట్టా లేసుకుని తిరిగారు. ప్రేమపక్షుల్లే చెట్టు క్రింద చేరారు. ఎంత ఆనందంగా వున్నారు. ఈ ఆనందం రేపు వుంటుందా! రవిచంద్ర ఈరోజు కాకపోయిన రేపు హైదరాబాదు వెళ్ళితే— వాళ్ళింటికి వెళ్ళి పోతాడు. చంద్రుని కోసం ఎదురు చూసే — చకోరిలా— తను రవిచంద్ర కోసం — ఎదురు చూడాలి. అతిథిలా వచ్చి పోతాడు— ఆ దుఃఖం ఈ ఆనందాన్ని మింగేసింది.

"డాడీ" పిల్లవాడి స్వరం వినిపించి అప్రయత్నంగ చూశాడు రవిచంద్ర.

ధీరజ్ పిలిచినట్లే వుంది.

తమలాగే— చూడ్డానికి వచ్చిన యాత్రికులు— అటు పోతున్నారు— వాళ్ల అబ్బాయి — తండ్రి చెయ్యి పట్టుకుని పోతున్నాడు. వారినే చూస్తున్న రవిచంద్రను చూసిన సాహిత్య అధరాలపై శుష్కహాసం విరక్తిగా కదిలింది.

అలసిపోయిన జంట ప్రొద్దుక్కుంగే వేళకు గదికి చేరుకున్నారు.

వస్తూ లీలామహల్లో ఇంగ్లీష్‌సినిమాచూద్దాం అనుకున్నారు.

సాహిత్య గబగబ స్నానాదులు ముగించి డ్రెస్ చేసుకుంటూంది.

రవిచంద్ర ఇంటికి ఫోన్ చేశాడు. ఇలకా రెండు రోజుల పని వుంది, అని చెప్పటానికి. ఎంతకీ ఇంట్లో ఫోన్ ఎవ్వరూ ఎత్తలేదు. అవతల రింగ్ అవటం వినిపిస్తూనే వుంది. ఆ నిశ్శబ్దం భయం గొలుపుతూంది. తను లేనప్పుడు లక్ష్మి ఎక్కడికీ పోదు. కాశీ ఏమైనాడు? రవిచంద్ర భృకుటి ముడుచుకుంది

ధీరజ్ ఈ వేళకి ఆడుకుని ఇంటికి చేరుకుంటాడు కదా! అలాగే పట్టుకున్నాడు ఫోన్‌ను — ఎప్పటికో ఫోన్ ఎత్తిన కాశీ — "హలో" అన్నాడు. "కాశీ ఇంత వరకు ఎక్కడ వున్నావు? ఫోన్ ఎవ్వరు ఎత్తలేదేమి ?" రవిచంద్ర హుంకరించాడు.

రవిచంద్ర కోపాన్ని ఎప్పుడూ చూడని సాహిత్య పెదాలకు రంగు వేసుకుంటున్నదల్లా ఆగి— అద్దంలో నుంచి చూసింది.

"అయ్యగారా! ఎక్కడ నుంచి"

"అమ్మని పిలువు —"

"అమ్మగారు ఇక్కడెక్కడ వున్నారండీ, ఆసుపత్రికి తీసుకుపోయారు గిరిజ అమ్మగారు ..."

"దేనికి !"

"వున్నట్లుండి విరుచుకు పడిపోయారు. ఫిట్స్ వస్తున్నాయి కదండీ"

ఫోన్ టక్కున పెట్టేసాడు రవిచంద్ర. రవిచంద్ర పాలిపోయిన ముఖం చూచి — సాహిత్య భయపడింది. రవిచంద్ర టైం చూసుకుంటూ తిరిగి ఫోన్ డయల్ చేస్తూ —

"సాహిత్యా సర్దేయి — వెళ్ళిపోవాలి — లక్ష్మి హాస్పిటల్లో వుంది."

"ఇప్పుడా !"

"అవును—ప్లేన్ వుంటే—ప్లేన్‌లో పోదాం" సాహిత్య ముఖాన ఎవ్వరో చల్లనీళ్ళుకొట్టినట్లైంది. హుషారంతా నీరు కారి పోయింది. సినిమా పోతే పోయింది. రేపు వాళ్ళు వేసుకున్న ప్రోగ్రాం మాటేమిటి— ఇది తన హనీమూన్ — కదా! తన కిచ్చిన మాటేమిటి ?

"రేపు మనం కొండపల్లికి పోదాం అనుకున్నాం కదా!" చిన్న స్వరాన అంది.

చిత్రంగా చూశాడు సాహిత్య వైపు. లక్ష్మి తన భార్య— హాస్పిటల్లో వుంది. ఫిట్స్ అంటున్నారు — కడుపుతో వున్నప్పుడు ఫిట్స్ వస్తే కండిషన్ సరిగ్గా లేనట్లే కదా. బయటికి అలా వున్నా లోలోన వణికిపోతున్నాడు. 'లక్ష్మికి ఏమైన జరిగితే తను బ్రతకడు. ఆ ఫిట్స్ రావటానికి తనే కారకుడు— అని మనస్సు ఎలుగెత్తి చెప్తున్నది.

తను బ్రతుకు తున్న జీవితం— లక్ష్మిది. తను అనుభవిస్తున్న సుఖం — సంతోషాలు లక్ష్మివి. లక్ష్మి పెట్టిన భిక్ష. అలా చేయటానికి వీలులేదు— వద్దు అని శాసిస్తే సాహిత్యను పెళ్ళి చేసుకునే శక్తి వుండేది కాదు. 'శారీరకంగా బంధించినా—మనస్సును భధించలేక ఆ ప్రేమలోపడి తన భర్త రవిచంద్ర నలిగిపోతాడు. పిచ్చివాడై పోతాడేమో'నన్న భయానికి







తనను ఇదేమిటి ! అని ప్రశ్నించలేదు. ఎంతసేపటికి తన ప్రేమతో కట్టేసుకోవాలని చూచింది— తనలో లోపం ఏంటి— తనకు లేనిదేమిటి ! ఏమి ఇవ్వలేదు— అని తనను తాను ప్రశ్నించుకుంటూ— నలిగిపోతున్న లక్ష్మి తన ప్రాణం ! అని సాహిత్యకు చెప్పలేక —

"సాహిత్య— అర్థం చేసుకో— షి ఈజ్ మై వైఫ్" అన్నాడు.

లక్ష్మి అంటే ఎంత ప్రేమో ఆ మాటల్లోనే తెలిసిపోయింది. రవిచంద్ర పాలిపోయినంతగ, సాహిత్య ముఖం కూడా వివర్ణమై పోయింది.

"ఆమె నీ ప్రాణం. మరి నేనో !" అంది.

జెలసీ — ఏడుపు — కోపం ముప్పిరిగొనగా నిలదీసి గోముగా అడిగింది.

సాహిత్య అలా అడుగుతుంటే ధీరజ్ జ్ఞాపకం వచ్చాడు. గబగబా దగ్గరకు వెళ్ళి సాహిత్య తలను ఎదకు చేర్చుకున్నాడు.

*   *   *

లక్ష్మి కళ్ళు తెరిచింది — ఎదురుగ దగ్గరగా తన పైన వంగిన రవిచంద్రను చూచింది. అతని కన్నులు కన్నీటితో నిండి వున్నాయి. వెచ్చని కన్నీటిని తుడిచింది.

"లక్ష్మీ !" అంటూ హృదయానికి ముఖం చేర్చి—

"లక్ష్మీ, ఐ లవ్ యూ! నా గుండెలనిండా నీవే వున్నావు. ఇంత కంటే ఇంకేమి చెప్పను. నీకేమైన అయితే నేను వుంటానను కున్నావా ! నన్ను నమ్ము లక్ష్మి." కనుకొలుక్కుల్లో నిలిచిన వేడి కన్నీరు— క్రిందికి జారింది.

"నన్ను క్షమించు లక్ష్మీ ..." ఇంకెలా చెప్పాలో చెప్పలేనట్టు నిస్సహాయంగ చిన్న పిల్లాడిలా తల కొట్టుకున్నాడు. భర్త స్పర్శలో ప్రేమ చవిచూసిన ఆమె ఆ తలను అదిమిపట్టుకుంది. లక్ష్మి రొమ్ములు తడిఅయ్యాయి. వారి ప్రేమలో కోరిక తలెత్తింది. ఒకరిలో ఒకరు లీనమైపోయేంత ప్రేమ వారిని కదిలించి వేసింది.

ఆ రోజు నుంచి రవిచంద్ర లక్ష్మికి కనుమరుగు కాలేదు. గర్భిణితో వుంది— మానసికంగ బాధపడితే ప్రాణానికె ముప్పని మంచం విడిచి పోలేదు.

ఆ రోజు విజయవాడ నుండి వచ్చేటప్పటికి స్పృహ తప్పి వున్న లక్ష్మికి అప్పుడప్పుడు ఫిట్స్ వస్తూనే వున్నాయి — మత్తు మందు ఎక్కువ ఇవ్వటానికి వీలులేదు. ఆ సుషుప్తిలో వున్న లక్ష్మి —

## రాగాగ్ని

" రవీ — రవిచంద్ర ఏమండీ —" అని కలవరిస్తూ — "రవీ ! ఐ లవ్ యు— మీరు నన్ను ప్రేమిస్తున్నారు. అందుకే— అందుకే— ఈ బాధ— మీ ప్రేమ వున్నప్పుడే మీ చేతుల్లో చనిపోతానండి — చచ్చిపోనివ్వండి— రవీ ఈ రాగాగ్ని నన్ను కాల్చేస్తోంది.." అలా పలవరిస్తుంది— రవిచంద్ర నవలల్లో వ్రాసిన డైలాగులు వల్లిస్తుంది— "నేను ఒంటరిగా లేను— ఆహా ! నీలాల నింగిలోని నక్షత్రాలు— మన పెరట్లోనే ఉన్నాయి— మల్లె పందిరి విరిగబూసింది— మీ నవ్వులా వుంది.. "

అలా లక్ష్మి పలవరిస్తుంటే— మనస్సు అల్లకల్లోలమైంది— లక్ష్మి బడబాగ్ని గుండెలో దాచుకుంది. తన ప్రేమలో తనే కాలిపోతున్నా పై పైకి— నిర్మల నీలాకాశంలా వుంది. అలాటి లక్ష్మి తనకు దూరమయిననాడు తనూ వుండదు— లక్ష్మి ఎక్కడ—ఏ రూపంలోవుంటె తను వెంట పోతాడు— కృతనిశ్చయుడైనట్లు లక్ష్మిని కంటికి రెప్పలా కాచుకున్నాడు.

సాహిత్య జ్ఞాపకం రాకపోలేదు - సాహిత్య చిన్న పిల్ల— ఎలాగైన కాలక్షేపం చేస్తుంది — ఫ్రెండ్స్ వున్నారు— తల్లి, తండ్రి వున్నారు— తన గురించి దిగులుపడే అవసరం లేదని తెలుసు.

*   *   *

సాహిత్యకు ఏమీ తక్కువ లేదు పెద్ద ఆహ్లాదంకొలిపే తోట— తోటలో వూయల — ప్రేమించి — అర్థం చేసుకుని అవసరానికి ఆదుకునే తల్లిదండ్రులు — కోరిన నగలు — ఫాషన్‌కి సరిపడే దుస్తులు — అందం— చదువు— సంస్కారం గల సాహిత్యకు ఏం తక్కువ?

అన్నీ వున్నాయి — కాని అనుభవించి ఆనందించే మనస్సు లేనప్పుడు— వాటిని చూచి—హర్షించి మురిసి ఆనందించే భర్త దగ్గర లేకంటే — అవన్నీ వున్నా లేనట్లుగానే వుంటాయి.

భార్యకు సీరియస్‌గా వుంది — అందుకే రాలేదు— అని సాహిత్య తల్లి తండ్రులు — అర్థం చేసుకుని అవసరమైనప్పుడు ఆదుకునే మనస్సున్న రవిచంద్రను మెచ్చుకున్నారు— సాహిత్య అందానికి ఆమె డబ్బుకి దాసుడు కాక — మనస్సున్న మనిషిగా భార్య దగ్గర వున్న అతని వ్యక్తిత్వం బాగా నచ్చింది. కూతురి మనస్సును వూరడిస్తూ— తమ వెంట — సినిమాలకి— పార్టీలకు — తీసుకు వెళ్ళి సాహిత్య మూడ్ పాడుకాకుండా చూసుకుంటున్నారు. బోర్‌గా వుంటే పత్రికా ఆఫీసుకు వెళ్ళమన్నారు.

ఆ రోజు ఆఫీసుకు వెళ్లింది — రవిచంద్రలేని ఆఫీసులో వుండలేక పోయింది.

కమల వెంటరాగా, కాసేపు షాపుల్లో దూరి — చివరికి సినిమాకి వెళ్లారు. సినిమా ఇంకా మొదలు పెట్టలేదు.

"కమలా ! నీ పెళ్లి విషయం ఏమైంది. ఆ సంబంధం బాగానే వుంది కదా— కారు, బంగళా, ద్రాక్షతోటా— ముప్పయి సంవత్సరాలు. వయసులో పెద్ద తేడా లేదు— రవిచంద్ర నా కంటే పది సంవత్సరాలు పెద్ద— "

"అన్నీ బాగున్నాయి — రెండో పెళ్లివాడని మరచిపోతున్నావ్ సాహిత్య !"

"భార్య లేదుగా"

"సాహిత్య ! నీకు అన్నీ వున్నాయి. నీవు సంతోషంగా వున్నావా ! నీవు ఎన్ని అయినా అను — భార్య వున్నా లేకపోయినా రెండో పెళ్లివాడు అంటే— అతనికి అన్నీ అయిపోయి వుంటాయి—అనుభవాలు—కానిమనకి అన్ని థ్రిల్లింగ్‌లూ వుంటాయి— వుడుకు రక్తం. కాబట్టి మొదటి రాత్రి మనకి కొత్త ! అతనికి కాదు. మొదటి భార్య గర్భిణి అంటే — తండ్రి అవుతున్నావని అతడి భావాలు — సంతోషం— అన్నీ అనుభవించేసి వుంటాడు— నాకు కడుపు వస్తే — అంతేకదా— అన్నట్లు ఓ చూపు విసిరి వేస్తాడు — మొన్న మా బంధువుల ఆమె చెప్పింది. వారికి వయస్సులో వ్యత్యాసముంది— ఈవిడతో అతను తూగలేక పోతున్నాడు— "ఆ పని" అయిపోగానే— గుర్రు పెట్టేస్తా

## గో(కా)పురాలు

పాలరాతి
గోపురాలు కాదు
కట్టించడము.
నీడలేని
కాపురాలు నీవు
నిలబెట్టాలి !

— 'వేదాటి' రఘుపతి

# కొత్తగొంతులు

టి.యల్. కాంతారావు

"సమస్యలకు లోతులు తీసి
సామాన్యుల గోతుల్లో తోసి
కాలాన్ని గాలంగా వాడుకుంటూ
నిర్లిప్తత లోనే నిప్పును రాజేస్తూ
అనంత అమాయిక మానవజాతిని
అనాదిగా అధ్వాన్నముగా పరిపాలించే
పిడికెడు మేధావులకు
పెరామిడ్లు కట్టాలనుంది"— జ్వాలాముఖి.

దిగంబర కవిగా పుట్టిన జ్వాలాముఖి ఆశయం అది. జ్వాలాముఖి ఉపన్యాసం ఎంత ఉద్రేకంగా వుంటుందో కవిత్వం కూడా అంత ఇమోషనల్ గానూ ఉంటుంది. ఉపన్యాసం విన్న శ్రోతకు తనకు తెలియని వేదన ఏదో మనస్సులో ప్రారంభమవుతుంది. కవిత చదివిన పాఠకునిలో ఆలోచనకు అంతగా అవకాశం లేని ఆవేశం పుడుతుంది.

జ్వాలాముఖి వచన గేయానికి ఊపిరి సలపని గమనం ఉంది. అతను ఉపయోగించిన రూపకాలు సరికొత్త రూపాలు. గత నిరాసం, వర్తమానం మీద ఏవగింపు, భవిష్యత్తు పట్ల ఆశ ఒక్క జ్వాలాముఖికే కాదు ఈ కాలంలో కవిత్వం రాస్తున్న ప్రతి ఒక్కడి జీవ లక్షణం. సాధారణీకరణమైన ఈ లక్షణాన్ని జ్వాలాముఖి అభివ్యక్తీకరించడంలో ఒక ప్రత్యేకత కనబడుతుంది. కవిత్వ ప్రారంభకాలంలో జ్వాలాముఖి వర్తమానాన్ని అసహ్యించుకుంటూ ఆది మానవ వ్యవస్థవైపు వీపు తిప్పాడు. 'పునరీ యోని ప్రవేశం' అందుకు మంచి ఉదాహరణ.

"నాగరికతా అవహేళనలో
కన్నీళ్ళను అడుక్కుంటున్న యుగ భిక్షువుని నేను
విజ్ఞానం విసరిన విషకిరణానికి చెడిపోయిన చక్షువును నేను
వృథాశోకాల పీడిత లోకాలలో
విరిసిన కారుణ్యం మహాబోధి వెలుగులో
మెరిసిన తథాగతుణ్ణి నేను
అహంకారం శిలవపై నవ్విన నెత్తురు గులాబిని నేను"

ఆధునిక కవితకు మరోసారి పురిటినెప్పులు ప్రారంభమైన కాలంలో, ఉద్యమమే ఊపిరిగా జీవిస్తున్న కాలంలో జ్వాలాముఖి భావ గమనం ఆ తీరుగా ఉన్నది. నీరు ప్రవాహ గుణాన్ని కోల్పోతే ఎలా దుర్గంధ భూయిష్టం అవుతుందో అట్లా కవిస్థాణువైతే కవిత్వం చచ్చిపోతుంది. ప్రాణికి చైతన్యం జీవ లక్షణం. కవిత్వానికి పరిణామం సహజ గుణం.

జ్వాలాముఖి దిగంబర కవితోద్యమంతో పాటు ఎదిగిన కవి. సమాజాన్ని శాపనార్థాలు పెట్టడానికి కవిత్వమే అక్కర్లేదని, తిట్లతోనూ, బుకాయింపులతోనూ, పొలికేకలతోనూ సమాజం మారదని, వ్యవస్థిత పద్ధతి ద్వారా మాత్రమే సమాజంలో మార్పు వస్తుందని, ఆ పద్ధతికి మార్క్సీయ సిద్ధాంతం మాత్రమే మూలమని దిగంబర కవులందరూ చిట్టచివరకు గట్టిగా విశ్వసించారు. 'హృదయానికీ మేధస్సుకు మధ్య తెగిన తడితీగను' తనకూ తన తలకూ మధ్య చెడిన దారిని యాథాస్థితికి తేవటానికి శస్త్ర చికిత్సతప్ప మరో మార్గం లేదని జ్వాలాముఖి విశ్వాసం. 'ఓటమి—తిరుగుబాటు' శస్త్ర చికిత్స ఖండికల్లో ఈ నమ్మకం బాగా ధ్వనించింది. 'హింస విప్లవానికి మంత్రసాని' అనటం దిగంబర కవితోద్యమం కొత్త చైతన్యంతో మరో ఉద్యమంగా పరిణమించటానికి సూచన.

సమ్మెలు, ఆందోళనలు, సత్యాగ్రహాలు వ్యవస్థ కుళ్ళిపోయినపుడు నిష్ప్రయోజనాలు. నిరంతరంగా సాగుతున్న దోపిడీ మహావృక్షాన్ని కూకటివేళ్ళతో పడగొట్టడానికి జనం ఉప్పెన కెరటమై తిరగబడితే తప్ప, ప్రయోజనం లేదనే నమ్మకం నక్సల్‌బరీ ఉద్యమంతో ప్రాణం పోసుకొంది. ఈ నమ్మకానికి జ్వాలాముఖి 'ఆకాశం ఎర్రబడుతూంది' అనే ఖండికలో



అక్షరాకృతి కలిగించాడు. లో చీకటి వ్యవస్థా గర్వాన్ని చీల్చి పీడిత జనాల్ని 'సూర్య స్నానం' చేయించటానికి ఎంతోమంది ప్రాణత్యాగం చేశారు. 'లక్ష నక్షత్రాలు రాలందే ఉజ్జ్వల ఉదయం ప్రవహించ'దని చెబుతూ అప్పటికే రాలిన నక్షత్రాలను కవిత్వంలో అర్థాంతరంగా సూచించాడు.

"ఆ త్యాగధనులంతా
నిర్మల నక్షత్రాలు
సంపూర్ణ మానవతా మూర్తులు
చీకటిని ఛేదిస్తున్న రాత్రి భాస్కరులు
పామరజనాలను పదిలపరుస్తున్న గణపతులు
క్రాంతి పాణిగ్రహణానికి
పరి తపించిన విప్లవ శ్రామిక గీతాలు
కష్టజీవుల కైలాసాలు."

ఇక్కడ పేరొన్న పేర్ల చరిత్ర చెప్పవలసిన అగత్యం లేదు. ఈ ఆశయ సాధనలో ఈనాడు రాలిన ఒక్కొక్క నక్షత్రం రేపటి సూర్య కిరణం; ఈనాటి త్యాగాలే రేపటి తూర్పు సౌరభాలని చెబుతాడు జ్వాలాముఖి.

కవిత్వంలో ఏమి రాయాలో, ఎందుకు రాయాలో 'మా విషాద' ఖండికలో చెప్పాడు. జీవితంలో లేని వసంతాన్ని గూర్చి కవులు కలలు కనటం పరిపాటి. మన్మథునికి కోయిల ఇచ్చిన సమాధానంలో వర్తమాన కవిత్వ పథ నిర్దేశం ఉన్నది. గతంలో జరిగిందీ, ఆ గతంలో జరగవలసిందీ ధ్వనింపబడింది ఈ ఖండికలో. కోయిల కంఠం సింహనాదమై ధ్వనిస్తుంది. ఆ నినాదంతో సమస్త గొంతులూ కలిపి ఈ వ్యవస్థకు భరతవాక్యం పలుకుతాయి. 'ఈ నెత్తురు చిత్తడి ఇంకా ఎన్నాళ్ళు' అని హెచ్చరిస్తాడు.

ఈ వ్యవస్థ మారాలనే తపనతో కవిత్వం రాస్తున్న కవి జ్వాలాముఖి. సుమారు పదిహేను సంవత్సరాలనుంచీ కవితోద్యమాలలో తిరుగుతూ ఊరూరా ఉపన్యాసాలిచ్చి ఉద్యమ స్వరూప స్వభావాలను వివరించిన జ్వాలాముఖి ఇప్పుడే కారణంగానో ఒంటరిగా ఉంటున్నాడు. వ్యక్తుల కంటె సంస్థలు గొప్పవనీ, అవి ఉద్యమ అవసరాలను తీవ్రంగా ప్రతిబింబించాలనీ జ్వాలాముఖి ఆశయం.

"రాత్రి రాలిన నిర్మల నక్షత్రాలు
చరిత్రాకాశంలో నిశ్చలంగా మెరుస్తాయి
బీళ్ళకూ, మోళ్ళకూ దిక్సూచులై విరుస్తాయి
దిక్కు దిక్కు మనే దిక్కుల్లో విద్యుత్తును కురిపిస్తాయి" ✤

## రాగాగ్ని

డట. ఆ తర్వాత— ఏం చెయ్యాలో, ఏం కావాలో మరి నేను వూహించలేకున్నాను.

పైగా అతనికి కొడుకున్నాడు, ఆ కొడుకును సవతి తల్లి సరిగ్గా చూస్తుందో లేదోనని ఎప్పుడూ నిఘా వేసి వుంచుతారు — అతని మొదటి భార్య కొడుకుని చస్తే ప్రేమించలేను. పిల్లలంటే ప్రేమ లేకకాదు— తల్లిలేని పిల్లవాడని దయలేక కాదు. కాని భర్త అనురాగాన్ని పంచుకున్న స్త్రీకి పుట్టాడే అన్న ద్వేషం, అసూయా. తన భర్త మొదట ఓ స్త్రీతో కాపురం చేశాడు— అని ఆ పిల్లవాడిని చూసినప్పుడల్లా అనుక్షణం గుర్తు చేస్తుంటే మనస్సు కలుక్కుమంటుంది — అతని బిడ్డలు — రెండో భార్యను తల్లిగా స్వీకరించరు— ఆమెకు—ఆ పిల్లలకి అనుక్షణం యుద్ధం జరుగుతుంటే కారులు— బంగళాలు మనశ్శాంతి నిస్తాయా నీవే చెప్పు? పెళ్ళి కాకపోయినా ఫరవాలేదు కాని— ఆ పెళ్ళి మాత్రం చేసుకోను."

ఆ తర్వాత సాహిత్య సినిమా చూడలేకపోయింది. కమల చెప్పిన విషయాలు— మనస్సులో సుడులు తిరుగుతున్నాయి.

(ఇంకా వుంది)



# ఎలర్జీ

**వింధ్యవాసిని**

రాత్రి తొమ్మిది గంటలయుంటుంది. 'నవజీవన్ నర్సింగ్ హోమ్'లో కారిడర్లు, వరండాలు, డ్యూటీ రూముల్లో తప్ప, మిగతా గదుల్లో లయిట్లన్నీ ఒక్కొక్కటిగా ఆరిపోతున్నాయి.

ఆఖరి రౌండ్స్ ముగించుకుని వచ్చిన డా॥ శంకర్రావుకి పోర్టికో దగ్గిర నిలుచుని ఉన్న నైట్ డ్యూటీ వాచ్‌మెన్ చెయ్యెత్తి సలాం చెప్పాడు. డాక్టరు సమాధానంగా తల పంకించి ఒక్క క్షణం నిలుచున్నాడు.

పది నిముషాల క్రితం తుంపరగా మొదలయిన వాన జల్లుగా మారింది. చేతిలో ఉన్న గొడుగును విప్పి తీసి తలమీదుగా పట్టుకుని పోర్టికో దాటి ముందుకు అడుగులు వేసాడు డా॥ శంకర్రావు.

డాక్టరుగారి ఇరవయ్యేళ్ళ శ్రమ ఫలితంగా ఈ స్థితికి వచ్చిన 'నవజీవన్'కి వెనుకవయిపున కొన్ని గజాల దూరంలో ఉన్నది ఆయన నివాస గృహం.

రెండు నిముషాల్లో ఇల్లు చేరుకున్నాడు డాక్టరు.

ఇట్లాంటి వాతావరణంలో, ఆయన రోజుకు ఎన్ని కప్పుల టీ తాగుతారో లెక్కే ఉండదు.

"టీ తాగుతారా, ఏకంగా భోజనం చేద్దామా?" అడిగింది ఆయన భార్య సుభద్ర.

"భోజనం రెడీనా?" అడిగాడు డాక్టరు కోటు విప్పి ఆమె చేతికి అందిస్తూ. ఇంట్లో ఉన్నది ఇద్దరు. పదార్థాలు వేడిగా ఉంటాయని, సుభద్ర మామూలుగా ఏడు గంటలకిగానీ వంట మొదలుపెట్టదు.

"ఓ. వడ్డించేయమంటారా?"

నిజానికి వారున్న స్థితికి స్వయంగా వంట చేయవలసిన అవసరం ఆవిడకి లేదు. కానీ తను చేస్తే తప్ప డాక్టరుగారు తృప్తిగా భోజనం చేయరని తెలుసు. పైగా ఏ పనీ లేకుండా సోమరిగా కూర్చోవటం కూడా ఆవిడకి ఇష్టం ఉండదు. ఆవిడ హెచ్చుగా చదువుకోలేదు కాబట్టిగానీ, లేకుంటే నర్సింగ్‌హోమ్‌లో డాక్టరుగారికి సహాయంగా ఏ పనో కల్పించుకుని ఉండేది.

సోఫాలో కూర్చొని బూటు లేస్ విప్పబోయిన శంకర్రావు, ఫోను గణగణమనటంతో ఆ పని మానేసి లేచి రిసీవర్ అందుకుని, "హలో" అన్నారు.

మాట్లాడుతున్న స్వరాన్నిబట్టి, తనకు పరిచయస్తులయితే మనిషిని గుర్తుపట్టెయ్యగలడు ఆయన. మాట్లాడుతున్నది, టవున్లో పెద్ద వ్యాపారస్తుల్లో ఒకరుగా చెప్పుకోవలసిన, అప్పైన తన బాల్యస్నేహితుడు అయిన రాజరత్నం అని గుర్తించాడు.

"శంకరం నువేనా మాట్లాడుతున్నది?"

"నేనే, ఏమిటి అంత ఆదుర్దా?"

"అమ్మాయి పరిస్థితి ఏమీ బాగాలేదురా. నువ్వు వెంటనే రావాలి."

"అసలేమయింది? మొన్న బజార్లో కన్పించి బాగానే మాట్లాడిందే."

"దాని జబ్బు ఎప్పుడూ ఇలా సడన్‌గానే కదా? బొత్తిగా ఊపిరి అందక అవస్థ పడుతోందిరా" రాజరత్నం స్వరంలో జీర, శంకర్రావుని కదిలిస్తోంది.

అయినా చకచక క్షణాల్లో ఆలోచించింది అతని బుర్ర.

"చూడు రాజా, నేనొక మాట చెబుతా విను. నేను అక్కడికి రావటంకన్నా, నువ్వు పాపని తీసుకొని ఇక్కడికి రావడం త్వరగా చేయచ్చు కదూ? ఆ పనే చెయ్యి. అవసరమయితే, రెండ్రోజులు నర్సింగ్‌హోమ్‌లో ఉంటుంది సరేనా?"

ఫోన్ పెట్టేస్తూ, "ఇదిగో సుభద్రా, ప్రస్తుతానికి భోజనం వాయిదా వేసెయ్యి. వేడిగా టీ ఇచ్చెయ్యి చాలు" అని భార్యని కేకేశాడు డాక్టరు.

టీ కప్పు తెచ్చి ఇస్తూ, "ఎవరండీ ఫోన్లో మాట్లాడుతున్నది?" అనడిగింది సుభద్ర.

అప్పటికే కోటు వేసేసుకున్నాడు శంకర్రావు. "అదేనోయ్ మన రాజరత్నం వాళ్ళమ్మాయి సంధ్య లేదూ, ఆ పిల్లకి మళ్ళీ ఇస్నోఫీలియా ఎటాక్ అయినట్లుంది. బ్రీత్‌లెస్‌గా ఉందట. నర్సింగ్‌హోమ్‌కి తీసుకురమ్మన్నాను" టీ తాగుతూ విషయం వివరించాడు.

"తిరిగి రావటం ఆలస్యం అవుతుందా?"

"ఊహూ, అంత ప్రమాదం ఏమీ ఉండదు. ఆ జబ్బుగుణం అది. చూసేవాళ్ళకి చాలా భయంగా, బాధగా ఉంటుంది. పావుగంటలో వచ్చేస్తా."

"అయితే ఉండండి, నేనూవస్తాను ఇంట్లో విసుగ్గా ఉంది. అలాగే సంధ్యనుచూసినట్లూ ఉంటుంది" అంటూ సుభద్ర కూడా బయలుదేరింది ఆయన వెంబడే.

* * *




సంధ్య పరిస్థితి చాలా దయనీయంగా ఉంది. కారు దిగి తండ్రి ఒకవయిపు, నర్సింగ్‌హోమ్ సిస్టర్ రజని ఒకవయిపు పట్టుకోగా లోపలికి నడిచివచ్చింది. తెరలు తెరలుగా వస్తున్నదగ్గుతో, మనిషంతా అదిరి పోతూంది. కళ్ళనిండుగా నీరు. ఎగిరిపడుతున్నగుండెలు, ఆమెకు ఊపిరి అందటం ఎంతకష్టంగా ఉన్నదీ చూపుతున్నాయి. లోపల ఊపిరితిత్తులు రాసుకుంటున్నాయా అన్నట్లుగా వింతశబ్దం బయటికే వినిపిస్తోంది.

"ఏమ్మా, అయిస్‌క్రీం గాని తిన్నావేమిటి ?" అడిగాడు డాక్టరు.

చల్లటి పదార్థాలు సంధ్య ఒంటికి పడవు. అందుకనే ఆయనలా అడిగేడు.

"లేదంకుల్" ఆమాట బయటికి రావటమే చాలాశ్రమ అయిందా అమ్మాయికి.

అప్పటికే డాక్టరుగారు ఆమెకోసం తయారు చేయించిన స్పెషల్ రూంలో బెడ్‌మీద గోడకునాలుగు దిళ్ళు ఆన్చి కూచోబెట్టారు సంధ్యని. కొంచెం అయినా దగ్గు తెరిపి ఇచ్చేదాకా, పడుకునేందుకు వీలులేదు.

సిస్టర్ రజని అందించిన సిరంజితో ఒక ఇంజక్షన్ చేశారు డాక్టరు, సంధ్యకి. బలవంతాన మూడురకాల బిళ్ళలు మింగించారు. వేడిగా కాఫీ తెప్పించి ఇచ్చారు.

"కొంచం సేపయితే రిలీఫ్ వస్తుంది. ఏం భయంలేదు," అంటూ స్నేహితుడ్ని అవతలికి తీసుకుని వెళ్ళాడు, శంకర్రావు.

అడ్మిట్ చేసుకున్న ప్రతీ పేషంటునీ స్వయంగా శ్రద్ధగా చూసుకునేందుకు అవసరం అయేంతమంది స్టాఫు ఉన్నారక్కడ. అందుకని పేషంటు కుటుంబ సభ్యులెవరయినా చూసి వెళ్ళాలిసిందే తప్ప, అక్కడ ఉండనివ్వరు. ఈ రూలు, చేరిన వారు డాక్టర్ శంకర్రావుకి కావలసిన స్నేహితులయినా సరే సడలించటం అంటూ ఉండదు.

రాజరత్నం వెనుకే సూటులో ఉన్న యువకుణ్ణి ఎవరా? అని చూశాడు డాక్టరు.

"మా మేనల్లుడు మధుసూదనం. గుర్తుపట్టలేదూ?" ప్రశ్నిస్తూనే పరిచయం చేశాడు, రాజరత్నం.

"ఈ అబ్బాయి అమెరికాలోకదూ ఉండటం?" అడిగాడు శంకర్రావు.

"అయిదేళ్ళయి అమెరికాలో ఉన్నాడు. ఏడాదికొక్కసారే లీవు తీసుకుని ఒస్తుంటాడు. స్వయానా మా చెల్లెలికొడుకే శంకరం. అమెరికాకు పంపించింది నేనేలే. ఇదో వచ్చేనెల్లో పెళ్ళికి ముహూర్తాలు అనుకుంటున్నాం. ఇంతలో అమ్మాయికీ అవాంతరం..."

"అబ్బే ఇదో సమస్య కాదులే. ఆహారం, వాతావరణం— ఈ రెండు విషయాల్లో జాగ్రత్త తీసుకుంటే అసలు రానేరాదు."

"ఏమిటో శంకరం, ఆ మూడు ముళ్ళు పడిపోతే, నా బాధ్యత తీరిపోతుంది. అమెరికాలో వైద్యానికి లోటేముంది? అల్లుడే బాగు చేయించుకుంటాడు."

సిస్టర్ రజనికి సంధ్య బాధ్యతను ఒప్పజెప్పి, ఇంటికి బయల్దేరారు డాక్టర్ శంకర్రావు దంపతులు.

దారివెంబడి రాజరత్నం, అతని కుటుంబం, అతనికీ డాక్టరుకీ మధ్యనున్న స్నేహం ఈ విషయాలే చర్చించుకున్నారు ఇద్దరూ.

భోజనాలు ముగించుకుని, చెరొక పుస్తకం పుచ్చుకుని, మంచాలమీద మేనువాల్చారు శంకర్రావూ, సుభద్ర.

ఏదో మెడికల్ జర్నల్‌లో గుండె జబ్బుకి సంబంధించిన వ్యాసాన్ని దీక్షగా చదువుతున్నాడు డాక్టరు.

'రాజాజీ రామాయణం' చదువుతున్న సుభద్రకి అక్షరాలమీద మనసు నిలవకుండా, పదేపదే సంధ్య ముఖమే గుర్తొస్తోంది.

"ఏమండీ, ఇంతకుముందు కూడా ఆ అమ్మాయి రెండు మూడుసార్లు మన ఆస్పత్రిలో చేరింది కదూ ?"

"ఇవును. అప్పుడప్పుడు మామూలు జలుబు చేసి, అదే ఇస్నోఫీలియాలోకి తిరిగి కాస్త తలక్రిందులు చేస్తుంటుంది. ఇది నాలుగో సారనుకుంటా ఇక్కడ చేర్చుకోవటం. ఏం ?"

"ఏదో ఎలర్జీవల్ల వస్తుంటుందని మీరు అంటుంటే విన్నాను..."

పుస్తకం మూసి పక్కన పెట్టాడు డాక్టరు.

"కొంతమంది శరీరానికి, ఒక్కొక్క ఆహార పదార్థం సరిపడదు. ఆ పదార్థం తిన్న రోజున జబ్బు తిరగబెడుతుంది. వాతావరణంలో హఠాత్తుగా











వచ్చే మార్పులు కూడా కొంతమంది తట్టుకోలేరు చాలామట్టుకు ఇలాంటి ఎలర్జీవల్ల ఎటాక్ వస్తూంటుంది."

"................."

"ఏమిటి వివరాలన్నీ అడిగి ఆలోచనలో పడిపోయావే."

"అహ మరేంలేదు. ఆ పిల్లని చూస్తే, దేనికోసమో చాలా బాధపడుతున్నట్లుగా ఉంది. కళ్ళు చూస్తే, బాగా ఏడ్చిందేమో అనికూడా అనిపించింది."

"ఛ! ఎందుకేడుస్తుంది? లక్షాధికారి కూతురు. దేనికీ తక్కువలేదు. రేపోమాపో పెళ్ళయితే అమెరికా వెళులోంది కూడాను."

"అహ. వెంట ఉన్న అబ్బాయేనా మీ స్నేహితుడి మేనల్లుడు. మీరేమయినా అనుకోండి. ఆ కుర్రాడు, ఈ పిల్ల అందం ముందు దిగదుడుపే. కాకి ముక్కుకు దొండపండులా ఉంటుంది."

"పోదూ! అబ్బాయిలకి అందం ఏమిటి? చదువు, సంపాదనా ఉంటే చాలదూ? లక్షలు ఖర్చు చేసి స్వయంగా అల్లుణ్ని చదివించుకున్నాడు మా రాజరత్నం. అంతా కూతురి సుఖం కోసం కాదూ?..." అవునోయ్ అన్నట్లు వివరాలు అన్నీ అడుగుతోంటే గుర్తొస్తోంది నాకు. పాపం, ఆ అబ్బాయి దురదృష్టం ఏమిటో, అతను ఏడాదికొకసారి వచ్చినప్పుడల్లా ఈ పిల్లకిలా అయి మంచం ఎక్కుతుంది. పెద్ద జబ్బు కాదనుకో. అయినా సరదాగా గడపాల్సిన వయసు. అంత దూరం నుంచీ వస్తాడా, కాబోయే భార్య, మరదలు — ఈ పిల్లకిలా అవటం, ఆ అబ్బాయి కెంత బాధగా ఉంటుందో."

"బాధా? ఆ అబ్బాయిని చూస్తే అలా కనిపించలేదే" సాలోచనగా అన్నది సుభద్ర.

ఆవిడ మనసులో ఉన్నదేమిటో శంకర్రావుకి అర్థం కాకుండా ఉంది. "ఏమండీ, మనలో ఒక్కొక్కరంటే, ఒక్కో మనిషికి సరిపడదనుకోండి. అదీ ఒకరకమయిన ఎలర్జీనే కదూ? ఇలాంటి ఎలర్జీ శరీరంమీద ఎట్లా పని చేస్తుందో ..."

"ఏమో, నేను మామూలు డాక్టర్నే కానీ, సైకో ఎనలిస్ట్‌ని కాను. అయినా ఈ విషయంలో నీ ఆలోచనకి ఆధారం ఏదీ ఉన్నట్లు నాకు తోచదు" దుప్పటిని కాళ్ళమీదుగా కప్పుకుంటూ అన్నాడు డాక్టరు.

* * *

సంధ్యకి పూర్తి నయం అవటానికి మూడు రోజులు పట్టింది. ప్రతిరోజూ ఏదో ఒక సమయంలో సుభద్ర ఆ అమ్మాయిని చూసి, పరామర్శించి వస్తోంది.

"ఏమ్మా ఇవాళ ఇంటికెళ్ళిపోతావా?" అని డాక్టరు అడిగితే, "ఫర్వాలేదంకుల్. ఇంకో రెండు రోజులు ఉండమన్నా నాకేం అభ్యంతరం లేదు" అని చిరునవ్వుతో జవాబిచ్చింది ఆ అమ్మాయి.

వెంబడేవచ్చిన భార్యతో, "చూశావా? సంధ్యకిక్కడి వాతావరణం బావుంటుందట. ఎప్పుడు చేరినా ఇంతే, మరో రెండురోజులు ఎక్కువే ఉండి







వెళుతుంది'' అని గర్వంగా చెప్పుక న్నాడు శంకర్రావు. సుభద్రకిది ఆశ్చర్యంగా ఉంది. ఆవిడ అప్పుడప్పుడు తెలిసిన వారున్నా లేకపోయినా, ఊరికే వచ్చి రోగులందర్నీ పరామర్శిస్తూ ఉంటుంది. ఇలా వెళ్ళమన్నా ఉంటానని కోరుకున్న పేషంటును ఆవిడ మునుపెన్నడూ చూడలేదు. అందుకనే ప్రత్యేకించి పరిశీలనగా ఆ అమ్మాయి ముఖంలోకి చూసింది సుభద్ర.

* * *

ఆ వేళ ఆపరేషన్ అయిన ఒక పేషంటును ఒకసారి చెక్ చేయాలని రాత్రి పదిగంటలకి నర్సింగ్ హోమ్‌కి బయల్దేరాడు, డా. శంకర్రావు.

''సంధ్యను రేపు డిస్‌ఛార్జ్ చేస్తున్నాం. వచ్చేనెల మూడవ తేదీ పెళ్ళిరోజు కూడా నిర్ణయించేశారు.''

''అలాగా. ఇవాళ అటువయిపు రావటానికే కుదర్లేదండి. పదండి, మీతోబాటు వచ్చి, ఆ అమ్మాయిని పలకరిస్తాను'' అంటూ సుభద్రకూడా బయలుదేరింది.

సంధ్య గదిలోపలికి అడుగువేయబోతూ, లోపల మాటలు వినిపించి ఆగిపోయింది సుభద్ర.

మాటలతోబాటు సన్నగా ఏడుస్తున్న శబ్దం కూడా వినిపిస్తోంది.

''ఊరుకో సంధ్యా. ఊరుకోవూ ? ఉద్యోగం కోసం శాయశక్తులా కృషి చేస్తున్నాను. నన్నునమ్మ. నువ్విట్లా బెంబేలుపడితే, నాకు ఇంకా అధైర్యంగా ఉంటుంది తెలుసా ?''

''ఆదే ఆఖరుసారనుకో మనం కలుసుకోవడం. మా బావతో పెళ్ళికి తేదీ కూడా నిర్ణయించేశారు మా నాన్న. ఇక్కడినుంచీ డిస్‌ఛార్జి అయి ఇంటికి వెళ్ళాక, బయటికిరావటం కూడా కష్టమే. దెయ్యం లాగా ఎప్పుడూ నాకు కాపలాఉంటాడు మా బావ... ఓహ్... ఆ మనిషిని చూస్తేనే తేళ్ళు జెర్రులు పాకినట్లుంటుంది. మన ఖర్మ ఇట్లా వుంది. నాకు తెలుసు సత్యం — నీ గురించి నాన్నకు చెబితే ఈమాత్రం ముఖాలు చూసుకునే అవకాశం కూడా ఉండదు. ఒక్కసారి చెప్పిచూడు అంటావుగానీ ఆయన సంగతి నీకు తెలీదు సత్యం... ఆయన క్కావలసింది డబ్బు... దాన్ని సంపాదించగల యంత్రాల్లాంటి మనుషులు.''

క్యూరియాసిటీ చంపుకోలేక పోయింది సుభద్ర. దగ్గరగా వేసున్న తలుపులు కొద్దిగా తోసి కర్టన్ సందులోంచి శబ్దంలేకుండా తొంగిచూసింది. అక్కడ కిటికీవయిపు తిరిగి కూర్చుని సంధ్య ఒక్కర్తే ఉంది

ఇంత దాకా ఆ పిల్ల ఎవరితో మాట్లాడు తున్నదీ అర్థం చేసుకోలేక మరింత పరిశీలనగా చూసింది సుభద్ర. కిటికీకి ఆవతల ఎవరో నిలుచుని ఉన్నారు. ఎవరో అతను పాతికేళ్ళలోపు వయసుం టుంది. ఒడ్డు పొడుగు ఆకారమే తప్ప, మసకచీకట్లో ఉన్న అతని ముఖకవళికలు తెలియటంలేదు.

''సాయంత్రం నుంచీ ఈ గోడ దగ్గిరే కాపలా కాస్తున్నా. మీ బావ, వాళ్ళమ్మగారు ఎంతకీ కదిలారు కాదు,'' అంటున్నాడు అతను.

''పోన్లే ఇంక వెళ్ళు సత్యం. సిస్టర్ టాబ్లెట్ ఇవ్వటానికొచ్చే టయిమయింది. ప్రతీరోజూ నిద్ర మాత్ర ఇస్తేగానీ నాకు నిద్రరాదని ఇస్తున్నారు తెలుసా ? నాకు నిశ్చింతగా నిద్ర రావాలంటే ఏం చేయాలో వీళ్ళకేం తెలుసు ?'' సంధ్య మాటల్లోని నిస్పృహ సుభద్ర హృదయాన్ని కదిలించివేస్తోంది.

కిటికీలోంచి సంధ్య తన చేతిని అవతలికి చాచి, రెండు క్షణాల తర్వాత లోపలికి తీసుకుంటూ, నీరసంగా ''బై'' అనటం వినిపించింది.

## చైతన్య రథం

ఆరకుంటే అగ్గి
ఆరిపోతే బుగ్గి
జీవ సహితం చైతన్యం
జీవ రహితం శూన్యం
అందుకే బ్రదర్
జీవిత మొక చైతన్య రథంగా
చేసుకోగల్గాలి నిత్యనూతనంగా
లక్ష్య నిర్ణయం జరిగిన చోట
పుడుతుంది చైతన్య స్రవంతి.

— కాణిపాకం లింగన్న

తలుపు పూర్తిగా తెరుచుకుని లోపలికి వెళ్ళింది సుభద్ర.

''ఒంట్లో ఎలా ఉందమ్మాయి ?'' అని అడుగుతూ సంధ్య పక్కనే మంచంమీద కూర్చుంది.

సంధ్యకి ఆశ్చర్యంగా ఉంది. ఆవిడ చాలాసార్లు తన్ని పలకరించటం, పరామర్శించటం జరిగిందికానీ, ఎప్పుడూ ఇలా పక్కన మంచంమీద కూర్చోలేదు

సంధ్యకి చిన్నతనంలోనే తల్లి మరణించింది. అమ్మ అంటే ఎలా వుంటుందో ఆ అమ్మాయికి తెలీదు. అందుకే సుభద్ర పలకరింపులో కనిపించే ఆప్యాయత అంటే చాలా ఇష్టం.

''బాగుందాంటీ. రేపు ఇంటికి వెళ్ళిపోతున్నా.''

''మా ఇంటికి రాకుంటేనే... పోన్లే... పెళ్ళి చేసుకుని భర్తతో కలిసిరా. నిన్ను చూస్తే, అమెరికాలో ఉన్న మా మూడో పాపను చూసినట్లుంది. ఏమ్మా వస్తావా ?'' అంటూ, సంధ్య భుజంమీద చేయివేసి, ఆమె ముఖంలోకి పరీక్షగా చూసింది.

''పెళ్ళి అనగానే సహజంగా కలగాల్సిన ఉత్సాహం లేదేం తల్లీ. ఎందుకట్లా దిగులు పడినట్లుగా ఉన్నావ్. ఎక్కువగా వర్రీ అవటం, కళ్ళనీళ్ళు పెట్టుకోవటం, నీ ఆరోగ్యానికి మంచిది కాదు. ఎప్పుడూ నవ్వుతూ ఉండాలి. ఏదీ...'' అంటూ సంధ్య గడ్డం పట్టుకుని, ముఖాన్ని పైకెత్త బోయింది సుభద్ర.

అంతే ! కట్టతెగిన చెఱువులో నీటిలా వచ్చేసింది ప్రవాహం. సుభద్ర ఒడిలో ముఖం దాచుకొని ఏడుస్తోంది సంధ్య. ఆ అమ్మాయినలా కాస్సేపు ఏడవనిచ్చి, తెరిపినపడ్డ తర్వాత, ''ఇప్పుడు చెప్పు నీ మనసులో ఉన్న బాధ ఏమిటో... ఏటా మీ బావ వచ్చినప్పుడల్లా జబ్బు తిరగబెడుతుందని డాక్టర్‌గారు అన్నప్పుడే... నాకు అనుమానం వచ్చింది... నీకు అతనంటేనో...అతనితో పెళ్ళంటేనో అయిష్టం ఉండచ్చని ... నువ్వు ప్రేమించిన అబ్బాయి పేరు సత్యం కదూ ? ... అతన్ని గురించి ఎవరికయినా చెప్పేవా ?''

''ఉహు ... అంత ధైర్యంలేదు...మా నాన్న అతని ప్రాణాలు తీయించినా ఆశ్చర్యంలేదు.''

## ఎ. కె ఆర్. – కాశీబుగ్గ

నేను ఒక క్షణం కనిపించకపోతే విరహం భరించలేను అంటుంది. నేనేదడిగినా యిస్తాను అంటుంది. ఫోటో కావాలి అన్నాను. అభిమానం మనసులోనే దాచుకో అంది ......

★ అబ్బ పెద్ద మన్మథ కుంజ ! మీ మగ వాళ్ళు యిలాంటి పగటి కలలుకని తీరని కోర్కెలు తీర్చుకుంటూ వుంటారా అనిపిస్తూంది నాకు.

## బి ఎ. – విజయనగరం

పెళ్లి చేసుకున్నాను. ఇద్దరి పిల్లల్ని కన్నాను. ఎటువంటి చెడు అలవాట్లు లేవు. నేనంటే యిష్టం లేదని మా ఆవిడ పుట్టింటికి వెళ్లిపోయింది. ఇలా చేస్తే ఏ ఆడదానిని నమ్మను ?

★ ఆడదానికి శరీరమొక్కటే వుండదయ్యా, మనసు వుంటుంది. దానికి ఆశయాలు ఆలోచనలు వుంటాయి. కొందరు భర్తలు — పిల్లల్ని కనడమే సంసారపు పరమావధి అనుకుంటారు ! కాని ఆడది సెక్సు మిషనుగా కాక, మనిషిగా చూడాలని కోరుకుంటుంది. అది చాలా మందికి — వినబడదు.

## ఎమ్ వి. – బొబ్బిలి

కె. రా. గారూ ! రచనలలో ఇతివృత్తం — శిల్పం శైలి భాష వీటిలో దేనికి మొదట ప్రాధాన్యం యివ్వాలి!

★ నేను ఇతివృత్తానికీ, రీడబుల్ భాషకీ యివ్వాలని చూస్తాను.

కష్టసుఖాల్లో ఏది గొప్పదంటారు ?

★ సుఖమే. సుఖంలో కష్టాల గురించి ఆలోచించం. అలాగే కష్టాల్లో సుఖం గురించే — ఆలోచిస్తాం !

## టి టి. ఎమ్. ఆర్ . – పెదకాకాని

నా మీద కోపమా ? ఉత్తరాలకి జవాబులేదు?

★ కోపమా ? ఛ అలాంటిదేం లేదు. జవాబు 'రేపు' అనుకుంటా. అంతే — ఏ రోజుకా రోజు గడిచిపోతూ వుంటుంది.




## బి. ఎస్. ఆర్. – కొత్తఢిల్లీ

ప్రశ్నావళి శీర్షికలో మీరిచ్చే జవాబులు నాలాంటి అనేకమంది దద్దమ్మలకి తెలివితేటలు ప్రదర్శించడమే కాక ఆనందాన్ని కలిగిస్తున్నాయి. మీలాంటి వారే మన గొప్ప వ్యవస్థకి సంస్కృతికి మూలస్తంభాలు మీరు లేకపోతే ప్రశ్నావళి ఆంధ్రపత్రికా సంగతి అటుంచి అఖిలాంధ్ర పాఠకలోకమూ ఏమైపోతుందోనని ఊహించడానికే భయంగావుంది. నమ్మండి ... రియల్లీ ఐ ఎంజాయ్ యువర్ పారడి?

★ కొయ్ ! అని ఒక్క ముక్కలో అనేయ కలను. కాని రాజధానీ నగరపు నడిబొడ్డున నిలబడిన ఓ రావుగారికా యింత భేషజమా ? అన్న ఆశ్చర్యం నన్ను యింకా రాయించింది. అంతే. డియర్ మిస్టర్ రావు, మీ వ్యంగ్యం అందంగాలేదు అసహ్యంగా వుంది. కోడి కుంపటి కథలోలాగా — నేనూ నా ప్రశ్నావళీ లేకపోతే — మీలాంటి పాఠక జనం ఏమైపోతారోనన్న బెంగ మీకెందుకు ? మేధావులిచ్చే జవాబులున్నాయి. చదివి ఇంగితం పెంచుకోండి. కాస్తైనా ఎదగండి ! మరిచిపోయినన్నంటున్నారుగాని మన ఈనాటి సంస్కృతే భవంతికి మూలస్తంభాలు. మీలాంటి — సంకుచిత సంస్కార (సూడో!) వంతు లేనని తెలియని చిన్నదాన్ని కాదు నేను. ఢిల్లీ వెళ్లినా మనో వైశాల్యం పెరగని మిమ్మల్ని చూస్తే జాలేస్తూంది. అంతే. ఈ ఉత్తరం ఏ సీరియల్ గురించో ఏ పెద్ద పత్రికకో రాస్తే పెద్దక్షరాలతో వేసేవారు ! యీసారి అలా చేయండి. గుడ్‌లక్ !

## ఎం. బి ఎ. – ఇల్లెందు కాలరీస్

పత్రికల ఎడిటర్లు అందరూ ఏదో రంగంలో పేరు పొందిన వారిచే ప్రశ్నలకు జవాబులిప్పిస్తారు, కాని ఒక సామాన్యుని చేత యిప్పించరు ఎందుచేత ?

★ అందుకు మా సంపాదకులు భిన్నం — చూడండి— సాదా సీదా కంటే సాదా మనిషిని నాచేత యిప్పిస్తున్నారు. ఇప్పటికి నాకర్థంకాదు— ఏరోప్లేను ఎలా ఎగురుతోంది ? బల్లి కిందపడకుండా దూలాల మీద ఎలా పాకుతూంది ? చంద్రగ్రహణం ఎలా ఏర్పడుతోంది— ఊహూ ప్రస్తుతం మా శీను చెప్పి చూశాడు సైన్సు అయినా అర్థం కాలేదు. 'నువ్వింత బుద్ధు వేంటి అమ్మమ్మ' అంటాడు. నా సామాన్యతకి— సర్టిఫికెట్. ఇంతకు మించిన సామాన్య మేధ వుంటుందంటారా ?!

## ఎ. వి. ఆర్ . – విశాఖపట్నం

మనిషి తృప్తిగా జీవితం గడపడానికి ఏం చేయాలి ?

★ అవసరాలు, కోరికలు కంట్రోల్‌లో వుంచాలి

## గుండాన [illegible]ర్గపూడి

ఈ మధ్య విశాఖలో జరిగిన రచయితల సభలు జయప్రదం అయ్యాయని భావిస్తున్నారా ?

★ ఎప్పుడు ఏం చేసినా — పొగిడేవాళ్ళూ తెగిడేవాళ్ళూ వుంటూనే వుంటారు సార్. అంచేత చేయాలన్న పట్టుదలను మాత్రమే మీరు హర్షించండి. అందుకు నేను పోతుకూచిగారిని అభినందిస్తాను.

## యస్ వి. ఆర్ . – చినవంక

పవిత్రమైన దేవాలయాలపై సెక్సు శిల్పాలుండడానికి కారణం ?

★ సెక్సుకూడా పవిత్రమైనదే కదా ?

మనిషి యొక్క గమ్యస్థానం ఏమిటి ?

★ మనుగడ ... ఏ రోజు కా రోజు గడిపించడమే గగనమైపోతూంటే గమ్యం ఎవరు గుర్తుంచుకుంటారు ?



---

"సరే అయితే... నాకు చెప్పు జరిగిందంతా... మీ ఇద్దరి పెళ్ళి ఎలా జరగదో నేను చూస్తాను."

మెల్లగా చెప్పుకొచ్చింది సంధ్య ... సత్యంతో తన పరిచయం, అది ప్రేమగా మారటం, అతని పేదరికం, మంచితనం, అతనికి తనమీదున్న అభిమానం, అతని ఉద్యోగ ప్రయత్నాలు అన్నీ వివరంగా చెప్పింది.

సరిగ్గా అప్పుడే డా. శంకర్రావు కూడా వివరాలన్నీ విన్నారు. "విన్నారుగా...మీరా అబ్బాయి కేదయినా ఉద్యోగం చూడాలండి ... " భర్తని అభ్యర్థించింది సుభద్ర.

"అతని క్వాలిఫికేషన్ ఏమిటి ?"

"ఇంజనీరింగ్ పరీక్ష వ్రాసారంట."

"పోనీ అతనికింకో ఉద్యోగం అయేదాకా మన నర్సింగ్‌హోమ్‌లోనే ఏదో ఒకటి చూపించండి."

"ఇంజనీరు అయిన అబ్బాయి చేసే పనే ముంటుందిక్కడ ?"

## ఎలర్జీ

"ఏమో ... నాకు తెలీదు ... ఏం పని చూపిస్తారో మీ ఇష్టం ... అతను రేపట్నించి పనిలోకి వస్తాడు. ఇంక మీ స్నేహితుడికి చెప్పి ఒప్పించటమా, మనమే గుట్టుచప్పుడు లేకుండా వీళ్ళిద్దరికీ పెళ్ళి చేసెయ్యటమా — ఏది సులువో ఆలోచించండి."

"భలే చిక్కు తెచ్చిపెట్టావుగదమ్మాయ్ ... సర్లే నువ్వు విశ్రాంతి తీసుకో ... నీ సమస్య మీ ఆంటీ చేతిలో పెట్టేశావుగా ... ఇంక భయంలేదు... నిశ్చింతగా పడుకో."

"ఎందుకు పడుకోదూ ? ఇవాళ నిద్ర మాత్ర అక్కర్లేదని చెప్పెయ్యండి ... పదండి ... పోదాం" అని బయలుదేరింది సుభద్ర.

* * *

మూడునెలల తర్వాత ... ...

పోస్ట్‌లో ఉత్తరాలు మూడు వచ్చాయి. ఒకటి సుభద్ర పెద్దకొడుకు ఢిల్లీలో ఉన్నతని దగ్గర్నించి, ఒకటి అమెరికాలో ఉన్న చిన్నకూతుర్నించి, మూడోది సంధ్య దగ్గర్నించి. ఆ అమ్మాయి భర్త సత్యానికి హైదరాబాదు, హెచ్. ఎ. ఎల్. లో ఉద్యోగం వచ్చి రెండు నెలలయింది.

మూడింట్లో ముందుగా చదవటానికి సంధ్య ఉత్తరాన్నే ఎంచుకుంది సుభద్ర. చాలా పెద్ద ఉత్తరం రాసింది. అందులో సగభాగం ఆంటీకి, డాక్టరంకుల్‌కీ కృతజ్ఞతలే ఉన్నాయి.

"ఇక్కడ బాగా చలిగా ఉంటోంది. అయినా నాకు జలుబుకూడా చెయ్యలేదు. ఈ వాతావరణం నీకు బాగా సూటయింది అంటున్నారు ఆయన."

ఈ మాటలు చదివి తనలో తనే నవ్వుకుంది సుభద్ర.

"నీకు ఎలర్జీ కలిగించే పదార్థమేదో తెల్సిపోయిందిగా ? ఇంక ఇస్నోఫీలియా ఎందుకొస్తుంది" అనుకున్నది మనసులో.



# కార్యసాధకులకు సంతృప్తి



అద్భుతమైన రుచి దానికదే సాటి




## సిజర్స్ ఎప్పుడూ సంతృప్తి నిస్తుంది.

చట్టబద్ధమైన హెచ్చరిక
సిగరెట్ త్రాగడం ఆరోగ్యానికి హానికరం
STATUTORY WARNING
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

విశిష్టమైన పొగాకు రుచి మీరు అలాంటి రుచిని మంచి విలువగల సిగరెట్ల నుండి మాత్రమే ఆశిస్తారు. ఆ అమోఘమైన రుచిని సిజర్స్ ఒక్కటే ఇవ్వగలదు. లక్షల కొలది పొగత్రాగేవారు సిజర్స్‌తోనే వుండేందుకు ఎంచుకోవడంలో ఆశర్యం లేదు.




HTC-S-4684-3R

పెద్దకథ

# త్రాణకని స్వప్నం

## కోమలాదేవి

(గత సంచిక తరువాయి)

"మీ హృదయంలోని అలజడిని గుర్తించ గలను. మీతో ఎన్నో విషయాలు మాట్లాడాలని రమ్మన్నాను. దయచేసి చెప్పండి" ఆమె వేడికోలుగ అంది. అతడికి చీకాకువేసింది.

"అమలగారూ — ముందు ఈ విషయం చెప్పండి. మీకు అంగీకారమేనా ?" అతడి కంఠంలో వ్యంగ్యం ధ్వనించింది.

ఆ మాట అనగానే ఆమె అందవిహీనమైన మోము కూడ ఆనందంతో విప్పారుతుందని — కళ్ళు సిగ్గుతో వాలిపోతాయని ఛాతీవిరిచి కూర్చున్నాడు. ఆ ఛాతీ విరుపులో అతడి అహం పొంగినట్లుగా ఉంది.

ఆమె సిప్ తీసుకుని గ్లాస్ ప్రక్కన బెట్టింది.

అతడి దెస నిశ్చలంగా చూస్తూ అంది "నాకు ఇష్టం లేదు" ఆ మాటలు శరాఘాతాలైనై. మాధవ్ గూడలు చటుక్కున ఒంగిపోయాయి ఎత్తయిన స్థలంలో కూర్చున్న తనను ఒక్క దెబ్బతో క్రింద పడద్రోసి తన శరీరాన్ని తుత్తునియలుగా జేసినంతగా బాధపడ్డాడు ఆ తరువాత అతడిలో కోపం రగులుకున్నది. ఈమె... ఈ కురూపి.. తనను ఇష్టపడటంలేదు ! ఎంత అహంకారం ! డబ్బులో మునిగితేలే ఈమెకు అందం సంగతి ఏం తెలుసును... అతడిలో మాటుమణిగి ఉన్న పైశాచిక ప్రవృత్తి తల ఎత్తింది. వికటంగా నవ్వాడు. చటుక్కున లేచి నుంచుని — రెండు చేతులు పరచి నట్లు చాపి. .

"అమలా — చూడండి... నేను మీకు నచ్చలేదా?" వికటాట్టహాసం చేస్తున్నట్లు అడిగాడు.

ఆమె తల ఎత్తి అతణ్ణి నఖశిఖ పర్యంతం చూడలేదు.

తల వంచుకుని మెల్లగా అంది "మీరు నచ్చటం — నచ్చకపోవటం ప్రశ్న కాదు. ఈ విధమైన సంబంధం నచ్చలేదు."

అతడు చకితుడయ్యాడు ఆమె వంచిన తల ఎత్తలేదు. తన సుందర రూపాన్ని తనివితీర అవలోకించటంలేదు. "మీలాంటివారు నాకు భర్తగా లభిస్తుంటే — నేనెంత అదృష్టవంతురాలినండీ —" అన్న డైలాగుల కోసం ఎదురుచూచిన మాధవ్ శరీరంలోని శక్తి అంతా ఆవిరిలా తేలిపోయింది. అతడు నిస్పృతువతో కుర్చీలో కూలబడి రెండు చేతుల్లో తల పట్టుకున్నాడు.

"సారి... మీకు బాధ కల్గించాను... ఈ నీళ్ళు త్రాగండి" ఆమె గ్లాస్‌లో నీళ్ళుపోసి అందించింది

మాధవ్ అందుకుని త్రాగాడు. ఆమె కుర్చీ కాస్త దగ్గరగా వేసుకుని అంది "మిమ్మల్ని అవమానించాలని ఇక్కడికి పిలిపించలేదు. మీ అందాన్ని కించపర్చటంలేదు. అసూయతో అనటంలేదు. మీ అంత అందమైనవారు నాలాంటిదాన్ని పెళ్ళి చేసుకోటానికి అంగీకరించారంటే మీనుండి మీవాళ్ళంతా గొప్ప త్యాగం కోరారు. ఈ త్యాగాన్ని మీరు మనస్ఫూర్తిగా చేస్తున్నానని అనుకుంటున్నారు. కాని ఇందులో మూడవ వ్యక్తిగా నేనున్నానన్న విషయం ఎవ్వరికి పట్టలేదు. ముఖ్యంగా మీకు "

"నాకు పట్టలేదా ? తాళి కట్టేది నేను.. " అన్నాడు ఎకసెక్కెంగా.

"ఔను కట్టిన తరువాత ?"

అతడు ఒక్కసారి ఆమె దెస చూచి తల త్రిప్పేసుకున్నాడు.

"ఔను. కట్టినతరువాత నన్ను మీ భార్యగా చూచుకోగలరా ? ఆ ధైర్యం మీకున్నదా ?"

అతడు మౌనమే శరణన్నట్లు కూర్చున్నాడు.

"ఆ రాక్‌లలో పుస్తకాలన్నీ చూచారా ? మీకు టైంలేదు. ఒక్కసారి చూడండి. అన్నీ హైయ్యర్ మేథమేటిక్స్‌కు సంబంధించిన పుస్తకాలే. అవన్నీ నా పుస్తకాలు. నేను ఎం.ఎస్సీ. ప్యూర్ మేథ్స్‌తో పాసయ్యానని మీకు తెలుసు. ఫస్ట్ వచ్చాను. గోల్డ్ మెడల్‌కూడ మీరు చూచారు... కాబట్టి నా ఆలోచనలు ఒక్కఅంశంమీద కేంద్రీకృతమై ఆగిపోవు. ఒక లెక్క ఉంది — ఒక చిన్న ఈక్వేషన్ ఉంది. ఇ=ఎమ్‌సి$^{2}$ అన్నంత చిన్న ఈక్వేషన్‌లో ఎంత క్లిష్టమైన గణితం ఉంది ! దాన్ని విశదీకరించాలంటే ఎన్ని పేజీలు నింపాలి ! ఈ జీవితాన్ని కూడ అదే దృష్టితో చూస్తాను. మీరన్నట్లు తాళి కట్టటం అనేది ఒక చిన్న చర్య. రిజిస్ట్రార్ ఆఫీసులో కట్టినా, లక్షలు ఖర్చుచేసి ఐదురోజుల పెళ్ళిలో తాళికట్టినా ఒకటే. కాని జీవితంలో ఆ చిన్ని మలుపు తీసుకుని ఆగిపోవటం ఘోరం. ఆ క్షణం తరువాత ఎలా గడుస్తుంది. లెక్కను పెంచి, ఎన్నో సూత్రాలను ఉపయోగించి ఆన్సర్ తెచ్చి చూపటం లాంటిదే వైవాహిక జీవితం కూడా. అందుకే అడుగుతున్నాను. మీ భార్య గా నాకు మీ జీవితంలో చోటిచ్చి గౌరవించగలరా ?"

మాధవ్ తల ఎత్తలేదు. ఆమెకేసి చూడలేదు కాని ఒక్క నిట్టూర్పు వదిలాడు.

"చూచారా ... మీ కుటుంబంలోని ఐదుగురు సభ్యుల ఆనందం కోసం మీరు త్యాగం చేస్తున్నట్లు ఫీలవుతున్నారు. కాని మరొక వ్యక్తిని అధఃపాతాళంలోకి త్రోసివేస్తున్న విషయం మర్చిపోయారు. పెళ్ళైన తరువాత నన్ను నా పాటికి వదిలేస్తారు. డబ్బు ఉంటే ఎన్నో సుఖాల్ని కొనితెచ్చుకోవచ్చు. పేరుకు భార్యగా ఉండటానికి నా వ్యక్తిత్వం ఒప్పుకోదు."

"ఐతే నాకీ పెళ్ళి ఒద్దు అని చెప్పేయండి" అన్నాడు ఆశగా.

"నేను ఆడదాన్ని. అమ్మా నాన్నలు నా పెళ్ళి చేసితీరాలి. అదివారి కర్తవ్యం. ఈ ఇంటి అల్లుడికి ఉండవలసిన అర్హతలు రెండు ఒకటి సుమారైన ఉద్యోగంలో ఉండాలి. గౌరవంగా బ్రతుకుతున్న కుటుంబానికి చెందినవాడుగ ఉండాలి. ఎవరైన 'ఏం చూసి పిల్లను వాళ్ళకిచ్చారండీ ?' అని అడిగితే వాళ్ళది మంచి సంప్రదాయంగల కుటుంబం— అని—లేక అబ్బాయిది మంచి ఉద్యోగం· అని చెప్పకోవచ్చు. మీ విషయంలో ఇంకా గొప్ప కారణమే చెప్పకోవచ్చు."

"ఐతే నేను నా అనంగీకారాన్ని తెల్పాలంటారు ఔనా ?"

"ఔను" అంది దృఢంగా.

మాధవ్ కంఠం తడారిపోయింది. ఈమె తనను ఒద్దు అనమంటుంది కాని అది సాధ్యమా? పెళ్ళిచ్చే డబ్బుతో అప్పులుతీరి, ఇల్లు బాగై, కుసుమ పెళ్ళై కేశవ్ చదువు నిరాటంకంగా సాగి ఆ తరువాత ఎన్నోసుఖాల్నిఅనుభవించాలనుకుంటున్నారు. ఆ మధ్య తల్లీ తండ్రి తనను కూర్చోబెట్టుకుని హృదయం ద్రవించిపోయేలా దుఃఖిస్తూ తమకు విముక్తి కల్గించమని కోరారు. ఈ సంబంధం ఖాయం అయితే సమస్యలు లేవన్నారు. అందంగా ఉండదు... కాని అందాన్ని కొరుక్కుతింటామా ? తండ్రి ఇంకా రెండు నెలల్లో రిటైర్ అవుతాడు. ఆయన హైస్కూల్లో మేష్టారుగా పనిచేస్తున్నారు. ఆ తరువాత వాళ్ళ గతి ? తను తనకువచ్చే వెయ్యి రూపాయలలో ఈ సంసార బాధ్యతను స్వీకరించి బాధ్యతల్ని నెరవేర్చగలడా ? అది తలంచుకొంటేనే భయంగా ఉంటుంది—

ఆమె జాలిపడింది. "పాపం— మీరు కూడా నాలాంటి పరిస్థితుల్లో చిక్కుకున్నారు... మీరు ఇట్లా ఉన్నారని నేను భయపడి ఒద్దు అనమంటున్నాను— నేను ఇట్లా ఉన్నానని మీరు భయపడినా కావాలనుకుంటున్నారు. రెండూ విరుద్ధం— కాని దాని ఫలితం ఒక్కటే... పెళ్ళి..."

మాధవ్ తల ఎత్తలేదు. ఆమెకు బాధగా వుంది. వెళ్ళి లైట్లన్నీ ఆర్పివేసి ఒక్క డిమ్ లైట్ మాత్రం వేసింది. "నన్ను చూడటానికి వెల్తురు పనికిరాదు. చీకటిలో మాట్లాడుకోవటం బావుంటుంది."

మాధవ్ సోఫాలో ఆనుకుని ఆమెను చూచాడు. మసకగా ఆకారం కనిపిస్తోంది. అదేబావున్నట్లుంది.

"మీ నాన్నగారు ఎంత డబ్బు తీసుకోబోతున్నారో మీకు తెలుసా ?"

మాధవ్ నిర్ఘాంతపోయాడు. తెలీదని చెప్పటానికి సిగ్గువేసింది.

"చూచారా? ఈ వ్యవహారంలో మీరు ప్రముఖ పాత్ర వహించవలసినది బోయి ఏదీ తెలుసుకోటానికి కూడా ఇష్టపడని మీ అంతర్యంలో ఏమున్నదో గ్రాహ్యమవుతున్నది. నేను 'ఊ' అనాలి. నా ప్రమేయం అంతవరకే అనుకున్నారు. ఈ ముఖ్య విషయాల్ని నాన్నలకు ఒదిలేశారు."

ఆమె నిట్టూర్పు అతడి చేతకాని తనానికి బాధపడుతున్నదిలా ఉంది.

"చెప్పండి. పెళ్ళయ్యాక ఎక్కడ ఉండాలి?"

"ఎక్కడో ఎందుకు? మా ఇంట్లో..." ధీమాగా అన్నాడు.

"ఔను ... ఉదయం మీ నాన్నగారొచ్చారు. మా నాన్నగారు వేరే ఇల్లు చూచి కూతుర్ని అల్లుణ్ణి ఉంచాలన్నారు. కాని మీ నాన్నగారు ఇష్టపడలేదు. తమ ఇల్లు చాలా పెద్దదని— కాని బాగా పాతబడి పోయిందని రిపేర్ చేయించి — రెండు గదులు కట్టిస్తే కొడుకు కోడలు తమ దగ్గరే ఉంటారని— అంతా కలసి ఉంటే తనకు సంతోషంగా ఉంటుందన్నారు. మీ అమ్మాయికి వీలుగా ఉండేట్లు కట్టిస్తాను అన్నారు. మరో మాట కూడ అన్నారు— 'మా అబ్బాయికి కోడలితో మా ఇంట్లో ఉండటమే ఇష్టం' అన్నారు."

"ఔను" అన్నాడు మాధవ్ ముక్తసరిగా.

"కాని నాకిష్టం లేదు" అంది అమల దృఢంగా.

"ఎందుకు? మా అమ్మా— అంతా చాలా మంచి వాళ్ళు ........"

"వాళ్ళు మంచి వాళ్ళు కాదని నేననటం లేదు. ముందే చెప్పాను. ఒక అంశాన్ని గూర్చి ఎన్నో కోణాల్లో ఆలోచించటం నా అలవాటు. మీ మాటలను బట్టి ఒక విషయం తేలిపోయింది, నాపై వ్యక్తిగతంగా ఎటువంటి సద్భావం లేదని. ఆ గృహంలో నా స్థానం ఏమిటి? గుమ్మం కదిలి బైటకెళ్ళటానికి వీలుండదు— నాతో ఎవ్వరు రారు — ఎంత మంచివాళ్ళయినా చిన్న మాటతో నన్ను గూర్చి హేళన చేయవచ్చు. కొడుకు భార్యగా, అన్న భార్యగా గుర్తింపు ఉండదు. "పడిఉండు" అంటే పడి ఉండగల స్వభావం కాదు నాది. అట్లా అని స్వేచ్ఛగా నా ఇష్టం వచ్చినట్టు వ్యవహరించే అహంకారం నాలో లేదు. ఈ ఇంట్లో అమ్మ నాన్న నాకు విశిష్టస్థానం ఇచ్చారు. ఇద్దరన్నయ్యలను, ఒక అక్కయ్యను పెంచినంత నార్మల్‌గా నన్ను పెంచారు. పదిమందిలో తిరగవలసి వచ్చినప్పుడు నన్ను కూడ తీసుకుని వెళ్ళేవారు. డబ్బు మహత్మ్యం కాబోలు నా ఎదుట నన్ను ఎవరు ఏమి అనే వారు కారు. అద్దంలో నన్ను నేను చూసుకుని ఇలా ఉన్నానెందుకని ఒకసారి అమ్మనడిగాను. ఆమె అతి మామూలుగ నవ్వి నన్ను దగ్గరకు తీసుకున్నది. కారాకిళ్ళీ వేసుకుని బుగ్గన పెట్టుకుని గ్రహణం పట్టిన రోజున పడుకున్నదట. అందుకే నా బుగ్గమీద ఈ నల్లటి అసహ్యకరమైన మచ్చ వచ్చిందట! అదంతా ఉట్టిదే అని తరువాత తెలుసుకున్నాననుకోండి. నాలో నిబిడీకృతమైన శక్తుల్ని అతి చాకచక్యంతో గ్రహించి బైటికి తెచ్చి అందులో ప్రావీణ్యం సంపాదించేలా చేశారు. నన్ను ఒక పరిధిలో ఉంచి బంధించలేదు. 'నీకెందుకులేమ్మా' 'ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు' 'నీకు బావుండదు' 'నీవు రావద్దు' 'అక్కడికి నీవు వెళ్ళకూడదు' 'నిన్ను చూచి నవ్వుతారేమొ' ఇటువంటి ఆంక్షలు విధించి నాలో సంకోచబీజాన్ని నాటి నాపై



## తొణకని స్వప్నం

నాకు జాలి కళ్ళలా చేయలేదు. 'అట్లా చెయ్యాలి' అట్లా ముందంజ వేయాలి అని ప్రోత్సహించారు. నా మానసిక ఎదుగుదల అతి ఆరోగ్యకరంగా ఉన్నది. నన్ను గూర్చి నేను ఆలోచించుకోటానికి వ్యవధి లేకుండా చేశారు. చదువు, ఆ తరువాత సంగీతం — ఆ తరువాత గిటారు వాయించటంతో అలసిపోయే దాన్ని. అట్లా అని నాలో బాధ, అశాంతి, మానసికంగా కృంగిపోవటం వంటివి లేకపోలేదు. నేను అతి మామూలు స్త్రీని. ఒక్కో సంవత్సరం గడిచేకొలది నా పరిస్థితిని అర్థం చేసుకుని తగురీతి ఆలోచించగల మానసిక ప్రవృత్తిని అలవర్చుకున్నాను. వికలాంగుల కన్నా అదృష్టవంతురాల్ని. భగవంతుడు నన్ను ఈ అమ్మా నాన్నల చేతిలో పెట్టాడు. ఇప్పుడు చెప్పండి నన్ను తీసుకుని వెళ్ళి మీ ఇంట్లో పెట్టేసి అంతటితో మీ బాధ్యత తీరిపోయినట్లు వ్యవహరిస్తే నేను భరించగలనా ?''

మాధవ్ మాట్లాడలేదు.

అమల అతి మెల్లగా అడిగింది ''అసలు మీరు వింటున్నారా ?''

''వింటున్నాను. మీరు చాలా దూరం ఆలోచిస్తున్నారు.''

''ఔను. మీరు ఆలోచించలేదు. తాళికట్టటం తరువాత ఫుల్‌స్టాప్ పెట్టారు— ఆ తరువాత నన్ను మీ ఇంటికి తీసుకువెళ్ళాక ఫుల్‌స్టాప్ పెట్టారు. అంటే ఆ తరువాత నా విషయంలో బాధ్యత తీసుకోవటంగాని, జోక్యం కల్గించుకోటంగాని, ఏదీ చేయరన్నమాట !''

''మీరు పొరబడుతున్నారు. ఉమ్మడి కుటుంబంలో అమ్మా, నాన్నల ఇష్టానికి ప్రాధాన్యత ఇవ్వాలి. వారి మాట వినాలి. నేను వారికి విధేయుడనై ఉండాలి. నా బాధ్యత వారిదే కనుక మీ బాధ్యత వారు స్వీకరిస్తారు.''

''ఔను. సాధారణ కుటుంబాలలో ఇలాగే జరుగుతుంది. మా అక్కయ్య బాధ్యత అంతా వాళ్ళ అత్తమామగార్లదే. వాళ్ళకు అక్క అంటే ఎంతో ఇష్టం. ప్రేమతో చూచుకుంటారు. అట్లా అని మా బావ అక్కయ్య పూచీ తనది కానట్లుండరే ! ఆమె తన స్వంతం అనుకోవటమే కాకుండా — ఆమె సలహాలు తీసుకుంటారు. వాళ్ళకు కూడ ఎన్నో సమస్యలుంటాయి.''

ఆమె మాట్లాడే తీరు అతడి ఆలోచనలకు పదునుపెట్టింది. ఎంత సున్నితంగా చెబుతోంది ! తనకు తెలుసు... వాళ్ళ బావగారు వాళ్ళకు చాల పెద్ద ఆటో వర్క్‌షాప్ ఉన్నదని. కొన్ని స్పేర్‌పార్ట్‌లను విదేశాలనుండి దిగుమతి చేసుకోటానికి లైసెన్స్ ఉంది. వీళ్ళకు వాళ్ళు సరితూగ గలరు. అటువంటి ఇంట్లో ఆ విధమైనట్లు అత్త, మామ, భర్త, కోడలు పట్ల ప్రవర్తిస్తుంటే — ఎందులోను పోల్చుకోటానికి కూడ ఒక్క విషయంలేని మీ ఇంట్లో నన్ను వాళ్ళమధ్య ఒంటరిగా వదిలేసి మీరు దూరంగా బాధ్యత తీరిపోయినట్లు ఉంటారా ? అని అడుగుతోంది — నిజమే ...'తను అలాగే అనుకున్నాడు. పెళ్ళయ్యాక ఆమెను తెచ్చి ఇంట్లో పడేస్తాడు. పడి ఉంటుంది. అమ్మా నాన్న డబ్బు వ్యవహారాలు చూచుకుంటారు. తనవాళ్ళంతా పైకి వస్తారు, సుఖిస్తారు. తను ఆమె నుండి దూరంగా అతి దూరంగా ఉండిపోతాడు. అది తన తప్పుకాదు. కురూపిగా ఉండి తనను పెళ్ళాడిన ఆమెది—డబ్బిచ్చి తనను కొన్న మామగారిది — అని కసిగా అనుకునేవాడు ... కాని ... ఈమె ...అందరిలాంటిదికాదు... ఆమె సునిశిత పరిశీలన — సంస్కారవంతమైన మాటలు — దాపరికం లేకుండ సూటిగ ప్రశ్నించే తీరు ... ముఖ్యంగా తన ఆలోచనల్ని పసిగట్టి ఒక్కో విషయాన్ని బైటికి లాగుతున్న చాకచక్యం అతడిలోని జడత్వాన్ని, దూరంగా పారిపోవాలన్న కాంక్షను పారద్రోలాయి.

''సారి ... నేను ఆలోచించలేదు'' నేరస్థుడిలా అన్నాడు.

''ఫరవాలేదు. ఒప్పుకున్నారు ... మరి అట్లా అయితే దయచేసి ఆలోచించండి. ఇంతకాలం మీరు ఒక కోణంలో ఆలోచించారు. మిమ్మల్ని కేంద్రంగా పెట్టుకున్నారు. 'ఈ పెళ్ళివల్ల ప్రతి ఒక్కరు లాభం పొందుతారు, నేను తప్ప. నా భవిష్యత్తు, నా ఆనందం — నా బంగారు కలలు అన్నీ అగ్నిపాలై పోయాయి. నా వెలుగులో అందరు ఆనందంగా ఉండాలి — నేను కరిగి నశించిపోయినా ఫరవాలేదు' అన్న ఆలోచనతో ఉన్నారు. కాని నా కోణంలో ఆలోచించండి ... నాకు జ్ఞానం వచ్చినప్పటినుండి ఈ జీవితంతో అవిరామంగా పోరాడుతూనే ఉన్నాను. ఈ పోరాటంలో గెలుపు నాదే అవుతుందన్న విశ్వాసం నాకుండేది. నా కంఠం మధురంగా పల్కాలని సాధన చేశాను, నా వాయిద్యం నా చేతిలో అత్యద్భుత శబ్ద తరంగాల్ని సృష్టించాలని కృషి చేశాను. నా

### పంటి జబ్బులకి చిట్కా !

రోజూ చిటికెడు సోడాఉప్పుతో పళ్ళు తోముకుంటే పంటి వ్యాధులను అరికట్ట వచ్చు. ఇటీవలి కాలంలో పూర్తిగా మర్చిపోయి నప్పటికినీ, పూర్వం సోడాఉప్పును పళ్ళపొడిగా ఉపయోగించేవారు. దంత వ్యాధుల నివారణకు సోడాఉప్పు ఉపయోగం గురించి ప్రస్తుతం శాస్త్రీయ ఆధారాలు కూడా లభించాయి.

1978 లోనే అమెరికాలోని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ పరిశోధకులు దంతవ్యాధులను అరికట్టడంలో సోడాఉప్పు, సాధారణ ఉప్పు ఉపయోగపడగలవని ప్రకటించారు.

ఇటీవలి కాలంలో కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం శాస్త్రజ్ఞులు నోటిలో ఏర్పడే బాక్టీరియా పై సోడాఉప్పు (సోడియం బైకార్బొనైట్), ఎప్సంసాల్టు (మెగ్నీసియం సల్ఫేట్), సాధారణ ఉప్పు (సోడియం క్లోరైడ్)ల ప్రభావాన్ని పరీక్షించారు.

తక్కువ సాంద్రతలో సోడా ఉప్పు, మిగిలిన రెండు లవణాల కంటే బాక్టీరియాను మరింత చురుగ్గా నిరోధిస్తున్నట్లు కనుగొన్నారు.

హాబీలో అందమైన ఆకులు, లతలు, తీగలు,పూవులు రూపుదిద్దుకుంటున్నాయి. ఈ సాఫల్యానికి కారణం నా కృషి. అంతేకాదు అవి జడపదార్థాలు. నా ఇష్టాన్ని వ్యతిరేకించే శక్తి, నా నుంచి పారిపోవాలన్న కాంక్ష వాటికి లేవు. వాటికి హృదయం లేదు. మన హృదయాలు సున్నితమైన గుణాలకు నిలయం. కనుక మీరు ఆలోచించండి...''

మాధవ్ కళ్ళు మూసుకుని వింటున్నాడు. అతిశ్రద్ధగా తిలకిస్తున్నాడు. ఆమె మాటల్లోని యదార్థానికి — తను సిగ్గుపడ్డాడుకూడ.

ఆమె కొంతసేపు మౌనంగా ఉండిపోయి తరువాత అంది ''ఆలోచిస్తారా ?''

మాధవ్ కళ్ళు తెరచి నిటారుగ కూర్చున్నాడు ''ఆలోచిస్తాను. తప్పక ఆలోచిస్తాను... అన్నట్లు మీకు సంగీతంలో ప్రవేశం ఉందా ?''

అతడి కంఠంలో ఆత్రత — ఆమెకు చిరునవ్వు పుట్టించింది. ఆ అతిచిరువెలుగులో ఆమె మందహాసం చేస్తోందని అతడికి తెలియదు.

''ఔను. ఏదో కొద్దిగా పాడతాను.''

''ఇప్పుడు ఒక పాట పాడతారా ?''

''ఈమాటు. నాన్న అమ్మ వచ్చే వేళైంది. మిమ్మల్ని చూచి ఏమీ అనుకోరుగాని భోజనం చేసి వెళ్ళమంటారు. మీరు నిరాకరించలేరు. ఉన్నంతసేపు నా మాటల్ని మననంచేస్తూ పరధ్యానంగా ఉంటారు. మీరు బయలుదేరితే మంచిది... ఎల్లుండి వస్తారు కదూ ?... అసలు విషయం మీకు చెప్పాలి. ఇది తరువాత చూడండి'' అని ఒక కవరు చేతిలో ఉంచింది.

ఆమె లేచి కాస్త అవతలగా వెళ్ళి ''లక్ష్మీ'' అని పిల్చింది.

ఆ పిల్ల రాగానే ఏదో చెప్పి పంపింది.

''రండి...'' ఆమెలైట్ వేసింది. ఆమె వెనకాతలగా నడుస్తున్నాడు. అమల ఒక్కో గది దాటుతూ ముందు నడుస్తోంది. ''మరో విషయం. డబ్బుతో అత్యంత ముఖ్యమైన అవసరాల్ని తీర్చుకోవాలి — ఆర్థిక ఇబ్బందులనుండి విముక్తి పొందాలి... కాని... పైపై మెరుగుల కోసం, లగ్జరీల కోసం ఆరాటపడటం మీ దృష్టికి రాలేదనుకుంటాను.''

''లేదు. ఏం... కావాలన్నారా ?''

''మీరే ఇంట్లో అడగండి. డబ్బు విషయం పట్టనట్లుండకండి. ప్లీజ్...'' వేడికోలుగా అంది.

బైటకొచ్చారు. కారు ఆగి ఉంది. డ్రైవర్ డోర్ తీసి పట్టుకున్నాడు. ''వెళ్ళొస్తాను. ఎల్లుండి వస్తాను'' అని కారెక్కాడు.

తలుపు మూసి డ్రైవర్ తన సీట్‌లోకి వెళ్తున్నాడు. ఆమె పై మెట్టుమీదనే నుంచుని ఉంది. మాధవ్ తల ఎత్తాడు. ఆమె అప్పుడే వెనుదిరిగింది. కాని ఆ క్షణంలో ఆమె కళ్ళలో మెరిసిన కన్నీటి పొరను అతడు గమనించలేదు. భారభరిత హృదయంతో వెనక్కి వాలి ''బర్కత్‌పుర వై.యం.సి.ఏ. దగ్గర దింపు'' అన్నాడు.

కుషన్‌మీద చేరబడి గబగబ కవర్ చింపాడు.

చిన్న కాగితం ... దానిమీద ఇలా రాసివుంది.

''మీ కుటుంబం ప్లస్ డబ్బు. వీరినుండి మీరు మైనస్. ఇదంతా కలిస్తే సున్నా... అంటే నేను.

మీ కుటుంబం + డబ్బు — మీరు = 0.

ఈ సున్నాను మన భారతీయులు కనిపెట్టారు.

ఆ సున్నాలాగున నేను ఉండలేను..''

దాన్ని పదే పదే చదివి జేబులో పెట్టుకున్నాడు.

ఎంత స్పష్టంగా చెప్పింది.

అచ్చం అట్లాగే ఉండాలను కున్నాడు.

వెనక్కి జేరబడి కళ్ళు మూసుకున్నాడు.

సున్నా... ఒక్కటి కాదు ఎన్నో సున్నాలు... వలయాలుగ ఒకదాని వెంట ఒకటి తరుముకు వస్తున్నాయి. చిన్న వలయం ఆ తరువాత గ్రాడ్యుయల్‌గా పెద్దవి ... ఎన్నో ... ఆ వలయాలు ఎక్కడి నుండి వస్తున్నాయి ! సుడిగుండం ... అది తనలో లీనమైపోతున్నాయి. తనను బంధించి ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ఆ సుడిగుండంలో తను పడిపోతున్నాడు .........

బ్రేక్ కుదుపుకు మాధవ్ చటుక్కున కళ్ళు తెరిచాడు. ఎందుకీ విధంగా బాధ పడుతున్నాడు !

ఈ పెళ్ళి వల్ల తను సుడిగుండంలో చిక్కుకు పోయినట్లుగ అయిపోతాడేమో —

ఆమెను తను లెక్కచేయడు. అందుకని మిగతావారు నిర్లక్ష్యం చేస్తారు — డబ్బు వాళ్ళ చేతిలో ఉంటుంది .. తను కూడ సున్నాలాగున అయిపోతాడు. ఒకనాడు ఈ త్యాగానికి విలువ ఉండదు, తనకు ఏదీ మిగలదు తను ఒక అనామకుడుగా మిగిలిపోతాడు.

ఊహూ ... అట్లా కాకూడదు.

తను మూడ్ పార్టీగా ఇకపై ఉండకూడదు ఈ పెళ్ళి ఏ పరిస్థితులలోను తప్పేపోనప్పుడు దీని వలన తను ఆనందంగా సుఖంగా ఉండటానికి ప్రయత్నం చేయాలి. దీనికి కారకురాలైన ఆమెను శూన్యగృహంలో ఒదల కూడదు.

తను ఎందుకు విరాగిలా తలంచాడు? మరో వ్యక్తిని తన భాగస్వామిగా పదిమంది ఎదుట స్వీకరించి ఆమెను తెచ్చి తనింట్లో పడెయ్యాలను కున్నాడు. ఆమె చూడటం— సరదాగా తిరగటం— అసలు ఆమెను తన అర్ధాంగిగా ఏలుకోవటాన్ని— ఏదీకూడ క్రమపద్ధతిలో మామూలు మగవాడిగా తను ఆలోచించలేదు.

చిన్న సంఘటన ఊహించుకున్నాడు.''సినిమాకు వెళ్దాం'' అని చెల్లి అంటుంది. అంతా తయారవుతారు. ''నువ్వెందుకు నువ్వూ మాధవ్ వెళ్ళండి'' అంటుంది తల్లి.

''అన్నయ్య అసలు తీసుకెళ్ళడు— వదినతో వెళ్ళటం సిగ్గు'' అంటుంది చిన్న చెల్లి— ''నీకు సినిమా తక్కువైందా?'' అంటాడు తను !

ఎంత ఘోరం !

అలాగే— ఒకవేళ అమల చక్కటి చీర కట్టుకుంటే ''నీకిది బాగలేదు వదినా'' అంటే చాలదూ?

''చందమామకు మచ్చ ఉన్నట్లు వదినకు మచ్చ...''

''మచ్చ ఉన్నా చందమామకు అందం ఉంది కాని...''

అంతా ఘొల్లున నవ్వుతున్నారు.

**(ఇంకా ఉంది)**








# డాక్టర్ సలహాలు



## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### ఆర్. జె. ఆర్. – హైదరాబాదు

నా వయస్సు 25 సం॥లు. రెండు నెలల క్రితం ఒక స్త్రీని కలిశాను. తర్వాత పది రోజులకి అంగం చివర చిన్న పొక్కులు కనిపించాయి. నాకు ఇంకా పెళ్ళి కాలేదు. ఈ పొక్కులు కొన్ని కేప్సూల్సు వాడినా తగ్గలేదు.

★ రోగ నిర్ధారణ చేయకుండా కేప్సూల్స్ వాడినంత మాత్రాన రోగం నయమయ్యే అవకాశం లేదు. అయిదు రకాలైన సుఖరోగాలు ప్రస్తుతం మన ప్రాంతాలలో ప్రబలి ఉన్నాయి. పొక్కులనుంచి కారే 'రసి' వంటి పదార్థాన్ని పరీక్షిస్తే రోగ నిర్ధారణ జరుగుతుంది. రోగానికి తగిన మందులు వాడవలసి ఉంటుంది.

### వై. వి. కె. – సికింద్రాబాద్

నా వయస్సు 20 సంవత్సరములు. నాకు రెండు సంవత్సరముల క్రితం 'ఫిమోసిస్' వచ్చినది. మూత్ర ద్వారం బిగుసుకుపోయినది. 'ఫిమోసిస్'కి సర్‌కమ్‌సైస్ ఆపరేషన్ తప్ప గత్యంతరం లేదా?

★ ఫెమోసిస్‌కి సర్కమ్‌సిషన్ ఒక్కటే మార్గము.

### జి. వి. – మార్కాపురం

నాకు 'నత్తి' వున్నది. అంటే మాట్లాడే టప్పుడు మొదటి పదములోని అక్షరమును రెండు, మూడుసార్లు అనను. మామూలుగానే మాట్లాడ తాను. కాని ర, ల అను అక్షరములను 'య'గా పలుకుతాను. మాటలు స్పష్టంగా వచ్చుటకు ఏమైనా ఆపరేషన్ చేయించుకోవచ్చునా ?

★ మాటలు స్పష్టంగా రావటానికి శస్త్రచికిత్స ఏమీ లేదు. స్పీచ్ తెరపీ ఒక దానివల్ల చాలా మటుకు సాధ్యం అవుతుంది. ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పీచ్ అండ్ హియరింగ్ మైసూరులో ఉంది. అక్కడ స్పీచ్ తేరపిస్టులు ఉంటారు. మీరు వారి సహాయం పొందడం మంచిది.

### పి. ఆర్. కె. అర్. – విశాఖపట్నం

నా వయస్సు 24 సంవత్సరాలు. నాకు పది సంవత్సరాలుగా హస్త ప్రయోగం అలవాటువున్నది. అందువలన నా సంతాన యోగ్యత దెబ్బతింటుందా?

★ హస్త ప్రయోగానికి సంతాన యోగ్యతకి సంబంధం లేదు.

### టి. ఎల్. పి – హైదరాబాద్

నాకు 34 సంవత్సరములు. నాకు 12 సంవత్సరముల వయస్సు నుండి కుడిచెవిలో చీము కారుతుంది. ఇప్పటివరకు ఎందరో స్పెషలిస్టులకు చూపించాను కాని గుణము కన్పించలేదు. చెవిలో ఎప్పుడూ దూది పెట్టాల్సి వుంటుంది. చీము చెడు వాసనగా వుంటుంది. చెవు కొద్దిగా తక్కువ వినబడుతుంది.

★ దీనిని క్రానిక్ సప్యురేటివ్ ఆటైటిస్ మీడియా అని అంటారు.

ఈ చీమును లేబొరేటరీలో పరీక్ష చేయించవలసి ఉంటుంది' కల్చర్ అండ్ సెన్సిటివిటీ పరీక్ష చేయించటం వల్ల ఏ మందుకి క్రిములు లొంగుతాయో తెలుస్తుంది. ఆ మందుని చెవులలోను, ఇంజక్షన్ ద్వారాను వాడటంవల్ల రోగం తగ్గే అవకాశం ఉంటుంది.

### డి. వి. ఎన్. ఎమ్ – అమలాపురం

నా వయస్సు 24 సంవత్సరములు. నాకు కంఠములో 3 నెలల నుండి నెప్పిగా వున్నది. మందులు వాడినా తాత్కాలికముగా నెప్పి తగ్గి మరల నెప్పి వస్తున్నది. ఒక డాక్టరుకి చూపిస్తే టాన్సిల్స్ సెప్టిక్ అయినవి అన్నారు. ఇది మందులతో తగ్గుతుందా ? ఆపరేషన్ చేయించుకోవాలా? వీటికి కేన్సర్‌కు ఏమైనా సంబంధము వున్నదా ?

★ సెప్టిక్ టాన్సిల్స్ యాంటీబయాటిక్ మందులవాడకంవల్ల తాత్కాలికంగా మామూలు పరిస్థితికి వస్తాయి. కానీ అలా తరచూ జరుగుతుంటే శస్త్రచికిత్స ద్వారావాటిని తీసివేయవలసి వుంటుంది. సెప్టిక్ టాన్సిలైటస్‌కీ కేన్సర్‌కీ సంబంధం లేదు.

### ఎస్ – డి. తిరుపతి

నా వయస్సు 21 సం॥లు. నేను మెచూర్ అయి 6 సం॥లు అవుతున్నది. అప్పటినుంచి మొహమంతా విపరీతంగా మొటిమలు వస్తున్నాయి. ఒకటి పోతే ఒకటి వస్తున్నది. ఇవి ఏమిచేస్తే పోతాయి ?

★ స్త్రీలలో 16వ సం॥ నుంచి మొటిమలు రావటం సహజం. వీటికిగాను ప్రత్యేక చికిత్స అనవసరం అనే చెప్పవలసి ఉంది. వీటిని పిండటం గానీ, సూదులతో గుచ్చటంగానీ చేయకూడదు. పైపూతగా ప్రగ్మటార్ ఆయింట్‌మెంట్ వాడితే కొంత మెరుగుదల కనిపిస్తుంది. వయస్సు పైబడే కొద్దీ కొత్త మొటిమలు రావటం తగ్గుతుంది. ●




జనని జన్మభూమీ స్వర్గంకంటేకూడా గొప్పవి(ట).

పుడుతూనే తల్లిని కోల్పోయిన దురదృష్టవంతుణ్ని నేను. స్కాలర్‌షిప్పూ, ఉచితంగా హాస్టలు భోజనమూ యిచ్చి నన్ను పెంచి పెద్దవాడిని చేసిన ఆంధ్ర విశ్వవిద్యాలయమే నాకు జననీ జన్మభూమీ అనిపిస్తుంది. టెక్సాస్... కాలిఫోర్నియాలలో రకరకాల ఉద్యోగాలు చేసి— ఐదేళ్ళ క్రితం న్యూయార్క్ వొచ్చి— ప్రొఫెసర్‌గా స్థిరపడ్డాను. నన్నింతవాడిని చేసింది ఆంధ్ర విశ్వవిద్యాలయమే.

భారతదేశంలో నాకు నిజమయిన బంధువులెవరూ లేరు. ఒకే ఒక్క మిత్రుడు— విశ్వం ఉన్నాడు. ఇద్దరమూ కలసి చదువుకున్నాం. రిసెర్చి పూర్తయి— నేను అమెరికా వచ్చేసేవరకూ అతనూ నేనూ ఒకరి కొకరం ప్రాణంలా మెలిగాం. గంగిగోవు పాలు గరిటడైనను చాలన్నట్లు నిజమయిన స్నేహితుడు ఒక్కడు చాలడూ ?

న్యూయార్క్— ప్రపంచ ప్రఖ్యాతి చెందిన నగరం. నాకిక్కడ గొప్పవారితో పరిచయాలున్నాయి. అయినా— పదిహేనేళ్ల క్రిందట మసలిన నా విశ్వ విద్యాలయాన్నొక్కసారి కళ్లారాచూడాలనీ, మిత్రుడు విశ్వంతో నాలుగు రోజులు సరదాగా గడిపిరావాలనీ మనసు కొట్టుకోడం ప్రారంభించింది. అమ్మని చూడాలనీ, ఆత్మీయుడైన స్నేహితుడితో సరదాగా కాలక్షేపం చేయాలనీ ఎవరుమాత్రం ఉవ్విళ్లూరరు? మేలుకున్నా... పడుకున్నా... ఆ రోజుల జ్ఞాపకాలే.

అదృష్టవశాత్తూ— అనుకోకుండా అవకాశం లభించింది. విశ్వానికి కేబులుపంపి—విమానంఎక్కాను. అమ్మలాటి ఆంధ్రవిశ్వవిద్యాలయాన్ని చూడబోతున్న ఆనందం...స్నేహితుడు విశ్వంతో సరదాగా గడప వచ్చునన్న సంతోషం...పదిహేనేళ్ల క్రిందట మసలిన వాతావరణపు జ్ఞాపకాలు ... ఇప్పుడా పరిసరాలెలా ఉంటాయో అన్న ఆత్రత ... మనసు ఉద్విగ్నత చెందుతూ నిద్రపట్టలేదు. విమానం మేఘాలలో ఎగురుతూంటే—నా మనసు యింకా ఎత్తుల్లో ఎక్కడెక్కడో విహరించసాగింది. అనుభూతులు అమూల్యమైనవి.

ఏరోడ్రోమ్‌కి వొచ్చాడు విశ్వం. ఒకరినొకరం చూస్తూనే పోల్చుకున్నాం. నిజమయిన స్నేహాలు — పరిచయాలలా—ఎండకి మంచులా కాలానికి కరిగిపోవు. ఒక్కసారి యిద్దరమూ ఆప్యాయంగా కౌగలించుకున్నాం. అతనికళ్ళల్లోనూ ఆర్ద్రత వొచ్చిందనే నా నమ్మకం.

"అవతల— కారుంది. పద..." నా చేయి పట్టుకు నడిపించాడు విశ్వం. ఇద్దరమూ కారులో కూర్చున్నాం. కారు—ఊరివేపు పరుగుతీస్తూంది. వాల్తేరుస్టేషన్...అల్లిపురం జంక్షన్ ... సరస్వతీ థియేటర్...

"స్లోగా పోనీ..." నాకు బాగా తెలిసిన పరిసరాలు ప్రారంభమయ్యాయి. విశాలంగా మారిన ఆ రోడ్డు ..అటూ యిటూ కొత్తగావెలిసినకొట్లు.. పాతరోజులతో పోలికలు...చిత్రంగా ఉంది.

'కోస్టల్ బ్యాటరీ మీంచి పోదాం... సముద్ర తీరం పక్కగా..."

ఆ సముద్రం ఎంత అందంగాఉంది. అప్పుడిక్కడ యింత మంచిరోడ్డులేదు. కాని ... "బీచ్ తగ్గిపోయిందేం?" అడిగాను.

"సముద్రం పొంగి ఊరిమీద కురుకుతూంటే . అడ్డం వేశారు..."

రామకృష్ణామిషన్‌దగ్గర మలుపు తీసుకుని ఎత్తు ఎక్కసాగింది కారు.

కారు విండోలోంచి ఆత్రంగా .చిన్నపిల్లవాడిలా బయటకు చూస్తున్నాను.

సిరిపురం జంక్షన్...

"ఈ రోడ్డు బాగుంది కానీ...అప్పుడు రోడ్డు పక్క ఎర్రపూలతీగెలు దట్టంగా అల్లుకుని ఉండేవి."

విశ్వం నవ్వి ఊరుకున్నాడు. నా మనసుగ్రహించి

కాబోలు నన్ను, నా ఆలోచనలని భంగపరచడంలేదు. కారు—యూనివర్సిటీ ఏరియాలోకి వొచ్చేసరికి నేను వివశత్వమే చెందాను వివరించలేని అనుభూతి అది.

కారాగింది అతని క్వార్టర్స్ ముందు. అతని శ్రీమతి ఆహ్వానించింది, మేము దిగి యింట్లోకి అడుగుపెడుతూంటే

''అలసిపోయి ఉంటావు. వేడినీళ్ల స్నానం చేసిరా ... ''

నిజమే. ప్రయాణంలో అసౌకర్యం వల్ల కాదు కానీ ఆలోచనలవల్ల నిద్రపట్టలేదు ఆనందం ఎక్కువయినా మనిషికి నిద్రరాదు కాబోలు.

స్నానం భోజనం.. ఇట్టే నిద్రపట్టేసింది— గాఢంగా తెలివొచ్చేసరికి . . గాజు కిటికీలలోంచి గదిలోకి ఎండ పడుతోంది తమాషాగా. లేచివెళ్లి కిటికీ దగ్గర నిలుచున్నాను.

అందమయిన . అద్భుతమయిన దృశ్యం.

ఆనందంతో ఆత్రతతో .. గుండెలు భారమై ...

యూనివర్సిటీ బిల్డింగులు . అవి .. హాస్టల్ బ్లాక్స్...ఆ వెనుక నీలంగా పరచుకున్న సముద్రం.. ఎంత అందమయిన పరిసరాలలో నెలకొంది ఆంధ్ర విశ్వవిద్యాలయం ! . ఇంత చక్కని బ్యాక్‌గ్రౌండ్ ఏ యూనివర్శిటీకి లభిస్తుంది? కొండమీద ... సముద్రం వొడ్డున ...

''లేచావా ! .. ముఖం కడుక్కురా. టీ తీసుకుందాం.''

''నువ్వెంత అదృష్టవంతుడివి ! నీకు నా అభినందనలు'' ఉద్వేగంగా అన్నాను.

''ఎందుకని ?''

''ఇద్దరమూ యిక్కడే చదువుకున్నాం నువ్విక్కడే ఉద్యోగం చేస్తున్నావు నేనేమో యీ అందమయిన పరిసరాలు వొదిలి — పరదేశం పోవలసి వచ్చింది.''

''ఇదీ ఓ అదృష్టమేనా ? చక్కగా ఫారిన్‌లో ఉంటున్నారు ! అదృష్టమంటే మీది. ఇక్కడే ముంది ?'' టీపాయి పట్టించుకు వొస్తున్న సురేఖ అంది. ఆమె మాటలకు తెల్లబోయాను. ఇక్కడేమీ లేదూ ?

''దూరపు కొండలు ...'' అన్నాను పేలవంగా నవ్వుతూ.

## ఆ రోజులు వేరు

''ఔను. దూరపు కొండలు .. '' అందామె కూడా నవ్వుతూ.

ఆమె ఉద్దేశం నా కర్థమైంది. నాకు చురక వేశాననుకుందికానీ ... అమ్మ వొడిలాటి ఆంధ్ర విశ్వవిద్యాలయం కంటే అమెరికాలో హాయిగా ఉంటుందంటే — నేను మాత్రం అంగీకరించలేను నాగరికత మితిమీరితే సుఖాలకంటే దుఃఖాలే ఎక్కువ. అనుభవిస్తే తప్ప అంగీకరించలేరది.

''విద్యార్థిగా గడిపిన విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడు కావడం — తక్కువ అదృష్టమనుకోను'' అన్నాను విశ్వం వేపు చూస్తూ.

అతను — నవ్వాడు. ఆ నవ్వులో బాధ ఉంది !

ముఖం కడుక్కుని గదిలోకి వొచ్చేసరికి — టీపాయ్‌మీద టీ పాట్, కప్పులూ వగైరాలు. ప్లేట్లలో...

సురేఖ నాకు ఆశాభంగం కలిగిస్తూంది.

''ఈ బ్రెడ్ టోస్టులు కాక — పెసరట్లో, దోసెలో చేయలేకపోయారా ? మించిపోయింది లేదుకానీ — ఇంట్లో చేగోడీలుంటే పట్రండి.''

''అమెరికా నుంచి వొచ్చి చేగోడీలు తింటారా!''

నవ్వాను. ''నే నమెరికానుంచి ఆంధ్రదేశం వొచ్చిందెందుకో తెలుసా ? ఆవకాయా గోంగూర పచ్చడీ తినాలనీ... ఆంధ్ర భాష వినాలనీ... ఆత్మీయులతో హాయిగా గడపాలనీ. సురేఖా ! మీరు దయచేసి నాతో తెలుగులోనే మాట్లాడండి. నేను తెలుగూ మరచిపోలేను, అమ్మలాటి ఆంధ్ర విశ్వవిద్యాలయాన్నీ మరచిపోలేను జీవితంలో. మాతృమూర్తి మాతృభాషా — రెండిటి విలువా నాకు బాగానే తెలుసు ''

ఆమె నిట్టూర్చింది. నన్నో వింత పశువుని చూసినట్లు చూసింది.

''డిన్నర్ — ఏం తీసుకుంటారు ?''

''రాత్రి — వంకాయ కూరా, సాంబారూ చేయండి. పెరుగూ అన్నంలో అప్పడం నంచుకుంటూంటే చాలా బాగుంటుంది.'' — ''చూడండి. నేను డిన్నర్ తీసుకోను. హాయిగా భోజనం చేస్తాను.''

ఆమె లోపలికి వెళ్లిపోయింది. ఇంకా — చాలా సాయంత్రం ఉంది.

''ఏమిటి కార్యక్రమం ?'' అడిగాడు విశ్వం

''యూనివర్సిటీ ఏరియా అంతా తిరుగుదాం మనం చదువుకున్న లెక్చర్ హాల్సు .. లేబొరేటరీలు డైనింగ్‌హాలు హాస్టల్ రూమ్స్. . చూద్దాం విశ్వం ! నీకు జ్ఞాపకం ఉంది కదూ, మనం అశోకవర్ధన బ్లాక్‌లో ఇరవై నాలుగు గదిలో ఉండే వాళ్లం. ఓసారా గది చూడాలి. ఆ గదిలో — గోడ మీద — మేకులో — మన యిద్దరి పేర్లూ చెక్కేశాం గుర్తుందా ?''

అతని ముఖం ఎందుకో ఒక్కసారి వివర్ణమైంది

''వొద్దు అవన్నీ చాలా మారిపోయాయి.''

''అందుకే. మారిన రూముని చూస్తూంటే గుండెలో పాత జ్ఞాపకాలు మెదులుతూ ఆ రోజులు జ్ఞాపకం వొస్తూ.. చిత్రమైన అనుభూతులు కలగవూ ?''

''ఈ విషయంలో నువ్వేమీ మారలేదు. నీ భావుకత అప్పటికీ యిప్పటికీ అలాగే ఉంది ''నవ్వాడు

''చాలా విషయాల్లోనే మారలేదు '' నేనూ నవ్వేశాను. ''పద—'' అంటూ లేచాను

''సారీ. కావాలంటే నువ్వు తిరిగిరా నిజానికి— మానేస్తేనే మంచిది.''

''ఏమిటి నీ భయం? మరచిపోకు.మనమిప్పుడు ప్రొఫెసర్లం. అప్పటిలా స్టూడెంట్సు కాము '' పెద్దరికాన్ని గుర్తుచేశాను నవ్వుతూనే.

''అందుకే '' అన్నాడు. నాకేమీ అర్థంకాలేదతని వైఖరి ఒకటి మాత్రం స్పష్టమైంది అతనికి నాతో అలా రావడం యిష్టంలేదెందుకో ఇంక అతన్ని ఒత్తిడిచెయ్యలేదు.ఒంటరిగానేబయలుదేరాను

ఈ పదిహేనేళ్లలోనూ ఎంతో మారిపోయింది యూనివర్సిటీ. కొత్త బిల్డింగులు ఎన్నెన్నో లెక్చర్ హాల్సు. . లేబొరేటరీలు అనేకమైన బ్లాక్స్ . ఒక్కొక్కటీ చూసుకుంటూ వెళ్తున్నాను. స్టూడెంట్లు నన్ను వింతగా చూస్తున్నారు నేను వారిని పట్టించుకోకుండా నా ధ్యాసలో ఉండిపోయాను పాత బిల్డింగులకీ కొత్తవాటికీ ఎక్కడా పోలికలు దొరకడంలేదు. ఎంత మార్పు వొచ్చేసింది! గదులు మూసివున్నా— పైనుంచే వాటిని చూస్తూ కారిడార్స్‌లో నడుస్తున్నాను.

నేను చదువు నేర్చుకున్న లెక్చర్ హాల్స్ ఏవి ? గుర్తించలేకపోతున్నానంటే సిగ్గేస్తూంది







5
SAVAGE
SAVAGE
MADE IN INDIA
మచ్చిక చేసి మనసును లొంగదీస్తున్న
ప్రలోభాలను వదిలించుకొని, కళ్లెంవేసి దిగలాగుతున్న
భౌతిక బంధాలను తెగతెంచుకొని,
తన ఊహాప్రపంచంలోకి దౌడు తీయగోరే ప్రతీ వ్యక్తీ
పొందే ఒక సర్వస్వాతంత్ర్యానుభూతి – సావేజ్ అనుభూతి.
సావేజ్ – అఖిల ప్రపంచంలో
అద్వితీయమైన అంచు
అత్యున్నతమైన షేవింగ్ అనుభూతి.
Wiltech India Ltd.
విల్‌కిన్‌సన్ సోర్డ్ (యు కె.) వారి సాంకేతిక సహకారంతో తయారైనది
Rediffusion/WIL/1973 a TL

## ఆ రోజులు వేరు

ఐనా– ఆశమాత్రం చావడం లేదు. నేను పోల్చుకో లేకపోయినా– అవయినా నన్ను పోల్చుకుంటాయేమో? ఎంత మారినా– తల్లి బిడ్డను తేలిగ్గానే గుర్తు పడుతుందే.

జ్ఞాపకాలను నెమరవేసుకుంటూ... సైన్స్ కాలేజి అంతా కలియదిరిగాను వెర్రివాడిలా. ఆ గదుల గోడలని ఆత్రంగా నిమిరాను. లాబొరేటరీల గోడలకు తల ఆన్చి ఆ స్పర్శ అనుభవించాను. నన్ను పిచ్చివాడనుకున్నా సరే. నాకవి రాతి గోడల్లా కాక అమ్మ వడిలాగే అనిపిస్తున్నాయి.

తప్పిపోయిన పిల్లవాడు తల్లిని వెదుక్కునేటట్లు– నేను కూర్చుని చదువుకున్న లెక్చర్‌హాల్స్ కోసం వెదుక్కుంటున్నాను వెర్రిగా. విశ్వవిద్యాలయ ఆవరణలోని గాలి నన్ను ఉత్తేజపరుస్తోంది. సముద్రం మీంచి వొచ్చే ఆ చల్లని గాలి–నన్ను అమ్మలాగే చల్లగా తాకుతూంది. ఆ బిల్డింగులు...పరిసరాలు...నామట్టుకు నాకు యింట్లో తిరుగుతున్నట్లే ఉంది. చాలా పెద్ద భవనంలో – అమ్మ ఏ గదిలో ఉందో అని వెదుక్కుంటున్న పసివాడిని నేను. నాది మీకు వెర్రిలా అనిపిస్తే – ఎవరి వెర్రి వారి కానందం. అంతే.

ఒక లెక్చర్‌హాలు...స్టూడెంట్స్ కూర్చునే బల్ల మీద కూర్చున్నాను. నాకళ్లు ఆర్ద్రమయ్యాయి. వింత అనుభూతి హృదయాన్ని తొణికిసలాడించి వొదిలింది. అంతలో – తాళాలు వేసేందుకు వాచ్‌మన్ వొచ్చేశాడు.

నేనూ బయటకు వొచ్చేసి – మళ్ళీ తిరగడం మొదలుపెట్టాను. విద్యార్థులు విచ్చలవిడిగా తిరుగుతున్నారు ! ప్రొఫెసర్లు మచ్చుకయినా కనిపించడం లేదు. మునుపు యిలాగకాదు. వేళదాటాక విద్యార్థులు గదులు వొదిలి బయటకు రావడానికి జంకేవారు.

జ్ఞాపకాలతో మనసు బరువుగా ఉంది. హృదయం – అనుభూతులతో నిండిపోతూంది. ఎందుకో...కళ్ళల్లోకి నీళ్లు ఊరుతున్నాయి ఎంత తుడుచుకుంటున్నా. అలాగే అన్నీ చూసుకుంటూ... పరధ్యానంగా నడుస్తూ...

ఉలిక్కి పడ్డాను. చిలిపికెరటం నామీద నీరు జల్లిపోయింది. అరె ! నేను సముద్రపువొడ్డుకి వొచ్చేశానా ? ఏనాటి అలవాటు! అప్పుడూ యింతే. విశ్వం, నేనూ కబుర్లలోనో, చర్చలలోనోపడి – మాకు తెలియకుండానే సముద్రతీరానికి చేరుకునేవాళ్ళం. ఈ ప్రదేశంతో నాకున్న అనుబంధం ... ఆనాటి అనుబంధం ... ఎంత చిత్రంగా పునరావృతమైంది!

అమెరికా బీచ్‌లలోనూ ... నయాగరా జలపాతం దగ్గరా– నాకెప్పుడూ యిక్కడ లభించినంత హాయి లభించనేలేదు నిజంగా !

మళ్ళీ ... ఆ రోజులు ... జ్ఞాపకాలు ...

మనసు ఎక్కడో తేలిపోతూంది.

ఒక్కసారి ఉలిక్కి పడ్డాను. గిటార్ ధ్వని అటుచూశాను.

వెన్నెలలో ... వెన్నెలెప్పుడు వొచ్చేసింది చెప్పా పెట్టకుండా ?

వెన్నెలలో...చిన్నగుంపు. సంగీతమూ,నృత్యమూ. వాళ్లు దాదాపు దిగంబరంగా ఉన్నారు. పిచ్చిగా గెంతుతున్నారు. వెర్రిగా అరుస్తున్నారు. జాయింట్లు

పీలుస్తున్నారు. సీసాలు తాగుతూ ... నాట్యాలు చేస్తున్నారు. హిప్పీ క్యాంప్ !? వీళ్లు యూనివర్సిటీ స్టూడెంట్సుకారుకద ? ఉహుఁ ... కారేమో ... అహ ... ఔనేమో. వొద్దు ... కాకూడదు.

అక్కడ ఉండబుద్ధికాలేదిక. భయపడినవాడిలా త్వరత్వరగా పరుగులాగ నడవసాగాను, భరించలేని దృశ్యం తరుముకొస్తున్నట్లు.

హాస్టల్స్ !

చాలా గదుల తలుపులు మూసి ఉన్నాయి. ప్రతి బ్లాకులోనూ కొన్నిగదుల కిటికీలలోంచే దీపాలు కనపడుతున్నాయి.

గడియారం చూసుకున్నాను. ఎనిమిది దాటుతోంది. ఆ బ్లాకు ... దానిమీద ... అశోకవర్ధన... అక్షరాలు నన్ను నిలబెట్టేశాయి.

నెమ్మదిగా నడిచాను.

ఎందుకో నా కాళ్లు వొణుకుతున్నాయి.

రూమ్ నంబరు ఇరవైరెండు ... అప్పుడు — దీనిలో చంద్రమౌళి ఉండేవాడు. హఠాత్తుగా చచ్చిపోయాడు అపెండిసైటిస్ వొచ్చి — సకాలంలో ఆపరేషన్ జరగక. నా గుండె ఉద్వేగంతో వేగంగా కొట్టుకోసాగింది.

ఇరవైమూడు ... అడుగు పడడం అతికష్టమౌతూంది. శరీరం చెమటలు పోస్తూంది. హృదయం అత్యంత భారం ఐపోతూంది.

ఇరవైనాలుగు ... ఎలాగో చేరాను తలుపు దగ్గరికి. చేతులు వొణుకుతున్నాయి. అప్పుడు నేనుండే గది. వార్డెన్‌ని బ్రతిమాలుకుని— యీ గదిలోనే ఉన్నాను యూనివర్సిటీ చదువంతా అయ్యే వరకూ. ఇప్పుడీ గది ఎలా ఉందో ?

తలుపు తోసేదా ? ఎవరు నువ్వంటే ? సారీ చెప్పాలా ? లేక ... ఒకప్పుడు పదిహేనేళ్ల క్రిందట యీ గదిలో ఉండేవాడిని. ఆ మమకారంతో ... చూడ్డానికి వొచ్చేనని చెప్పేదా ? నవ్వుతారేమో — గదులతో మమతలేమిటని ?

ఎప్పుడు తలుపు తోశానో ? చటుక్కున తెరచుకుంది. ఎదురుగా కనిపించిన దృశ్యం...నన్ను నిర్విణ్ణుణ్ని, నిర్వీర్యుణ్నిచేసి వొదిలింది. నా గొంతు తడారిపోయింది. నిలువెల్లా వొణికిపోసాగాను. నాకేమిటో ఐపోతూంది. భరించలేకపోతున్నాను.

ఆ గదిలో ...

ఒక మూల నలుగురు పేకాడుకుంటున్నారు. మరోమూల ముగ్గురు కూర్చుని తాగుతున్నారు. నలుగురైదుగురు ఊరికే కూర్చున్నారు. ఆ గది గోడలనిండా అసభ్యకరమైన అర్ధనగ్న . సంపూర్ణ నగ్న చిత్రాలు... అక్కడక్కడ సినీతారల క్యాలెండర్లు. గదినిండా సిగరెట్ పొగ. వాళ్లు తమ కార్యక్రమంలో ఎంత నిమగ్నం ఐపోయారంటే— నేను తలుపు తెరిచిన సంగతే పట్టించుకోలేదు !

గదిలోకి అడుగు పెట్టబుద్ధి కాలేదు. ఎలాగో వెనక్కి వచ్చేశాను. ఏమిటిది ? వీళ్లు స్టూడెంట్లేనా ? వీరు నేర్చుకుంటున్న విద్య యిదేనా ? ప్రొఫెసర్లేంచెబుతున్నారు ? హాస్టల్ వార్డెనేంచేస్తున్నారు? హాస్టల్‌లోనే యింత విచ్చలవిడితనమా ?

ఇంటి వేపు నడుస్తున్నాను.

ఎవరో స్టూడెంట్లు— తన అభిమాన నటుడు గొప్పవాడంటే తన అభిమాన నటుడు గొప్పవాడని పోట్లాడుకుంటూ ... కొట్టుకోడానికి సిద్ధంగా ఉన్నారు !

జాలివేసింది వాళ్ల మీద.

మనసు వికలమైపోయింది. విశ్వం నాతో ఎందుకు రానన్నాడో తెలిసింది. ఇల్లు చేరుకున్నాను.

చన్నీళ్లతో తల స్నానం చేశాను. పరిస్థితి కొంచెం మెరుగైనట్లనిపించింది. సురేఖ భోజనానికి పిలిచింది. విశ్వమూ నేనూ కూర్చున్నాం, భోజనాలు పూర్తిచేసి. అతనడిగాడు. ''ఎలా అయింది నీ షికారు ?''

నేను మాట్లాడలేదు. ఓటమి నంగీకరించడం— చాలా కష్టం. మెల్లగా అన్నాను. ''సినిమాకి వెళ్దాం. తెలుగు సినిమాకి ...''

''అలాగే.''

''మీ శ్రీమతి ...''

''ఆమె రాదు. తెలుగు సినిమాలంటే తలనొప్పి ఆమెకు. టి. వి. చాలు.''

కాగల కార్యం గంధర్వులు తీర్చడమంటే యిదేనేమో. నేను కోరుకున్నది— విశ్వమూ నేనే వెళ్లాలని ఎందుకంటే...

చదువుకునే రోజుల్లో మా యిద్దరికీ సినిమాల పిచ్చి ఎక్కువగా ఉండేది. ఎంత బాగా చదివే వాళ్లమో అంత తరచుగా సినిమాలూ చూసేవాళ్లం. కాని... దొంగతనంగా చూడవలసివచ్చేది. ప్రొఫెసర్ల కంటపడితే రాంక్ దెబ్బతింటుందని భయం. సత్ప్రవర్తన లేనివారికి విద్యని ప్రసాదిస్తే అపాత్రదాన మౌతుందని వారి భయమేమో. అందుకే — ఎంత బాగా చదువుతున్నా వొదిగి వొదిగి ఉండే వాళ్లం. వార్డెన్‌కి తెలియకూడదని సెకండ్ షోలు చూసేవాళ్లం - అటూ యిటూ సుమారు ఐదారు మైళ్ల నడకకి సిద్ధపడి. అప్పుడు — చీకటి పడ్డాక సిటీబస్సు లుండేవికావు మరి. ఆ రోజుల్లో — సెకండ్ షోలకి రోడీలూ పనికిమాలినవాళ్లూ మాత్రమే వొస్తారనీ, పెద్దమనుషులూ ప్రొఫెసర్లూ... గౌరవనీయులూ రారనీ ప్రజాభిప్రాయం. ఐనా — ప్రొఫెసరెవరూ లేరని నిర్ధారణ చేసుకుంటే తప్ప హాలులోకి అడుగు పెట్టేవాళ్లం కాము. జీవితంలో ఎప్పుడయినా నిర్భయంగా సినిమా చూడగలమా అనిపించేది. ఆనాటి తీరని కోరిక తీర్చుకుందుకే విశ్వంని సినిమాకి బయలుదేరదీశాను

థియేటరు ముందు ఆగింది కారు. ఇద్దరమూ వెయిటింగ్ హాలులోకి నడిచాం. అమెరికన్ థియేటర్లతో పోల్చకపోతే — యిది చక్కగానే ఉంది. కాని... ప్రతి కౌంటరూ రష్‌గానే ఉంది... డ్రెస్ సర్కిల్స్‌తోసహా. విశ్వం ఆగి — కౌంటర్లవేపు చూడసాగాడు.

''జ్ఞాపకముందా? అప్పుడు మనం.. ప్రొఫెసరు లేకుండా చూసుకుని తప్ప సినిమాహాలులో అడుగు పెట్టేవాళ్లం కాము.'' నవ్వాను.

''ప్రొఫెసరంటే సింహస్వప్నమే.''

''ఔను కానీ...పద... మరో పిక్చర్‌కి పోదాం.''

''అదేం ?'' తెల్లబోయి చూశాను.

''ఈ సినిమాకి స్టూడెంట్లు వొచ్చారెక్కువగా.''

''ఐతే ? మనం... నువ్వు ప్రొఫెసర్‌వి కదా?'' ఆశ్చర్యంగా అడిగాను.

''అందుకే.'' అంటూ నన్ను కారు దగ్గరకి నడిపించసాగాడు.

''నాకేమీ అర్థం కావడంలేదు. స్పష్టంగా చెప్పు.'' అన్నాను కారులో కూర్చున్నాక.

''ఆ రోజులు వేరు. అప్పుడు స్టూడెంట్లు ప్రొఫెసర్లకి భయపడేవారు. కాలం మారిపోయింది. ఇప్పుడు—ప్రొఫెసర్లే స్టూడెంట్లకి భయపడాలి. అదీ రూలాఫ్ ద డే. అమెరికావాడివి, నీ కర్థం కాదులే.''

కారు పరుగెడుతూ ఉంది.

జ్ఞాపకాలను జ్ఞాపకాలుగా మిగుల్చుకుంటేనే అవి తీయగా ఉంటాయి. కాలగతి అనే గీటురాయి మీద స్మృతులను పరీక్షించబోతే — పరిణామాలిలాగే ఉంటాయేమో! ఎందుకంటే...కాలం మారుతూంది. నిరంతరం మారుతుంది. మార్పు—కాలం తీర్పు.

అమెరికా నుంచి ఆంధ్రదేశం రావడం — పొరపాటు చేశానేమో అనిపించిందొక్కసారి. ●








"మంచి ఆలోచనే! నీ సినిమా ఫ్లాప్ అయినా నీకు బాధ ఉండదు!"



# సినిమా

## "నిజం చెబితే నేరమా ?"లో నిలకడమీద నిజం

అన్నపూర్ణా ఇండస్ట్రీస్... ప్రత్యేక గదిలో కూర్చొనున్న మోహన్ (కృష్ణంరాజు)ను చూసి, డ్రైవర్ వెంకయ్య (రావి కొండలరావు) ఆశ్చర్యపోయాడు. మోహన్ కూడా ఆశ్చర్యంతో "హల్లో! నమస్కారం, మామగారూ! రండి – రండి," అంటూ పక్కనే ఉన్న బాలు (మాతన్‌ప్రసాద్) వంక తిరిగాడు. "ఇతను బాలూ. నా పార్టనర్... ఈయన వెంకయ్యగారు. నా కాబోయే మామగారు," అంటూ పరస్పరం పరిచయం చేశాడు.

"మరి మీ అమ్మాయి పెళ్ళి ముహూర్తం ఎప్పుడు పెట్టిస్తారు? మావాడు చాలా తొందర పడుతున్నాడు," అన్నాడు బాలు.

"అదేమిటి బాబూ! మీ దగ్గర్నుంచి కబురు ఎప్పుడొస్తుందా అని మేము ఎదురుచూస్తున్నాం," అన్నాడు డ్రయివర్.

"మేము రెడీ...లైన్ క్లియర్! ముహూర్తం పెట్టించేయండి," అన్నాడు బాలు.

డ్రైవర్ "మా అమ్మాయి అదృష్టవంతురాలు," అన్నాడు పరమానందంతో. హఠాత్తుగా కారు హారన్‌మోత వినిపించేసరికి ఉలిక్కిపడి, "అయ్య బాబోయ్! అసలు వచ్చిన పని మరిచేపోయాను. ఇక్కడ మోహన్ ఎవరండి ?" అన్నాడు.

"నేనే!" అన్నాడు మోహన్.

డ్రైవర్ విస్తుపోయాడు. "మీరేనా? మిమ్మల్ని మా అయ్యగారు పిలుస్తున్నారు. రండి."

బయట కారువద్ద నిలుచొనున్న రాజశేఖరం, (రావు గోపాలరావు) మోహన్‌ని చూడగానే చిరాకుతో "నేను మోహన్‌ని పిలవమంటే ఇతన్ని పిల్చుకొచ్చావేంటి?" అన్నాడు.

"ఈయనే మోహన్ అండి." అన్నాడు డ్రైవర్.

రాజశేఖరం కోపంగా మోహన్‌ని చూస్తూ, "వీడ్ని నేనెరుగననుకున్నావా? వీడు నీ కాబోయే అల్లుడు కదూ? నేను పిలవమన్నది ఈ కంపెనీ పార్టనర్ మోహన్‌ని," అన్నాడు.

మోహన్ ఒక్కడుగు ముందుకు వేశాడు. "ఈ కంపెనీ పార్టనర్ మోహన్‌ని నేనే."

"మా డ్రైవర్ కూతుర్ని చేసుకోబోతున్నానని చెప్పావుకదూ ?"

"అవును. చెప్పాను. చే సు కుం టా ను," నిర్లక్ష్యంగా అన్నాడు మోహన్.

"ఆఁ! అమ్మ దొంగ గాడిదా !"

మోహన్ తీక్షణంగా చూశాడు. "ఏయ్, ఓల్డ్‌మాన్. మాటలు జాగ్రత్తగా రానియ్ !"

"యు ఆర్ ఎ చీట్. మోసగాడివి. నా మనుమరాల్ని మోసం చేశావు."

"నీ మనమరాల్నా! ఎవతో అది. దాని ముఖమే నాకు తెలీదు."

"తెలీదా? కారు ఎక్కు. మా ఇంటికి వెళ్దాం."

"బోడి నీ కారెక్కేదేమిటి ? నాకూ ఉంది."

రాజశేఖరం ఆవేశంతో డ్రయివర్ వంక తిరిగి, "సరే, వెంకయ్యా పద !" అన్నాడు

అందరూ బయలుదేరారు

ఎం. బాలయ్య కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తూ సమర్పించే అమృతా ఫిలివ్స్ "నిజం చెబితే నేరమా ?" చిత్రానికి అలపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు నిర్మాతలు



'నిజం చెబితే నేరమా'లో

కృష్ణంరాజు, జయమాలిని

# విశేషాలు



-జి. వి. జి.

## "ప్రళయ గర్జన"లో పరశురాంకు ప్రమాదం

ఒక చేత్తో రక్తస్రావాన్ని ఆపుకుంటూ, తరుముకొస్తున్న రౌడీలనుంచి అవలీలగా తప్పించుకొని, ఒక ఇరుకు సందులోని ఓ చిన్న ఇంటి గుమ్మం ముందు కుప్పలా కూలిపోయాడు పరశురాం (మోహన్‌బాబు). ఆ ఇంట్లోంచి బయటకొచ్చిన తులసమ్మ(పండరీబాయి)గాయాలతో స్పృహ తప్పి పడున్న పరశురాంను అతి ప్రయాసతో ఇంట్లోకి చేరవేసి, వీధి తలుపు మూసింది. అతని గాయాలకు కట్లు కట్టి, ఉగ్గుగిన్నెతో అతనినోట్లో కొద్దికొద్దిగా పాలు పోయసాగింది. కిటికీలోంచి సూర్యకిరణాలు అమృతవర్షంలా అతనిమీద ప్రసరించాయి. మెల్లగా కళ్ళు విప్పాడు. అతని ఎదుట మాతృమూర్తి సాక్షాత్కరించినట్లయింది. అప్రయత్నంగా అతని రెండు చేతులూ నమస్కరించడానికి ప్రయత్నించాయి. "అమ్మా! మీరెవరు? నేనెక్కడున్నాను ?"

అతని చేతులు పట్టుకొని, "క్షేమంగా ఉన్నావు. మీ అమ్మ దగ్గరే ఉన్నాననుకో ... నువ్వెవరు, బాబూ ? ఏమైంది – చెప్పు," అంది తులసమ్మ.

"నేనొక దురదృష్టవంతుణ్ని," అంటూ పరశురాం తన జాలిగాథ వివిపించాడు.

తులసమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి. "ఈ లోకంలో దురదృష్టవంతురాల్ని నేనొక్కదాన్నే అనుకున్నాను, నీ కథ వింటూంటే—నీ బాధముందు నాదొక లెక్కలోనిది కాదనిపిస్తోంది. నీలో పగ రగిలితే, నాలో మమకారం చావనంటున్నది."

"అంటే – మీకెవ్వరూ ... "

"ఒకే ఒకరున్నారు. ఆయన నన్ను కట్టుకున్న కొద్దిరోజులకే నిర్దాక్షిణ్యంగా వదిలేశారు. కాని, మాంగల్యంమీద మమతను వదులుకోలేక నిరంతరం ఆయన రాక కోసం ఎదురుచూస్తూ, కడిమిచెట్టులా ఒంటరిగా బ్రతుకుతున్నానయ్యా."

"బాధ పడకమ్మా! మీ వారెక్కడున్నారో చెప్పు. ఎక్కడున్నా ఆయన కాళ్ళమీదపడి, బతిమలాడి తీసుకొచ్చి మీ కప్పగిస్తాను."

"అదంత తేలిక కాదు, బాబూ! ... కాస్సేపు విశ్రాంతి తీసుకో. కాస్త జావకాచి తీసుకొస్తాను," అంటూ తులసమ్మ వంటగదికేసి వెళ్లింది.

పరశురాం ఆలోచిస్తూండిపోయాడు.

పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో ఎన్. వి. సుబ్బరాజు సమర్పించే శ్రీనాగేంద్రా కంబైన్స్ "ప్రళయ గర్జన" చిత్రంలో కవిత, గీత, స్వప్న, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, సుధాకర్, సారథి, విజయలలిత, అనురాధ, కె. జానకి, భీమరాజు, జీవా, సి.హెచ్. కృష్ణమూర్తి, నర్రా వెంకటేశ్వరరావు, జయదేవ్ పాత్రధారులు. కలిదిండి విశ్వనాథరాజు, రుద్రరాజు వెంకట్రామరాజు నిర్మాతలు.



'ఊరంతా సంక్రాంతి'లో ఒక దృశ్యం







'ధర్మపోరాటం'లో జయసుధ, మోహన్‌బాబు.

# సినిమా

## "పిడుగులాంటి మనిషి"

శివాజీగణేశన్, కె. ఆర్. విజయ, గీత, పుష్పలత ముఖ్యపాత్రలు ధరించిన జననీ ఆర్ట్స్ ఇంటర్నేషనల్‌వారి పై చిత్రం షూటింగ్ జపాన్, సింగపూర్, మలేసియా, హాంకాంగ్, బాంకాక్‌లో జరిగిందని సమర్పకులు జి. మంగారత్నం తెలిపారు. శ్రీచందర్ మాటలు, ఆరుద్ర పాటలు, కోమలబాబు నిర్మాణత, ఎం. ఎస్. విశ్వనాధం సంగీతం, విశ్వనాధరాయ్ ఛాయ, ఎం. ఎ. తిరుముగం దర్శకత్వంలో చామర్తి శకుంతల నిర్మాత.

## వేజెళ్ళ దర్శకత్వంలో చిత్రాలు

"ఇదికాదు ముగింపు" జనవరి 26 న విడుదలవుతుంది. ఫిబ్రవరిలో "అరణ్య రోదన", ఏప్రిల్‌లో "ఇదిగో ప్రశ్న ఏదీ జవాబు", జూలైలో "కాయ్ రాజా కాయ్", సెప్టెంబర్‌లో "ఈ పిల్లకు పెళ్ళవుతుందా ?" చిత్రాలు మొదలవుతాయి. "ఈ దేశంలో ఒక రోజు" చిత్రం షూటింగ్ డిసెంబర్ 13 న ముగిసింది. ఈ చిత్ర నిర్మాత యు. సూర్యనారాయణ బాబు త్వరలో వేజెళ్ళ దర్శకత్వంలో ప్రారంభించే "కూలి" చిత్రంలో శివకృష్ణ ప్రధాన పాత్రధారి.



'రఘురాముడు'లో శోభన్‌బాబు

మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

సబ్బు- ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్.
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్.

Imageads-M-1564





జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

## సినిమా



'ప్రేమ పిచ్చోళ్లు'లో రాధిక

### "అమాయక చక్రవర్తి"లో ముగ్గురు మందు భాయీలు!

ముగ్గురు సత్తిరాజులూ (నూతన్ ప్రసాద్, కాశీ విశ్వనాథ్, రాళ్ళపల్లి) కల్లు తాగుతున్నారు. పాండు (బొవా) హడావుడిగా వస్తూ, "రేయ్, సత్తిరాజులూ! ఓరి మీయమ్మ కడుపుమ్మడా! దేశంలో మరే పేర్లూ లేనట్లే— మీ బాబు మీ ముగ్గురికీ ఒకే పేరు పెట్టడం కాదు గాని " అంటూ ఆయాసంతో ఆగాడు

నూతన్ మా బాబు మాకీ పేర్లు పుత్తివే పెట్టలేదండి మా బాప్పేరదే మా తాత పేరదే. మా ముత్తాత పేరదే!

పాండు అంటే ఈ నట్టులూజా వ్యవహారం మీతోనేకాదు, మీ తాత ముత్తాతల దగ్గర్నుంచీ వస్తోందన్న మాట?

ఇంతలో లక్ష్మి (జయమాలిని) వస్తూ, "మా అన్నదమ్ములు ముగ్గురూ పంచపాండవుల్లాగ కలిసి మెలిసి వుండాలని ఈ పేర్లు పెట్టాడండి మా అయ్య," అంది

పాండు పంచపాండవులంటే ముగ్గురు కాదే, ఎర్రిమొగమా! అయిదుగురు. రేపు నీ మొగుడి క్కూడా ఈ పేరే పెట్టుకుంటే?

రాళ్ళ ఛా! దాని మొగుడికి ఈ పేరెలా వస్తదండి. మా సెలకందుది మారాణీ జాతకమండీ. అది ఎప్పటికయినా మారాణీ అయిపోద్ది.

విశ్వ గేరెంట్రీ మీద గేరెంట్రూ! ఎప్పటికైనా మా సెలకందు ఓ మారాజుకి మొగుడై పోద్ది.. అంతే

లక్ష్మి మొగుడు కాదన్నా పెళ్ళాన్నవుతాను

పాండు బాగుందిరా! ఇలాగే గెంతుతూ ఉండండి. అవతల దొరగారొచ్చారు. మిమ్మల్ని రమ్మంటున్నారు వారొచ్చేటప్పటికి మీరీ దుకాణం పెట్టేశారు

నూతన్ అయ్యబాబోయ్! మా దుకాణం సంగతి అయ్యగారికి చెప్పబాకండి

పాండు సర్లే తొందరగా వొళ్ళుకడుక్కుని తగలడండి

రాళ్ళ కడిగేసుకుంటాం (అంటూ కల్లులో నోరు పుక్కిలించి, ఉమ్మేయడానికి ప్రాణమొప్పక అలాగే మింగేశాడు)

చంద్రమోహన్ హీరోగా విజయబాపినీడు నేతృత్వంలో తయారయ్యే లలిత చిత్ర వారి "అమాయకపు చక్రవర్తి" చిత్రానికి జనార్దన్ దర్శకుడు నవకాంత్ ఛాయాగ్రాహకుడు మ్యూజిక్ రెఫరెన్స్ విజయభాస్కర్ నిర్మాత మాగంటి రవీంద్రనాథచౌదరి సమర్పణ శివశంకర్

### "తొలిరేయి ముచ్చట్లు"

"డిసెంబర్ 18 నుండి జనవరి 10 వరకు ఒకే షెడ్యూల్లో నరసాపురం ప్రాంతాల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ప్రమీలమూవీస్ అనే నూతన సంస్థ నిర్మించే పై చిత్రానికి తొలిసారిగా కథ సమకూర్చి, దర్శకత్వం వహించే లక్ష్మి శ్రీనివాస్ ఈయన పి సాంబశివరావు, సి ఎస్. రావు, లక్ష్మీ దీపక్‌ల వద్ద పలుచిత్రాలకు సహకార దర్శకుడుగా అనుభవం గడించారు చంద్రమోహన్, జె వి సోమయాజులు, అల్లు రామలింగయ్య, రాజేష్, పూర్ణిమ, జయంతి, తులసి, సితార నటించే ఈ చిత్రానికి డిసెంబర్ 4 న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది సి ఎస్ రంగస్వామి మాటలు, కె వి మహదేవన్ సంగీతం, కె ఎస్ ప్రకాష్ ఛాయ, డి వెంకటరత్నం కూర్పు, వీరాస్వామి నిర్వహణతో ప్రమీలాగౌడ్, దుక్కారెడ్డి నిర్మాతలు

'ముద్దుల మొగుడు'లో సుహాసిని



## రంజిత్‌కుమార్ చిత్రాలు

★ "నేను నిర్మించిన మలయాళ చిత్రం జనవరిలో విడుదలవుతుంది. కేరళ రాష్ట్రంలోని మధ్య తరగతి కుటుంబాలు ఎదుర్కొనే సమస్యలకు అద్దం పట్టి చూపే ఈ చిత్రంలో పూర్ణిమా జయరాం, బాలన్ కె. నాయర్, నడమూడి వేణు, మోహన్‌లాల్, శ్రీనాథ్, కవియూర్ పొన్నమ్మ పాల్గొన్నారు," అన్నారు 'రంజిత్ ఆర్ట్స్' అధినేత రంజిత్‌కుమార్ ఈయన విజయనిర్మల దర్శకత్వంలో నిర్మించే "చట్టానికి వేయికళ్ళు" చిత్రం షూటింగ్ పూర్తయింది. కృష్ణ, జయసుధ, మాధవి, రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, సత్యనారాయణ, గిరిబాబు, జ్యోతిలక్ష్మి, కాంతారావు, రాజనాల పాల్గొన్నారు. జనవరిలో డబ్బింగ్, రీరికార్డింగ్‌లు పూర్తి చేసుకొని, ఫిబ్రవరిలో విడుదలవుతుంది. మాటలను పరుచూరి సోదరులు, మోదుకూరి జాన్సన్ రాశారు. వేటూరి, ఆత్రేయ,గోపి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు. ఆదుర్తి హరనాథ్ సంకలనకర్త.

★ ఊటీలో రెండు పాటలు చిత్రీకరింపబడిన రంజిత్ క్రియేషన్స్ "లంకె బిందెలు" చిత్రం షూటింగ్ డిసెంబర్ 18న మద్రాసులో ప్రారంభమైంది. జనవరికి పూర్తవుతుంది. విజయనిర్మల స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్న ఈ చిత్రంలో కృష్ణ, జయసుధ, సత్యనారాయణ. రావుగోపాలరావు, గుమ్మడి, గిరిబాబు, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, నిర్మల పాల్గొంటున్నారు. డి. వి. నరసరాజు సంభాషణలకర్త. ఆత్రేయ, వేటూరి, గోపి గీతాలకు రాజన్ నాగేంద్ర బాణీలు కూర్చారు. లక్ష్మణ్ గోరే ఛాయ, తోట తరణి శిల్పంతో ఎం. బాలకృష్ణ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.



'బెజవాడ బెబ్బులి'లో కృష్ణ

'ఇదికాదు ముగింపు'లో జ్యోతి



## తక్కువ బడ్జెట్‌లో
## డి. రామానాయుడు నిర్మించే చిత్రం

19 కేంద్రాలలో వంద రోజులు పూర్తి చేసుకున్న "దేవత" చిత్రం శతదినోత్సవం ఇటీవల మద్రాసు తాజ్ కోరమాండల్ హోటల్లో జరిగింది. అంతకు ముందురోజు నిర్మాత డి. రామానాయుడి జ్యేష్ఠ పుత్రుడు చి॥ సురేష్‌బాబుకు, తణుకు వాస్తవ్యులు శ్రీ యలమర్తి నారాయణరావు ఏకైక పుత్రిక చి॥ సౌ॥ లక్ష్మితో వైభవోపేతంగా వివాహ మహోత్సవం జరిగింది. "మోహన్‌బాబు హీరోగా వచ్చే మార్చి, ఏప్రిల్ నెలల్లో తయారయ్యే చిత్రానికి బోయిన సుబ్బారావు దర్శకుడు. అదే సమయంలోనే కొత్త నటీనటులతో ఒక తక్కువ బడ్జెట్ చిత్రాన్ని ప్రముఖ తమిళ డైరెక్టర్ మహేంద్రన్ దర్శకత్వంలో ప్లాన్ చేశాను. ఈ చిత్రానికి ఇళయరాజా సంగీత దర్శకుడు," అని సురేష్ అధినేత డి. రామానాయుడు తెలియజేశారు. ప్రస్తుతం ఈయన ఇద్దరు హీరోలతో "ముందడుగు" చిత్రాన్ని నిర్మిస్తున్న విషయం వాచకులకు విదితమే.

## చలం చిత్రం

తిరుపతి, పరిసర గ్రామాలైన తొండవాడ, కోదండరామపురం, చంద్రగిరి, కల్యాణి ఆనకట్ట ప్రాంతాల్లో డిసెంబర్ 9 నుంచి జనవరి 6 వరకు నిర్విరామంగా షూటింగ్ ముగించుకు వచ్చాం !" అన్నారు చలం. ఈయన సమర్పించే శ్రీ రమణ చిత్ర కంబైన్స్ తాజా చిత్రంలో ఈయనతో పాటు చంద్రమోహన్, విజయశాంతి, సత్యనారాయణ, అల్లురామలింగయ్య, రాజేంద్రప్రసాద్, జానకి, రమాప్రభ పాత్రధారులు. రాజశ్రీ మాటలు, పాటలు రాసి సంగీతం సమకూరుస్తున్నారు. రంగ ఛాయ, సోమనాథ్ శిల్పం, రవి కూర్పులతో ఎం. ఎ. రెడ్డి, బాబూరావు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. ఎస్. ఎ. పెండ్యాల దర్శకత్వం వహించే ఈ సంపూర్ణ హాస్య చిత్రానికి తమిళంలో శతదినోత్సవం జరుపుకున్న "మణల్ కైర్" అనే బాలచందర్ సృష్టి ఆధారం.



ప్రముఖ నిర్మాత శ్రీ డి. రామానాయుడు కుమారుడు డి. సురేష్‌బాబుకి, తణుకు వాస్తవ్యులు శ్రీ నారాయణ చౌదరిగారి కుమార్తె చి. సౌ. లక్ష్మితో డిసెంబరు 17న మదరాసులో వైభవంగా వివాహం జరిగింది.

# సినిమా

## కె. బాలచందర్ దర్శకత్వంలో సంచలన రాజకీయ వ్యంగ్య చిత్రం

తమిళనాడులో సంచలనం రేకెత్తించిన "తణ్ణీర్ తణ్ణీర్" అనే కె. బాలచందర్ రూపొందించిన రాజకీయ వ్యంగ్య చిత్రాన్ని కళాకేంద్ర మూవీస్ సంస్థ తెలుగులో అనువదించింది. నీటి ఎద్దడి ప్రధానాంశంగా గల ఈ చిత్రానికి కేంద్ర ప్రభుత్వం ఉత్తమ చిత్రంగా ఎన్నుకొని ఉత్తమ స్క్రీన్‌ప్లేకి కూడా బహుమతి ఇచ్చింది. ఇంకా ఫిలిమ్‌ఫాన్స్, ఫిలిమ్‌ఫేర్, సినిమా ఎక్స్‌ప్రెస్‌ల అవార్డులు కూడా లభించాయి. సోవియెట్ చలన చిత్రోత్సవానికి ఈ చిత్రం పంపబడడం మరో విశేషం. సరిత ప్రధాన పాత్రను నిర్వహించింది గణేష్‌పాత్రో మాటలు, ఆత్రేయ గీతాలు, ఎం. ఎస్ విశ్వనాథం సంగీతం, లోక్‌నాథ్ ఛాయ, కె. సత్యం కూర్పుగల ఈ చిత్రం డిసెంబర్ నెలాఖరులోగా విడుదల అవుతుంది.

# విదేశ చిత్ర విశేషాలు

★ హాలివుడ్ నటుడు బర్ట్ రోనాల్డ్స్, లోని అనే నటిని ప్రేమించాడు; పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు కూడా. ఐతే, ఈ విషయాన్ని పరమ రహస్యంగా ఉంచాలనుకున్నాడు. అందుకే తన ప్రేయసితో ఏ ఫొటోగ్రాఫర్‌కూ పోజు ఇవ్వలేదు. కాని, ఎలాగైనా వాళ్ళిద్దరూ ఉన్న ఫొటోను ప్రచురించి, సంచలనం సృష్టించాలనుకుంది ఓ సినిమా పత్రిక. అలాంటి ఫొటోను తీసి పంపిస్తే, లక్ష డాలర్లు బహుమతిగా ఇస్తానని ప్రకటించింది కూడా. ఆ ప్రకటనను ఆ నటుడు చూశాడు. వెంటనే ఆ పత్రికకు ఫోన్ చేసి, "మీరు కోరిన విధంగా నా ప్రేయసితో నా ఫొటోను నేనే తీయించి పంపిస్తాను. ఐతే, ఒక షరతు. ముందుగా మీరు ఏదైనా శిశువుల ఆస్పత్రికి రెండు లక్షల డాలర్లు విరాళమిచ్చి, ఆ రశీదును నాకు పంపించాలి." అన్నాడు. ఆ పత్రిక వెంటనే ఆ ఏర్పాట్లు చేసింది. చివరికి ఆ ప్రేయసీప్రియుల ఫొటోను ప్రచురించి, సంచలనం సృష్టించగల్గింది.

★ "సూపర్‌మన్–3" రాబోతోంది. అందులోని ప్రధాన పాత్రధారి క్రిస్టఫర్‌కు పారితోషికం 2 మిలియన్ల డాలర్లు. ఇంత ఐశ్వర్యం, కీర్తి లభించినా – ఆ నటునికి సంతోషం లేదు. అతను లోగడ నిర్మించిన "సమ్‌వేర్ ఇన్ టైమ్" అనే ప్రణయగాథా చిత్రం ఫ్లాప్ అయిందన్న బాధ అతన్ని సతతం పీడిస్తోంది.

★ పూర్తిగా బ్రిటన్‌లో తయారైన "ఏక్ బార్ ఫిర్" అనే హిందీ చిత్రం మన దేశంలో హిట్ అయింది. ఈ చిత్రాన్ని ఇప్పుడు ఒక నిర్మాత కెనడా, బ్రిటన్, అమెరికాలో తయారు చేస్తున్నాడు. పేరు "క్రికటీర్". ఒక క్రికెట్ క్రీడాకారుని గురించిన చిత్రం. దీప్తినావల్ నాయిక. కపిల్‌దేవ్ గెస్ట్ ఆర్టిస్టుగా నటిస్తున్నాడు.

★ సుప్రసిద్ధ హాలివుడ్ నటి షిర్లే మెక్లైన్‌కు పూర్వజన్మ స్మృతి మీద నమ్మకముంది. కొన్ని పరిశోధనలు కొనసాగించిందట కూడా. తాను పూర్వజన్మలో ఓ పడుపువృత్తి నడిపే కంపెనీ యజమానురాలుగా ఉండేదని కనుగొనగల్గిందట. "నా గురించి ఇలా తెలుసుకునేకొద్దీ ఇంకా తరచి చూడాలనే కుతూహలం నాలో పెరుగుతోంది," అని ఓ పాత్రికేయునికి తెలియజేసిందామె.

★ ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ చిత్రం "ఫ్రెంజీ"లో అద్భుతంగా నటించిన వివైన్ మర్చంట్ అనే నటీమణి విపరీతంగా మద్యం సేవించినందున ఇటీవల మరణించింది. వయసు 53.

★ ప్రిన్స్ ఛార్లెస్ తమ్ముడు ప్రిన్స్ ఆండ్రూ (వయసు 22) "ఎమిలీ" చిత్రంలో కాస్సేపు నగ్నంగా కనిపించి సంచలనం కలిగించిన కూ స్టార్క్ (వయసు 25) మోజులో పడడం తల్లి ఎలిజబెత్ మహారాణి–2 కి కోపం తెప్పించింది. ప్రేయసీ ప్రియులిద్దరూ దంపతుల్లా విమానంలో విహారయాత్రకు బయలుదేరారట కూడా.



'రెండుజెళ్ళ సీత'లో మహాలక్ష్మి

### ఆలయ శిఖరం

"జనవరి అయిదు కల్లా షూటింగ్ పూర్తి చేయాలని నిర్విరామంగా కృషి చేస్తున్నాం," అన్నారు నిర్మాత జగదీశ్‌చంద్రప్రసాద్. శ్రీ లలితామూవీస్ "ఆలయ శిఖరం" చిత్రం షూటింగ్ డిసెంబర్ 5న తిరుపతి దగ్గర మొదలైంది. చిరంజీవి, సుమలత, అరుణ, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు పాత్రధారులు. గొల్లపూడి సంభాషణలు, సత్యం సంగీతం, కె. ఎల్. ధర్ శిల్పం, బాలు కూర్పుతో కోడి రామకృష్ణ దర్శకుడు. ★

# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్




**అబ్రహాం వాన్‌హెల్సింగ్, ఎం.డి., డి.ఫి. డి.లిట్ .... (మొదలైనవి) డాక్టర్ సెవార్డుకు రాసిన ఉత్తరం**

సెప్టెంబర్, 2 :

నా మంచి మిత్రుడికి,

నీ ఉత్తరం అందగానే, బయలుదేరడానికి సిద్ధంగా వున్నాను. అదృష్టవశాత్తు, వెంటనే బయలుదేరగలుగుతున్నాను. నా మీద నమ్మకం వున్న వాళ్లని, ఇబ్బంది పెట్టను. తనకు బాగా కావలసిన వాళ్లకోసం నా మిత్రుడు నన్ను రమ్మంటే, బయలుదేరకుండా వుంటానా? నాకు కత్తిదెబ్బ తగిలినప్పుడు, గాయం విష పూరితం కాకుండా, వెంటనే దానిని నోటితో పీల్చిపారేసావు. అట్లాంటి స్నేహితుడివి ఇప్పుడు నువు పిలిస్తే రానా? నీ స్నేహితుడికి సహాయం చేయడానికి వస్తున్నా, ముఖ్యంగా నీ కోసం వస్తున్నాను. గ్రేట్ ఈస్టరన్ హోటల్లో గదులు తీసుకునివుంచు. అది అయితే దగ్గరగా వుంటుంది. నువ్వు చెప్పిన అమ్మాయిని, ఆలస్యం లేకుండా రేపే పరీక్షించవచ్చు. మళ్ళీ అదే రాత్రికి నేను వెనక్కి తిరిగి వచ్చే అవసరం వుండొచ్చు. మళ్ళీ అవసరమయితే మరో మూడురోజులు ఆగి వస్తాను. వీలయితే ఎక్కువ రోజులుంటాను. జాన్, అప్పటివరకు శెలవుమరి.

"వాన్‌హెల్సింగ్"

(గత సంచిక తరువాయి)

**డాక్టర్ సెవార్డు ఆర్థర్ హోల్మ్‌వుడ్‌కి రాసిన ఉత్తరం**

సెప్టెంబర్, 3 :

నా ప్రియమైన ఆర్ట్,

వాన్‌హెల్సింగ్ వచ్చి వెళ్లాడు. మొదట అతను నాతోపాటు హిల్లింగ్‌హామ్ వచ్చాడు. లూసీ వాళ్లమ్మ వంటగదిలో వుంది. మేం ముగ్గురం మిగిలాం. వాన్‌హెల్సింగ్ ఆమెను నిశితంగా పరీక్షించాడు. పరీక్ష చేస్తున్నప్పుడు నేను వాళ్ల దగ్గరలేను. పరీక్ష సారాంశం అతను నాకు వ్రాస్తే, అది నీకు తెలియజేస్తాను. అతను ఆమె గురించి చాలా శ్రద్ధ తీసుకుంటున్నాడు. ఆమె కేసు బాగా పరిశీలించాలి అన్నాడు. మన మధ్య వున్న స్నేహం, పైగా నువ్వు నన్ను ఎంతగా నమ్ముతావో, దాని గురించి చెప్పాను. దానికతడు, "నువ్వు ఏమి అనుకుంటున్నావో అది నీ మిత్రుడికి తెలియజేయి. నేను ఏమి అనుకుంటున్నావో కూడా, నీకు తెలిస్తే, వ్రాయి. నేను హాస్యం కోసం అనడంలేదు. ఇది తమాషా అయిన విషయం కూడా కాదు. చావు బ్రతుకుల సమస్య. ఇంకా అంతకంటే మించింది కూడా, అన్నాడు. అతను అంత గంభీరంగా అనేసరికి, విషయం ఏమిటని అడిగాను. ఇది మళ్ళా మేం టౌన్‌కి తిరిగొచ్చినప్పుడు జరిగింది. అతను మళ్ళా ఆంస్టర్‌డామ్‌కు తిరిగి వెళ్లేముందు టీ తాగుతూ అట్లా అన్నాడు. నువు కోపం తెచ్చుకోకు ఆర్ట్. అతనంత గంభీరంగా, మౌనంగా వున్నాడంటే, అతని బుర్రంతా ఆమె మంచికోసం ఆలోచిస్తోందన్నమాట. సమయం వచ్చినపుడు అతను వున్నది వున్నట్టు చెపుతాడు, నమ్ము. అతను ఏమీ చెప్పలేదుకాబట్టి, ఈ విషయం గురించి, అతని రాక గురించి, 'ది డైలీ గ్రాఫిక్' పత్రిక్కి ఒక వ్యాసం రాసినట్టు నీకు రాస్తానని అతనితో చెప్పాను. అతనంతగా వినిపించుకున్నట్టు లేదు. తను విద్యార్థిగా ఇక్కడ లండన్‌లో చదువుకునే రోజుల్లో వున్న మురికి ప్రాంతాలు ఇప్పుడు కాస్త నయం అన్నాడు. రేపు అతని దగ్గర్నుంచి లూసి గురించి రిపోర్టు రావాలి లేకపోతే ఉత్తరమైనా రాస్తాడు.

ఇకపోతే లూసీ విషయం. నేను మొదటిరోజున ఆమెను చూసినదానికన్నా, ఆ రోజు కళగానే వుంది కాస్త కులాసాగానే కనిపించింది. నిన్ను ఆందోళన పరిచినంతగా ఆమె ఇప్పుడు లేదు. వూపిరి తీసుకోవడం మామూలుగానే వుంది. మా ప్రొఫెసర్‌తో చక్కగానే వుంది. (ఆమె ఎప్పుడూ వుండేవిధంగానే) ఆమెకు ఒంట్లో ఏం లేనట్టు అతను అనుకోవాలి అన్నట్టుగా ప్రవర్తించింది. పాపం, దానికోసం ఆమె పడుతున్న అవస్థనంతా నేను గమనిస్తూనే వున్నాను. వాన్ హెల్సింగ్ కూడా ఆ విషయం గ్రహించివుంటాడని నా నమ్మకం. ఎందుకంటే, అతని ఒత్తయిన కనుబొమల చూపు అర్థం నాకు తెలుసు. అతను ఏవేవో కబుర్లు చెప్పడం మొదలెట్టాడు, మన గురించి జబ్బు గురించి ప్రసక్తి లేకుండా. ఆ సమయంలో నటనపోయి, నిజంగానే ఆమె కులాసాగా వుండటం గమనించాను. సంభాషణలో మార్పు తెచ్చినట్టు ఆమెకు తెలియకుండానే తన రాక గురించి చక్కగా చెప్పాడు ఇలా :

"మై డియర్ మిస్. నువు ఎందరికో ప్రేమ పాత్రురాల వయినందుకు నాకు సంతోషంగా వుంది. నీలో నాకు ఎటువంటి లోపం కనిపించడం లేదు. నువు ఉత్సాహంగా లేవనీ, బాగా పాలిపోతున్నావని వీళ్ళంతా చెప్పారు. చాలుచాల్లే అంటాను వీళ్లతో. వాళ్ళు అనుకునేదంతా తప్పు అని నువ్వూ నేను వాళ్లకి తెలియజేయాలి. మరి ఇతనికి"— వేలితో నన్ను చూపిస్తూ అన్నాడు, "ఆడవాళ్ల గురించి ఏమైనా తెలుసా? ఎవరో ప్రౌఢలు ఇతని దగ్గరి కొస్తారు. వాళ్లకు నయంచేసి సంతోషం కలుగజేస్తాడు. కానీ యువతుల విషయం! ఇతనికి పెళ్ళాంలేదు. కూతురూ లేదు. వయసులో వున్నవాళ్ళు, వయసులో వున్న వాళ్ళతో సరిగా చెప్ప

**జరిగిన కథ—11 :** మిస్ మీనామ్రే, మిస్ లూసీ ఒకరికొకరు తమ తమ విషయాలను ఉత్తరాల ద్వారా తెలియపర్చుకొంటారు. క్విన్సీ పి. మోరిస్‌కు ఆర్థర్ హోల్మ్‌వుడ్ తన దగ్గర వళ్లు జలదరించే కబుర్లు వున్నాయని, తనకోసం ఎదురుచూడమని టెలిగ్రాం ఇస్తాడు. మిస్ మీనా తన డైరీలో, జోనాథన్ దగ్గరనుంచి ఎటువంటి సమాచారం అందకపోవడంతో దిగులుచెందుతున్నట్లు రాసుకొంటుంది. 'ది డైలీ టెలిగ్రాఫ్' పత్రిక నుండి కత్తిరించి, మీనామ్రే డైరీలో అంటించిన ముక్కలలోని సారాంశం వివరిస్తున్నారు. తుఫాను తాకిడికి ఒడ్డుకు కొట్టుకొచ్చిన ఓడలోని శవం జేబులో వున్న కాగితంలోని విషయాలనుబట్టి, అతను పుస్తకంలో రాసినదాన్నిబట్టి కొంత సమాచారం బయట పడుతుంది. ఆ ఓడలో మొత్తం తొమ్మిదిమంది ప్రయాణం చేస్తుంటారు కెప్టెన్‌తోసహా. దారిలో ఒక్కొక్కళ్లు మాయమవుతూ వుంటారు. చివరికి కెప్టెన్, మరో ముగ్గురు మిగుల్తారు. అందరితోపాటు చివరకు అతనుకూడా చనిపోతాడు. కానీ ఇదంతా ఎవరు చేశారో, లేక కెప్టెనే చంపేసి తాను ఆత్మహత్య చేసుకొన్నాడో తెలియదు. మీనా లూసీని జాగ్రత్తగా కాపాడుతుంటుంది. జోనాథన్ హార్కర్ సెయింట్ జోసెఫ్, సెయింట్ మేరీ హాస్పటల్‌లో కోలుకుంటున్నాడని సిస్టర్ అగథా ఉత్తరం ద్వారా తెలుసుకొన్న మీనా మనసు కొంతవరకు కుదుట పడుతుంది. జోనాథన్, మీనా వివాహం చేసుకొంటారు. లూసీ ఆరోగ్యం గురించి జాన్ సెవార్డు ఆర్థర్ హోల్మ్‌వుడ్‌కి తెలియజేస్తుంటాడు.

లేరు. బాధలు, వాటికి కారణాలు తెలిసిన నాలాంటి ముసలివాడికి చెప్తారు. ఇతన్ని తోటలో సిగరెట్ కాల్చుకోడానికి పంపేసి, మనం ఒంటరిగా మాట్లాడుకుందాం.'' అన్నాడు. అతని సూచన అర్థమయింది. నేను బయటకెళ్లి పచార్లు చేస్తూ వుండిపోయాను. తర్వాత అతను కిటికీ దగ్గరగావచ్చి బయటకు చూసి నన్ను పిల్చాడు. అతను చాలా గంభీరంగా కనిపించాడు. ''ఆమెను జాగ్రత్తగా పరీక్షించాను. ఆరోగ్యలోపం ఏం కనిపించలేదు. కానీ నువు చెప్పినట్టు వొంట్లో చాలా రక్తం పోయింది. పోయింది అనేకన్నా, తీసుకోబడింది అనవచ్చు. 'రక్తహీనత' జబ్బు లక్షణాలు లేవు. ఆమె పనిమనిషిని నా దగ్గర పిలిపించమని చెప్పాను. ఆ పిల్లను ఒకటి రెండు ప్రశ్నలు అడుగుతాను. దానితో అన్నీ పరిశీలించినట్టే. ఆపిల్ల ఏం చెపుతుందో నాకు తెలుసు. దీనికంతా ఏదో కారణం వుంది. ప్రతి విషయానికి ఏదో కారణం ఎప్పుడూ వుంటుంది. ఇంటికి వెళ్ళాక ఆలోచిస్తాను. రోజూ నువు నాకు టెలిగ్రాంఇవ్వాలి. అవసరం అనిపిస్తే నేను మళ్ళీ వస్తాను. ఈజబ్బు— బాగా లేకపోయినట్టు కనిపించడం కూడా జబ్బే— నాకు కుతూహలం కలిగిస్తోంది. ఈ అమ్మాయి కూడా నన్ను ఆకర్షిస్తోంది. నీకోసం కాకపోయినా, ఈమె జబ్బుకోసం కాకపోయినా, ఈమె కోసం వస్తాను'' అన్నాడు.

అతను అంతకంటే ఏమీ చెప్పడు. మేం ఒంటరిగా వున్నప్పుడూ కూడా, ఒక్కమాట ఎక్కువ చెప్పలేదు. కాబట్టి; ఆర్ట్, నాకు తెల్సిందంతా నీకు చెప్పాను. పరిస్థితి జాగ్రత్తగా చూస్తుంటాను. మీ తండ్రి కోలుకుంటాడని ఆశిస్తాను. ఓ ప్రక్క నీ తండ్రి, ఓ ప్రక్క నీ ప్రియురాలు, వీళ్లిద్దరి మధ్య నువ్వు నలిగిపోతున్నావోయ్! నీ తండ్రికి నువ్వు సేవ చెయ్యాలనుకుని వుండిపోవడం మంచిదే. అవసరమయితే లూసీని చూడటానికి నీకు కబురుచేస్తాను. నువ్వు మరీ ఆందోళన పడవద్దు, అటువంటి విషయం అని నీకు చెబితే తప్ప.''

## డాక్టర్ సెవార్డు డైరీ :

సెప్టెంబర్, 4 : ఆ క్రిమికీటకాది భక్షకుడు అట్లాగేవున్నాడు. విన్న మాత్రం ఒకసారి విజృంభించాడు. అదీ మిట్ట మధ్యాహ్నానికి కొద్దిగా ముందు. అతనిలో అశాంతి ఎక్కువ కాజొచ్చింది. పనివాడికి ఇతని లక్షణాలు తెలుసు. వెంటనే కొందర్ని సహాయం రమ్మన్నాడు. వాళ్ళు పరుగెత్తుకొచ్చారు. ఖచ్చితంగా పన్నెండు గంటలు కొట్టేసరికి, విజృంభించాడు. వాళ్లంతా తమ బలాన్ని ఉపయోగించి అతన్ని నొక్కిపట్టి వుంచగలిగారు. ఐదు నిముషాల్లో, అతను క్రమంగా తగ్గుతూ తగ్గుతూ చివరికి నిస్పృహ ఆవరించినట్లు వుండిపోయాడు. ఇప్పటి వరకూ అలాగే వున్నాడు. మూర్ఛలో కొట్టుకుంటూ బాధతో అతను అరిచే అరుపులు, ఇవతల వాళ్ళు స్పృహ కోల్పోయేట్టు వున్నాయని పనివాడు చెప్పాడు. మిగతా పేషంట్లు ఇతన్ని చూసి భయంతో బిగుసుకుపోయారు. వాళ్లతో నాకు చేతినిండా పని తగిలింది. నిజంగానే అంత భయంకరంగా వుందనిపించింది. కాస్త దూరంలో వున్న నాకే అతని అరుపులు నా బుర్ర చెదరగొట్టాయి. ఇప్పుడు ఆశ్రమంలో భోజనాల వేళ అయింది. నా పేషంటు దీర్ఘంగా ఆలోచిస్తూ, ఓ మూల కూర్చున్నాడు. అతని మొహంలో నీరసం, లోలోపలే కోపంతో కుళ్ళిపోడం,









ఏదో చెయ్యబోయేవాడిలా కనిపించింది. అదేమిటో సరిగా అర్థం కాలేదు.

తర్వాత : నా పేషంటులో మరో మార్పు. అయిదు గంటల వేళ అతన్ని చూసాను. సంతోషంగానూ, సంతృప్తిగానూ కనిపించాడు. ఈగల్ని పట్టుకుని తింటున్నాడు. ఎన్నెన్ని పట్టుకున్నాడో, అవి తలుపు వెనక చివర అంచున గోటితో గుర్తులు పెడుతున్నాడు. అతను నన్ను చూసాడు. చూడగానే నా దగ్గరికొచ్చి, తన చెడ్డ ప్రవర్తనకు క్షమాపణ చెప్పుకున్నాడు. తనని తన గదిలోకి వెళ్ళి, తన నోట్‌బుక్‌ని తీసుకోనివ్వమని, ఎంతో నమ్రతగా, దీనంగా అడిగాడు. అతన్ని సంతోష పెట్టడం మంచి దనిపించింది. కిటికీ తెరిచి వున్న అతన్ని గదిలోకి వెళ్ళనిచ్చాను. టీ కోసం అతనికిచ్చే పంచదారను కిటికీ దగ్గర చల్లాడు. పంట కోతకోసినట్టు, ఎన్నో ఈగల్ని పట్టాడు. ఈసారి అతను తినటం లేదు. ఇదివరకు చేసినట్టుగానే, ఒక పెట్టెలో పడేశాడు. సాలెపురుగును పట్టుకునేందుకు అన్ని మూలలా వెదికాడు. ఇంతకి ముందు జరిగిన రోజుల్లో సంఘటనల గురించి అతన్ని అడిగి, అతని ఆలోచనలు తెలుసుకుందామనుకున్నాను. కానీ, అందుకు సుముఖంగా లేడు. ఒకటి రెండు క్షణాలు చాలా విచారంగా కనిపించాడు. ఎక్కడో దూరం నుంచి మాట్లాడు తున్నట్టుగా, అసలు తనలో తానే మాట్లాడుకున్నట్టుగా అతని గొంతు వినపడింది.

"అంతా అయిపోయింది. అంతా అయిపోయింది. వాడు నన్ను ఒంటర్ని చేశాడు. వాళ్ళతట నేను చేసుకోవడం తప్ప, వేరే ఆశలేదు." వెంటనే నావైపు తిరిగి ఏదో నిశ్చయించుకున్నవాడికి మల్లే "డాక్టర్, నాతో మంచిగా వుండరా, నాకు మరింత పంచదార ఇప్పించరా ? పంచదార నాకు ఇష్టం." అన్నాడు.

"మరి ఈగలకు ?" అన్నాను.

"అవును, వాటిక్కూడా. పంచదార వాటికిష్టం. నాకు అవంటే ఇష్టం. కాబట్టి నాకు పంచదార యిష్టం" అన్నాడు. పిచ్చివాళ్ళు వాదించరని అనుకునే వాళ్ళకి, పిచ్చివాళ్ళ గురించి చాలా తక్కువ తెలుసు అని చెప్పవచ్చు. మామూలు కన్నా రెట్టింపు పంచదార అతనికి ఇప్పించాను. అట్లా, ప్రపంచంలో

## జీవన్ మృతులు

కల్లా సంతోషపడే వ్యక్తిగా అతన్ని చేసి వచ్చాను. అతన్ని బాగా లోతుగా అర్థం చేసుకున్నా ననుకుంటాను.

అర్ధరాత్రి : అతనిలో మరో మార్పు. లూసీని చూడడానికి వెళ్లాను. ఆమె కాస్త కులాసాగానే కనిపించింది. ఆమె దగ్గర్నించి అప్పుడే వచ్చాను. ఆశ్రమం గేటుదగ్గర నిలబడి సూర్యాస్తమయం చూస్తున్నాను. ఆ సమయంలో అతని అరుపు వినిపించింది. అతని గది, ఇంటికి ఇటువైపు వుండటం వల్ల అరుపు ప్రొద్దుటకంటే బాగా వినగలిగాను. సూర్యాస్తమయ కిరణాలు, లండన్ నగరం మీద, మేఘాల్లో నీటిమీదా అద్భుతమైన అందాల్ని వెదజల్లుతుంటే, తిలకిస్తున్న నాకు అతని అరుపు నన్ను ఈ లోకంలో పడేసింది. భయాలతోనూ, నిరాశా నిస్పృహాలతోనూ, నిండిన నా రాతి భవనం, వీటన్నిటినీ దిగమింగే, నా ఒంటరి హృదయం స్పృహలోకి వచ్చాయి. ప్రొద్దు క్రుంగిపోతుండగా అతని దగ్గరకు పరుగెత్తాను. అతని కిటికీలోంచి, సూర్యబింబం దిగిపోతుండగా, చూసాను. అది కుంగిపోతున్నంత సేపూ, అతనిలో ఉద్రేకం కూడా క్రమంగా తగ్గుతూ వచ్చింది. సూర్య బింబం పూర్తిగా కుంగిపోగానే, నేలమీద అప్పటివరకూ అతన్ని పట్టుకున్న వారు వదిలేసారు. ఏమైనా ఇది చాలా అద్భుతం అనిపించింది. పిచ్చివాళ్లకు ఎంత తొందరగా కోలుకునే శక్తి వుంది! నిముషాల్లో అతను సౌమ్యంగా లేచి నిలబడి చుట్టూ చూసాడు. అతన్ని పట్టుకోవద్దని పనివాళ్లకు సైగచేసాను. అతను అప్పుడు ఏం చేస్తాడో చూద్దామనిపించింది. తిన్నగా కిటికీ దగ్గరికెళ్ళి, అక్కడ పంచదార పొడి లేకుండా శుభ్రం చేసాడు. వెంటనే, ఈగల పెట్టె బయటకు తీసుకెళ్ళి ఖాళీచేసి, దాన్ని దూరంగా విసిరేసాడు. కిటికీ తలుపులు మూసేసాడు. మంచం మీదకు వెళ్లి కూర్చున్నాడు. ఈ చర్యలన్నీ నాకు ఆశ్చర్యం కలిగించాయి. "ఇక ఈగల్ని వుంచవా ?" అని అడిగాను.

"వుంచను. వాటితో వెగటు పుట్టుకొచ్చింది" అన్నాడు. అతని కేసు కొత్తగా కనిపించసాగింది. అతని చర్యల వల్ల నాకు కొంత అర్థమయినట్టుగా తోచింది. తెల్సింది. కిటుకు తెలిసింది. మిట్ట మధ్యాహ్నం సమయంలోనూ, సూర్యాస్తమయ సమయంలోనూ అతను మూర్ఛలో కొట్టుకోవడం ఎందుకు ఎక్కువయిందో. కొందరిమీద చంద్రుడి ప్రభావం వుంటుంది. అట్లాగే, సూర్యుడి ప్రభావం కూడా ఇతనిమీద వుందేమో ? చూడాలి మరి.

**సేవార్డు (లండన్) వాన్‌హెల్సింగ్ (ఆంస్టర్‌డామ్)కు పంపిన టెలిగ్రాంలు :**

సెప్టెంబర్, 4: పేషంటు ఇవాళ్టివరకు బాగానేవుంది.

సెప్టెంబర్, 5 : పేషంటు బాగాకోలుకుంది. ఆకలి బాగావుంది. సహజంగా నిద్రపోతోంది. మంచి ఉత్సాహంగా వుంది. మనిషి మళ్ళీ రంగు తేలుతోంది.

### కంప్యూటరు గేమ్స్ !

జపానులో బొమ్మల ఉత్పత్తిదారులు బొమ్మల తయారీలో సాంకేతిక నైపుణ్యాలను ఉపయోగిస్తున్నారు. జపానులో పసిపిల్లల జనాభా చాలా తక్కువగా ఉంది. అందువలన పెద్దవారిని సైతం ఆకర్షించేందుకు కంప్యూటరు గేమ్స్‌ను తయారు చేస్తున్నారు. ఇటీవల క్రొత్తగా నాలుగు రకాల ఎల్. ఎస్. ఐ. గేమ్స్‌ను ప్రవేశపెట్టారు. ఇవి తక్కువ వెలలో లభించే కంప్యూటర్లు. వీటిలో 'లార్జి స్కేల్ ఇంటిగ్రేషన్స్'ను ఉపయోగిస్తారు. ఇవికాక మరో 40 రకాల ఎల్. ఎస్. ఐ. గేమ్స్‌ను మార్కెట్లో ప్రవేశపెట్టనున్నారు. జపాను కంపెనీలు ఒక్కొక్కటి 50 నుండి 60 వేల యూనిట్లను తయారు చేస్తున్నాయి. 1981లో 260 మిలియన్ డాలర్ల మేరకు బొమ్మలు అమ్ముడుపోయాయి. ఇందులో పదిశాతం మేరకు కంప్యూటరు గేమ్స్ అమ్ముడైనట్లు జపాన్ టాయ్ అసోసియేషను వారు తెలియజేశారు.

సెప్టెంబర్, 6 : పరిస్థితి విషమంగా మారింది. ఆగకుండా, వున్నట్టుండి బయలుదేరండి. హల్మ్రవుడ్కిచ్చే టెలిగ్రాం మీరు వచ్చేదాకా ఇవ్వను.

## డాక్టర్ సెవార్డు ఆర్థర్ హల్మ్రవు కు రాసిన ఉత్తరం

సెప్టెంబర్, 6 :

నా ప్రియమైన ఆర్ట్,

ఇవాళ నీకు చెప్పే కబురు అంత మంచిదికాదు. లూసీ సంగతి మళ్ళా మొదటికొచ్చింది. దీనివల్ల కొంత మంచి జరిగింది కూడా. లూసీ తల్లి లూసీ గురించి కాస్త ఆందోళన పడుతోంది కదా! ఆమె గురించి నన్ను ఒక డాక్టర్‌గా సంప్రదించింది. ఇదే మంచి అవకాశం అనిపించింది. మా గురువు వాన్ హెల్సింగ్, గొప్ప స్పెషలిస్టు, నా కోసం ఇక్కడకు రాబోతున్నాడని ఆమెను అతనికి చూపించవచ్చునని, ఇద్దరం ఆమెను చూస్తామని చెప్పాను. ఇప్పుడు మేం యధేచ్ఛగా వాళ్ళ ఇంటికి వెళ్ళొచ్చు. ఆమె ఆందోళన చెందదు. ఆందోళన పడిందంటే ఆమె ప్రాణానికే ముప్పు. లూసీ పరిస్థితి ఆమెకు కొంత బాధగానే వుంది. ఇప్పుడు మేము, మనమంతా కష్టాల్లో మునిగివున్నాం. దేవుడి దయవల్ల గట్టెక్కాలి. అవసరం అయితే రాస్తాను. నా దగ్గర్నించీ నీకు కబురు లేనట్టయితే, మా గురువు దగ్గర్నించి కబురుకోసం వేచివున్నానని అనుకోవచ్చు. తొందరగా ముగించేస్తూ,

ఎప్పుడూ నీ
జాన్ సెవార్డు.

## డాక్టర్ సెవార్డు డైరీ

సెప్టెంబర్, 7 : మేం ఇద్దరం లివర్‌పూల్ స్ట్రీట్‌లో కలిసినప్పుడు వాన్ హెల్సింగ్ మొట్ట మొదట అడిగింది ఇది :

"మన మిత్రుడికి, అదే లూసీ లవర్‌కి ఏమైనా చెప్పావా ?"

"లేదు" అన్నాను. "మీరు వచ్చిన తర్వాత రాస్తానని టెలిగ్రాం ఇచ్చాను. మీరు ఇక్కడకు వస్తున్నారని సాదాగా ఒక ఉత్తరం వ్రాసాను. మిస్ లూసీకి అంత బాగాలేదని, అవసరమయితే ఉత్తరం రాస్తానని చెప్పాను" అన్నాను.

"మంచిపని చేసావోయ్! చాలా మంచిపని చేసావు. అతనికి ఏమీ తెలియకుండా వుంటేనే మంచిది. బహుశా అతను ఎప్పుడూ తెలుసుకోలేడు. అట్లాగే జరగాలని అనుకుంటున్నాను. అవసరం అనుకుంటె అతనే తెలుసుకుంటాడు. జాన్, నీకొక హెచ్చరిక చేయాలోయ్! నువు పిచ్చివాళ్ల సంగతి చూస్తుంటావు. మనుషులందరూ ఏదో ఒక రకంగా పిచ్చివాళ్లే. నువు పిచ్చివాళ్లతో వ్యవహరించినట్టుగానే, దేవుని యొక్క పిచ్చివాళ్లతో కూడా వ్యవహరించు. నువ్వు ఏం చేస్తావో, ఎందుకు చేస్తావో, ఏం ఆలోచిస్తావో, వాళ్లకు చెప్పకు. వాళ్లంతట వాళ్లను తెలుసుకోనివ్వు. విషయాలు వాటంతట అవే ఒకదారికొచ్చి బయటపడతాయి. ఇప్పటివరకూ నీకూ నాకు తెల్సింది, ఇక్కడ.. ఇక్కడ వుంచాలి" అన్నాడు. అట్లా అంటున్నప్పుడు నా హృదయం మీద; నా నుదుటిమీదా చేతితో తాకాడు. అట్లాగే తనకూ చేసుకున్నాడు. "నా ఆలోచనలు నాకు వున్నాయి. వాటిని నీకు తర్వాత చెప్తాను" అన్నాడు.

"ఇప్పుడు చెప్పకూడదా ?" అడిగాను. "ఇప్పుడు చెబితే కాస్త మంచి జరుగుతుంది, మనం ఒక నిర్ణయానికి రావొచ్చు" అన్నాను.

నన్ను మాట్లాడవద్దని సైగచేసి నా వంక చూసి అన్నాడు. "ఏమోయ్ జాన్, రైతు మొక్కజొన్న కండెను, గింజ పట్టకుండానే, సూర్యుడి బంగారు కిరణాలు దానిమీద పడకుండానే, దాన్ని కోసేసి, కండెను వొలిచేసి, 'చూసావా, ఇది మంచి కండె, ఇది చాలా బాగా పెరుగుతుంది ఇంకా వుంచితే...' అని చెప్తాడా, అన్నాడు. అతని భావం నాకు అర్థంకాలేదు. అదే సంగతి చెప్పాను. దానికి

"నువ్వు ఎప్పుడూ శ్రద్ధగా వినే విద్యార్థివి. అప్పుడు నీ గురించి మిగతావాళ్లకన్నా బాగా రాసే వాడ్ని. నువ్వొక్కడివే బాగా చదివే వాడివి. ఇప్పుడు నువ్వొక మాస్టరువి. మంచి అలవాటు ఎప్పుడూ పోదు– అని నా నమ్మకం. గుర్తుంచు కోవోయ్! విషయం అనేది బాగా తెలుసుకుంటే మంచిది. ఏవో కొన్నికొన్ని జ్ఞాపకంపెట్టుకుంటే సరిపోదు. అసలది మంచిదికాదు.ఇప్పుడు లూసీవిషయం తీసుకో. ఈమె కేసు జాగ్రత్తగా చూడవలసినది' కావచ్చు–కావచ్చు అంటున్నాను, కాకపోనూ వచ్చు. ఈమె కేసులో మనం కుతూహలం చూపిస్తున్నాం. మిగతావాళ్లు ఆ: ఏవుంది అనుకుంటారు. కానీ, ఈమె కేసులో ఏదీ చిన్న విషయంగా చూడకు. అన్నీ కాగితంపై పెట్టు, నీ సందేహాలు, నీ వూహాలు అన్నీ. తర్వాత





జవాబుగా నా దగ్గరికొచ్చి నా చెవులు రెండూపట్టుకుని ఆడించాడు, నా చిన్నప్పుడు అతను క్లాసులో చేసినట్టుగా. "మంచి రైతు అయితే చెప్తాడు. అప్పటివరకూ వచ్చిన పెరుగుదల చూసి, వూర్కే నాటువేసేసి, అది బాగా పెరుగుతుందో లేదో ఏ రైతూ చెప్పలేడు. చిన్నపిల్లలయితే అట్లా చేస్తారు కానీ, జీవితాలతో పనిచేస్తున్న వాళ్ళు చెయ్యరు. ఇప్పుడు నన్ను చూడు జాన్! ఇప్పుడే విత్తనం చల్లాను. అది మొలకెత్తాలి, అసలు మొలకెత్తడం అంటూ జరిగితే. మొలకెత్తుతుందనే అనుకుంటున్నాను. అది మొలకెత్తి గింజ పట్టేదాకా వేచి చూడాలి" అన్నాడు. నన్ను గమనించాడు. నాకు అర్థమయినట్టుగా అతను గ్రహించాడు. వెంటనే గంభీరంగా మారిపోయి అన్నాడు.

తర్వాత నువ్వు అనుకునేవి, ఎంత నిజమో నీకు తెలుస్తుంది. ఓటమి పొందినప్పుడే మనకు నేర్పు వస్తుంది, గెలిచినప్పుడు కాదు."

లూసీ జబ్బు లక్షణాలు, ఇంతకుముందు చెప్పినట్టుగానే చెప్పాను, కాస్త వివరంగా. అప్పుడతను గంభీరంగా వుండిపోయాడు. ఏం మాట్లాడలేదు. కొన్ని పరికరాలు, కొన్ని మందులు వున్న సంచీ తీసుకున్నాడు. ఇంతలో లూసీ తల్లి లోపలికొచ్చింది. కాస్త కంగారు పడింది. మరీ నేను వూహించనంతగా లేదు. ఆమె ఈ భయాలకు, ఆందోళనలకు అలవాటు పడిపోయిందేమోనన్నట్టు కనిపించింది. వాళ్ల అమ్మాయి పరిస్థితి వింతగానూ, భయంకరం




## వీడియోలలో కొత్త రికార్డు !

జపానులో వీడియోల ఉత్పత్తి గత సెప్టెంబరు నెలలో కొత్త రికార్డు నందు కుంది. ఒక్క సెప్టెంబరు నెలలోనే 12,53,000 వీడియో టేప్ రికార్డర్లను ఉత్పత్తి చేయటం జరిగింది. అది అంతకు మునుపు సంవత్సరం కంటే 29.4 శాతం ఎక్కువ. ఉత్పత్తితోపాటు ఎగుమతులు కూడా కొత్త స్థాయిని చేరుకుంటున్నాయి. ఇది గత సంవత్సరం కంటే 54.6 శాతం ఎక్కువ. రంగుల టెలివిజన్ల ఉత్పత్తి కూడా 8.2 శాతం పెరిగినట్లు ఎలక్ట్రానిక్ ఇండస్ట్రీస్ అసోసియేషను వారు తెలియచేశారు.

## జీవన్ మృతులు

గానూ వుంది అని చెప్పినా కూడా, ఆమె తట్టుకు నేట్టుగా కనిపించింది.

ఏమైనా ఆమెను లూసీకి కాస్త దూరంగా వుంచడం మంచిదనిపించింది. అదే విషయం ఆమెకు చెప్పాను. ఆమె అట్లాగే అని వెళ్ళిపోయింది వెంటనే. వాన్ హెల్సింగ్, నేనూ లూసీ గదిలోకి వెళ్ళాం. నిన్న ఆమెను చూసి విస్తుపోయాను. ఇవాళ చూస్తే, భయం అనిపించింది. ఆమె అతి భయంకరంగా పాలిపోయివుంది. కనీసం పెదాలమీద ఎరుపుగానీ, చిగుళ్లమీద ఎరుపుగానీ లేవు. మొహంమీద ఆమె దవడ ఎముకలు కొట్టొచ్చినట్టు కనపడ్డాయి. వాన్ హెల్సింగ్ ఆమెను చూస్తూ మరింత గంభీరంగా మారిపొయ్యాడు. అతని కనుబొమలు ముడివడ్డాయి. లూసీ చలనం లేకుండా పడివుంది. ఆమెకు మాట్లాడే శక్తి వున్నట్టు కనిపించలేదు. మేం ఇద్దరం మౌనంగా నిలబడ్డాం. వాన్ హెల్సింగ్ తలతో సైగ చేసాడు నాకు. ఇద్దరం గదిలోంచి బయటకొచ్చాం. తలుపులు వేసిన వెంటనే గబగబా పక్కనేవున్న గది దగ్గరికెళ్ళాం. అది తెరిచేవుంది. వెంటనే అతను నన్ను ఆ గదిలోకి లాక్కెళ్ళాడు. వెంటనే తలుపులు వేసేసాడు. 'అయ్యో దేవుడా! ఇది చాలా భయంకరంగావుంది. క్షణంకూడా వృధా చేయడానికి వీల్లేదిప్పుడు. రక్తం లేకపోవడం మూలాన ఆమె చచ్చిపోతుంది. ఆమె గుండె పని చేయడానికి రక్తం అవసరం. ఇప్పుడు ఆమెకు వెంటనే రక్తం ఎక్కించాలి. నువ్వో నేనో ఆమెకు రక్తం ఇవ్వాలి'' అన్నాడు.

''నేను వయస్సులో వున్నవాడ్ని. బలంగావున్నాను. కాబట్టి నా రక్తం ఇస్తాను ప్రొఫెసర్ !'' అన్నాను.

''అయితే సిద్దంగా వుండు. నా సంచీ తీసుకొ వస్తాను. నా దగ్గర అన్నీ సిద్దంగా వున్నాయి'' అన్నాడు.

ఇద్దరం క్రింది అంతస్తుకు దిగాం. అట్లా దిగుతుండగా, తలుపుకొట్టిన చప్పుడయింది. హాల్లోకి చేరుకునే పరికి పనిమనిషి తలుపు తీసింది.

|ఇంకా వుంది|



సూటింగులు: పాలియెస్టర్ బ్లెండ్ మరియు కాటన్
మంచి అభిరుచి. తగిన ధరలు.
ఎన్‌టైస్®
MCA/NTC/79/TEL
నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్
(తమిళనాడు మరియు పాండిచెరి) లి.
భారత సర్కారుపు ఒక ఉద్యోగ సంస్థ
10/64 సోమసుందరం మిల్స్ రోడు, కోయమత్తూరు-641009



# నీలాకాశం

సీరియల్ — శ్యామల



(గత సంచిక తరువాయి)

తొమ్మిది గంటలు దాటినా రమేష్ రాలేదు.

"స్టేషన్‌కు వెళ్ళాలని సుధాకర్ మరచి పోయారేమో ..." సాలోచనగా అన్నది ఇందిర.

"మాట యిచ్చాక మరిచిపోవటం, చెప్పింది చేయకపోవటం సుధాకర్‌కి తెలియదు –" అంది పద్మ వెంటనే.

"మీ సుధాకర్ని నేనేమీ అనలేదమ్మా! ఏదయినా పనిలో బిజీగా ఉండవచ్చు కదా అనే ఉద్దేశంతో అన్నాను"

"స్వంత అన్నతో ఉన్నంత అనుబంధం దానికి సుధాకర్‌తో ఉంది. సుందరి పెళ్ళి నిశ్చయమయి నపుడు ఆ పిల్లను కలుసుకొని గట్టిగా పోట్లాడి మరీ వచ్చింది !" అంది వరలక్ష్మిగారు.

"రత్నాన్ని చూసి గుర్తించలేని మూర్ఖురాలు సుందరి. ఆ మూర్ఖురాలి కోసం జీవితమంతా ఒంటరిగా ఉంటానని సుధాకర్ అనటం మాత్రం నాకు బాధగా ఉంది" అంది పద్మ.

"ఆ పిల్ల చేసిన గాయం అటువంటిది మరి. నమ్మించి మోసం చేసింది" అన్నది వరలక్ష్మిగారు.

ఇందిరకి సుందరి ఎవరో, ఏమిటో తెలియదు. అడుగుదామంటే సంకోచం. రమేష్ వైపు మళ్ళాయి ఆలోచనలు. ఇంకా రాలేదేమిటి ? స్కూటర్‌కి ఏమీ కాలేదు కదా ! ఆ ఆలోచనకే గుండె గుభిల్లుమంది. అసలు స్కూటర్ మీద తీసుకు వస్తానని సుధాకర్ అన్నప్పుడే తను వద్దని ఉండవలసింది. రమేష్ ఉత్తరం వచ్చినపుడు డాక్టర్ జాక్సన్ ఊరిలో ఉంటే, జీప్ పంపించమని అడిగి ఉండేది. తన మనసెందుకో ఇటీవలి ప్రతి క్షణమూ కీడునే శంకిస్తున్నది. హైదరాబాదులోనే ఏదయినా ఉద్యోగం తనకు దొరికి ఉంటే, ఈ విధంగా తమ్ముళ్ళనించి విడిపోవటం, తన కోసం వాళ్ళు ఈ మారుమూల పల్లెకి రావటం ఉండేది కాదు...

"అన్నయ్య వచ్చేశాడు !" అరిచింది ఉష. ముందు సుధాకర్, వెనక రమేష్ కూర్చొని ఉన్న స్కూటర్ వాకిట్లో ఆగింది.

రిలీఫ్‌తో ఇందిరను నిస్సత్తువ ఆవరించింది. కూర్చున్న చోటి నించి లేవాలని కూడా తోచక, 'అమ్మయ్య !' అని గుండెలమీద చేయి వేసుకుంది.

"ఉషా !" చెల్లెలిని రెండు చేతులతో పైకెత్తి, ముద్దు పెట్టుకొని దించాడు రమేష్.

"అక్కా !" ఇందిర దగ్గరకు వచ్చాడు. "ఎందుకలా ఉన్నావు ?" ఆత్రంగా అడిగాడు.

"నాకు ఎందుకో భయం వేసింది రమేష్ !" చేయిపట్టిలాగి ప్రక్కన కూర్చోపెట్టుకుంటూ అన్నది. "నీవు, సుధాకర్ ఎంతకీ రాకపోతే... ఏదయిలో ఆక్సిడెంట్ అయిందేమోనని భయం కలిగింది" అంటుంటే కళ్ళలో నీళ్ళు జలజలా రాలాయి.

"పిచ్చి అక్కా ! అంత భయందేనికి? ఎప్పుడూ ఒకే దురదృష్టం వెంటాడతూ ఉంటుందా ?"

రమేష్‌ని, సుధాకర్‌ని భోజనం చేయమనిపిలిచింది పద్మ. అందరూ నిద్రపోయినాక కూడా ఇందిర, రమేష్ కబుర్లు చెప్పకుంటూ కూర్చున్నారు.

"నాకు, సురేష్‌కీ క్లాస్ టెస్ట్సలో బాగానే మార్కులు వస్తున్నాయి అక్కా ! అమ్మమ్మ మమ్మల్ని ఎంతో బాగా చూసుకుంటున్నది. నీవు పంపించే డబ్బు హాయిగా సరిపోతున్నది" తమ యోగక్షేమాలు చెప్పాక అక్క గురించి అడిగాడు "నీ వర్క్ ఎలా ఉన్నది ? ఉషలో చాలా ఇంప్రూవ్ మెంట్ కనిపిస్తోంది. కాస్త బొద్దుగా తయార యింది. నిజం చెప్పాలంటే నీకూ ఈ ఊరి గాలి, నీరు బాగా సరిపడినట్లున్నాయి. కొంచెం ఒళ్ళు వచ్చింది."

నవ్వింది ఇందిర "నీవు మాత్రం అలాగే ఉన్నావు రమేష్ ! మరీ రాత్రింబవళ్ళు చదువుతున్నావేమిటి?" అని అడిగింది.

'మరి చదవకపోతే ఎలా ? మెడిసిన్‌లో సీటు రావద్దూ ?" అన్నాడు.

చాలా సేపయినాక, అతి సామాన్యంగా అంటున్నట్లు అడిగింది ఇందిర "రమేష్, మధు ఎప్పుడయినా కనిపించాడా ?"

అక్క ముఖంలోకి నిశితంగా చూశాడు రమేష్, మధుని వదులుకున్నందుకు అంతగా బాధపడుతున్నదా అన్నట్లు. ఓ నిమిషం ఆగి చెప్పాడు "మధు మన యింటికి రాలేదక్కా ! ఒకటి, రెండు సార్లు బయట కనిపిస్తే పలకరించబోయాను. చూసీ చూడనట్లు వెళ్ళిపోయాడు "

"టైము పన్నెండు దాటింది, రమేష్, ఇంక పడుకో !" అంటూ సంభాషణ నిలిపివేసింది ఇందిర.

మర్నాడు డాక్టర్ జాక్సన్‌ని వెళ్లి పలకరించి వచ్చాడు రమేష్. చెల్లెలి ఆరోగ్యం మెరుగవటం, అక్క కూడా తల్లి తండ్రుల గురించి దిగులు ఆట్టే పెట్టుకోకుండా కొంత ఊరట చెందటం రమేష్‌కి సంతోషం కలిగించాయి. తమ్ముళ్ళకు చదువులు సాఫీగా సాగిపోతూండటం ఇందిరకు ఆనందం కలిగించింది. ఇందిర, రమేష్, ఉష ఆ రోజంతా పొలం గట్లవైపు,చెరువువద్దకు, గుడికి హుషారుగా షికార్లు తిరిగారు. ఆ సాయంత్రం చెరువు దగ్గరగా ఇసుకలో ఉన్న ఓ పడవ అంచున కూర్చొని కబుర్లు చెప్పకుంటున్నారు ముగ్గురూ. బల్లకట్టు మనిషిని చూసి పలకరింపుగా చేయి ఊపి అతని దగ్గరకు వెళ్ళింది ఉష.

"దీనికి అందరూ స్నేహితులే !" నవ్వింది ఇందిర. "సుదర్శనం మాస్టారు, డాక్టర్ జాక్సన్ వంటి పెద్దవాళ్ళ దగ్గర్నుంచి, పసిపిల్లల దాకా— అందరితో స్నేహం కలుపుకుంటుంది."

"అమ్మ, నాన్న గురించి ఎప్పుడూ అడగదా?"

"ఎందుకు అడగదు ? కాని వెనకటిలాగా దిగులుతో, బెంగతో అడగదు ! వాళ్ళు ఇకరారు— అని అర్థం చేసుకుంది. 'ఇప్పుడు ఎక్కడ ఉన్నారు? ఏం చేస్తున్నారు ?' ఇటువంటి ప్రశ్నలు అడుగుతుంది. మేము ఏదో సర్దిచెప్తూంటాము."

సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఆకాశం కనకాంబరం రంగులో కాంతులీనుతున్నది.

"అక్కా..." గతంలోకి చూస్తూ అన్నాడు రమేష్– "ఆ రోజు మనం అమ్మకు కొన్న చీర ఈ ఆకాశం రంగులోనే ఉన్నదికదూ..."

"అవునురా... మనం దురదృష్టవంతులం" భారంగా అన్నది ఇందిర.

**జరిగిన కథ — 13** సినిమా చూసి స్కూటర్‌మీద వస్తూ యాక్సిడెంట్‌లో మరణిస్తారు ఇందిర తల్లిదండ్రులు. తన తమ్ముళ్ల, చెల్లి భవిష్యత్తు తీర్చిదిద్దడానికి ఉద్యోగంలో చేరాలనుకుంటుంది ఇందిర. డాక్టర్ జాక్సన్‌తో ఇందిరకు పరిచయం కల్గుతుంది. తన దగ్గర టైపిస్ట్‌గా జేరమని జాక్సన్ ఇందిరను ఆహ్వానిస్తాడు. పరీక్షలవగానే చెల్లిని తీసుకురమ్మని తమ్ముళ్లకి చెప్పి తను ముందుగా వస్తుంది ఇందిర. పట్నంలో పెరిగిన ఇందిరకు ఆ పల్లెటూరి వాతావరణం, అక్కడి మనుష్యుల మనస్తత్వాలు నచ్చుతాయి. ఉషని తీసుకవచ్చి దించి వెళతాడు సురేష్. పల్లెటూర్లలోని మనుషుల మనస్తత్వాలు ఎలా వుంటాయో, మూఢనమ్మకాలు వాళ్లలో ఏ విధంగా పాతుకుపోయాయో తెలియజేయటానికి డాక్టర్ అరుణకు, ఇందిరకు గతంలో జరిగిన ఓ సంఘటన వివరిస్తాడు డా॥ జాక్సన్. ఇందిరకు పద్మ తన కథను వివరిస్తుంటుంది. బావ ప్రసాద్‌తో తన పెళ్లి ఇంకా రెండురోజులుందనగా అతని కాలికి ఫ్రాక్చరయి హాస్పటల్‌లో జేరతాడు. పద్మ నష్టజాతకురాలని, ఆమె మూలంగానే తన కొడుక్కి ఈ విధంగా జరుగుతోందన్న మూఢనమ్మకంతో వారిద్దరి పెళ్లి జరగకుండా చేస్తుంది ప్రసాద్ తల్లి. రమేష్ రాకకోసం ఎదురు చూస్తుంటారు ఇందిర, ఉష.

"నాకెప్పుడూ కలలో అమ్మ కనిపిస్తూనే ఉంటుంది అక్కా... ఒక్కొక్కమారు మనకు ధైర్యం చెప్తున్నట్లు కనిపిస్తుంది. ఒక్కొక్క మారు మన గురించి దిగులు పడుతున్నట్లు కనిపిస్తుంది... ఎప్పుడూ ఆ కనకాంబరం చీరలోనే కళగా ఉంటుంది... కలవచ్చిన మర్నాడు, అమ్మ మన మధ్యలోనే ఉంది అనే ఫీలింగుతో మనసుకి ఏదో స్వాంతన చిక్కుతుంది..."

"అంతా భ్రమ రమేష్! అమ్మలేదు—నాన్న లేరు—అనే విషయాన్ని గుర్తుంచుకొనే మన బ్రతుకు బాటలు వేసుకోవాలి. నాకు తరచుగా వచ్చే కల చెప్పనా? అదొక రైల్వే స్టేషన్. ప్లాట్‌ఫారమ్ నిండా జనం. రైలు ఒకటి ఆగి ఉంటుంది. నేను హడావిడిగా పరుగెత్తుతూ వస్తాను. ఆ రైలు ఎక్కాలి. నాకు, రైలుకి మధ్య దూరం. నిండుగా జనం. రైలు దగ్గరకు పరిగెత్తుతూ ఉంటాను. అది వెళ్ళిపోతుందని ఆతృత, కంగారు, పరుగెత్తలేక ఆయాసం— నా స్థితి వర్ణించలేను. ఇంక దగ్గరకు వచ్చేశాను...అదిగో, ఆ కమ్మీ పట్టుకుంటే ఇంక రైలు ఎక్కేసినట్లే...వెంట్రుకవాసి దూరంలో ఉండగా రైలు కదులుతుంది. నేను ఇంకా పరిగెత్తుతూనే ఉంటాను. రైలు వేగం పుంజుకొని వెళ్ళిపోతుంది. నేను ప్లాట్‌ఫారమ్ పైనే ఉండిపోతాను... అంతే రమేష్, మెలకువ వచ్చేస్తుంది. నిజంగా చాలా దూరం పరిగెత్తినట్లే ఒళ్ళంతా చెమట పట్టి, గుండె వేగంగా కొట్టుకుంటూ ఉంటుంది. ఈ కల ఒకసారి కాదు, తరచుగా వస్తూనే వుంటుంది. ఏమిటంటావు? ఎప్పటికయినా రైలు ఎక్కినట్లు కల వస్తుందా?"

"మనసులోని అనుభూతులే కలల రూపంలో వస్తాయిట. పగలంతా అడుగు పొరల్లో ఉండిపోయిన ఆలోచనలన్నీ నిద్రపోయినాక వెలికి వచ్చి ఏవేవో రూపాలు దాల్చి మన ముందు కలలుగా నిలుస్తాయంటారు. నీ కలలకు ఏదో అర్థం ఉంది. నీ లోని ఏవో భయాలు ఆ కల రూపం దాలుస్తున్నాయి."

"ఫ్రాయిడ్ అంటాడు— కలలు చాలా వరకు మన తీరని కోరికలకు ప్రతిరూపాలు అని... నేను రోజంతా బిజీగా ఉంటాను. మనసులో ఏ ఆలోచనలు ఎక్కువసేపు నిలిచేందుకు అవకాశమే ఇవ్వను... ఏ రోజు కా రోజు అన్నట్టుగానే కాని, ఏవేవో కోరికలతో మేడలు కట్టను... మరి నాకు ఈ కల ఏమిటో అర్థం కాకుండా ఉంది."

"అక్కా, నీవు సెక్యూరిటీ ఫీలవటంలేదు. మా బాధ్యతల బరువు మానసికంగా నిన్ను చాలా వత్రీ పెడుతున్నది ..."

"అలా అనుకోవద్దు రమేష్! మీ బాధ్యతలు



వహించకపోతే ఇంకా ఎంతో వ్యధకు లోనయేదాన్ని. నా కల విషయం ఆలోచించకు ... మీరిద్దరూ బాగా చదువుకుంటే నా బాధ్యతలు పంచుకున్నట్లే ..."

ఉష వచ్చింది. బల్లకట్టుపైన కూర్చొని అవతలిగట్టు వరకు వెళ్ళి వచ్చిందిట. "అవతలి గట్టుకి వెళ్ళేసరికి సుధాకర్ కనిపించాడు అన్నయ్యా! రమ్మని పిలుచుకువచ్చాను!" అంది. ఉష వెంట ఉన్నాడు సుధాకర్.

"పెద్దవాళ్ళ గురించి కాస్త మర్యాదగా చెప్పాలి ఉషా! సుధాకర్‌గారు అనలేవూ?"

అక్క కోప్పడటంతో మూతి ముడుచుకుంది ఉష.

సుధాకర్ నవ్వి "నీకు ఎలా పిలవాలనిపిస్తే అలాగే పిలు ఉషా! మీ అక్క మాట వినకు" అన్నాడు. రమేష్ పక్కనే కూర్చున్నాడు.

"అందరిలోకి చిన్నది కావటంతో ఈవిడ

అంటే ఇంట్లో అందరికీ గారాబమే! దానితో కాస్త పెంకితనంపాలు ఎక్కువయింది'' అన్నాడు రమేష్.

''కాస్త పెంకితనం ఉంటేనే అందం!'' అని సుధాకర్ అనేసరికి ఉష సంతోషంగా నవ్వింది.

''నేను ఇంటర్ అవగానే మెడిసిన్ చదవాలని అనుకుంటున్నాను సుధాకర్‌గారూ! చాలాకష్టమైన కోర్స్ అంటారు—నిజమేనా?'' తనకు ఇష్టమైన టాపిక్ గురించి అడిగాడు రమేష్.

''మెడిసిన్ ఒక్కటేకాదు రమేష్, ఏ విద్య అయినా క్షుణ్ణంగా అభ్యసించాలంటే కష్టపడాలి!''

''మీరు చాలా కష్టపడి, చదివేవారా?''

''డాక్టర్ జాక్సన్ పెంపకంలో పెరిగానుకదా—కష్టపడకుండా, బద్ధకంగా కాలం గడిపివేయటం చాలా చెడు అనే అభిప్రాయం మనసులో పాతుకు పోయింది. రాత్రింబవళ్ళు చదివాను— యూనివర్శిటీ ఫస్ట్ రాంక్ కూడా తెచ్చుకున్నాను ...''

''ఎం. డి, కూడా చదివి ఎందులోనయినా స్పెషలైజ్ చేస్తే బాగుండేది కదా?''

''పీడియాట్రిక్స్ చదవాలనే అనుకున్నాను. కాని, మధ్యలో ప్రేమలో పడ్డానోయ్! పెళ్ళి చేసుకోవాలను కొని, ఎం. బి. బి. ఎస్. అవగానే ఉద్యోగం వెతుక్కున్నాను. తీరా అటు పెళ్ళీ చేసుకోలేదు. ఇటు ఎం. డి. చదవనూ లేదు!'' సుధాకర్ నవ్వుతూ, తేలికగా అన్నా అతని మాటల వెనక ఏదో వ్యధ ఉన్నట్లు అనిపించింది ఇందిరకి.

''పోనీ... ఇప్పుడు చదవచ్చునుకదా...'' ఇందిర అంది చిన్నగా.

సుధాకర్ ఏదో చెప్పబోయాడు. అంతలోనే ఏదో గొడవవినరావటంతో ముగ్గురూ అటు చూశారు.

అంతవరకు పిల్లలు ఈతలు కొడుతున్నారు. అక్కడ ఇప్పుడు అంతా గుంపుగా చేరారు. ఏదో గొడవ జరుగుతున్నది.

సుధాకర్ చటుక్కున లేచివెళ్ళాడు. ఇందిర, రమేష్, ఉష కూడా అతని వెనకే వెళ్ళారు.

ఏడేళ్ళ పిల్లవాడు ఒకడు ఈత కొడుతూ లోతులోకి వెళ్ళి మునిగిపోయాడు. ఎవరో యువకుడు బయటకు తీసి, ఇసుకలో పడుకోబెట్టాడు. పిల్లవాడికి స్పృహలేదు.

గుంపులో ఎవరో సుధాకర్‌ని చూశారు. ''డాక్టరు బాబు వచ్చారు'' అంటూ త్రోవయిచ్చారు. సుధాకర్ ఏమీ కంగారు పడలేదు. మామూలుగానే ఉన్నాడు. పిల్లవాడి ప్రక్కనే మోకాళ్ళపైన కూర్చొని నాడి చూశాడు. తర్వాత చేతులు, కాళ్ళు వరసగా పైకి, క్రిందికి ఆడిస్తూ, ఊపిరితిత్తుల లోనికి గాలి వెళ్ళేందుకు ప్రయత్నాలు చేశాడు. క్రమంగా పిల్లవాడి ముఖ వర్ణం మారసాగింది. చిన్నగా కళ్ళు తెరిచాడు.

''అమ్మయ్య!'' అనుకున్నారు జనం. ఆపైన డాక్టర్ జాన్సన్ క్లినిక్‌కి తీసుకువెళ్ళారు పిల్లవాడిని, సుధాకర్ సలహాపైన.

''నాకు ఇందుకే డాక్టరు వృత్తి అంటే యిష్టం... మృత్యుముఖం నించి బయటకు తీసుకు వచ్చాడు ఆ అబ్బాయిని'' అన్నాడు రమేష్.

అవునన్నట్లు తలూపింది ఇందిర.

*       *       *

ఆ రాత్రి రమేష్ తిరిగి హైదరాబాదు వెళ్ళిపోయాడు. సుధాకర్ స్కూటర్‌పైన ఎక్కించుకొని స్టేషన్‌కి తీసుకువెళ్తుంటే, కనుచూపుమేర దాటే వరకు నిలబడి చూశారు ఇందిర, ఉష.

గదిలోకి వచ్చి కూర్చున్నాక ఉష దిగులుగా ఉండటం చూసి, పద్మ దగ్గరకు పిలిచి 'చందమామ' లోని కథ వినిపించసాగింది. ఇందిర కూడా వింటూ కూర్చుంది. కథలో రాజకుమార్తెని మాంత్రికుడు ఎత్తుకుపోవటం, రాజకుమారుడు దేవతవద్ద వరం పొంది, మాంత్రికుడిని ఓడించి, రాజకుమార్తెను తీసుకువచ్చి పెళ్ళి చేసుకోవటం— అన్నీ వచ్చాయి. కథ పూర్తయేసరికి ఉష నిద్ర పోయింది.

పద్మ నవ్వుతూ అంది. "నా జీవితంలోనూ వరం యిచ్చే దేవత తటస్థపడితే బాగుండును— 'మా అత్తయ్య మనస్సు మార్చు తల్లీ' అని కోరుకొనే దాన్ని."

"అది కథ పద్మా! ఇది జీవితం! మధు చూడు, పరిస్థితులు తారుమారయే సరికి నన్ను మరిచిపోయాడు. నన్ను అర్థం చేసుకుంటాడని ఇన్నాళ్ళూ ఏదో మూల ఒక ఆశ ఉండేది. ఇప్పుడెందుకో ఆ ఆశ కూడా సన్నగిల్లుతోంది.

మధు గురించి నీకు ఎన్నడూ చెప్పలేదుకదూ? మా అమ్మ, నాన్న వెళ్ళిపోక ముందు, నాకు పెళ్ళి సంబంధాలు చూసి మధుని వరుడిగా నిశ్చయించారు. అతనికి, అతని కుటుంబానికి కూడా నేనెంతగానో నచ్చాను— ఎంతగా నచ్చానంటే కట్నం కానుకలు ఏమీ లేకుండా చేసుకుంటామన్నారు. కాని మధు నాయనమ్మగారు పోవటంతో, నిశ్చయించిన ముహూర్తానికి మా పెళ్ళి జరగలేదు. కొన్ని నెలలు వాయిదా పడింది. మధు తరచు మా యింటికి వస్తూ ఉండేవాడు. ఇద్దరం బంగారు కలలతో సామ్రాజ్యాలనే ఏలుతున్నంత ఆనందంగా కాలం గడిపాం. సినిమాలకు, షికార్లకు తిరుగుతూ ఉండేవాళ్ళం. ఇంతలో సడన్‌గా ఆక్సిడెంట్‌లో అమ్మ, నాన్న పోయారు..."

ఇందిర కథంతా మవునంగా విన్నది పద్మ.

నీది దురదృష్టం ఇందిరా! కాని మధుని కూడా పూర్తిగా తప్పు పట్టలేం. మామూలు మగవాడిలాగే ప్రవర్తించాడు అతను."

"అతనికే కాని ఏదయినా విపత్తు సంభవించి ఉంటే నేను ఎన్నాళ్ళయినా అతనికోసం ఎదురు చూస్తూనే ఉండేదాన్ని. మరి అతను నా విషయంలో అలా చేయలేకపోయాడెందుకని?"

"ఈ ప్రపంచంలో ఒక్కో మనిషిది ఒక్కొక్క తత్వం. 'నాలాగా అతను ఉండడేమిటి?' అని ప్రశ్నించే హక్కు ఎవరికీ లేదు. ఎవరి తీరు తెన్నులు వాళ్ళవే! అయినా నీవు మధుని మరిచిపోలేనట్లే, అతనూ నిన్ను తలచుకొంటూనే ఉన్నాడేమో! కొన్నాళ్ళు గడిస్తే, అర్థం చేసుకొని తిరిగి నీకు దగ్గర అవుతాడేమో!"

"నిజంగా అలా అయితే ఎంత బాగుంటుంది. పద్మా! నీ మాటలు మళ్ళీ ఏదో ఆశలు రేపుతున్నాయి."

పద్మ చిన్నగా నవ్వి "గుడ్ నైట్ ఇందిరా, స్వీట్ డ్రీమ్స్ టు యూ" అని పక్కమీద వాలింది.

"గుడ్ నైట్" లైటు ఆర్పింది ఇందిర.

పడుకోగానే, కళ్ళ ముందు ఆ సాయంత్రం జరిగిన సంఘటన మెదిలింది. తెలివి తప్పిన బాబుకి స్పృహ తెప్పిస్తున్న సుధాకర్ – ఆ దృశం కనిపించినట్లే అయింది. ఏ పని చేసినా అతను ఎంత తెలివిగా, ఎంత చాకచక్యంగా చేస్తాడు ... అనుకుంటూ నిద్రలోకి జారింది.

*       *       *

రోజులు చకచకా గడిచిపోతున్నాయి. ఇందిర టైపింగ్ పని చురుకుగా సాగిపోతున్నది. సుధాకర్‌తో పరిచయం పెరిగాక, సాయంత్రాలు కూడా అక్కడే ఉండి క్లినిక్ బాగా నడవటానికి సాయం చేస్తోంది ఇందిర. ఒకమారు సుధాకర్ ఉషను తన హాస్పిటల్‌కి తీసుకు వెళ్ళి పరీక్షలు చేయించి, లోపలి జబ్బు పూర్తిగా తగ్గిందనే వార్త తీసుకువచ్చాడు. కాని తిరిగి జబ్బు రాకుండా ఉండటానికి మందులు, బలానికి టానిక్స్ కొన్నాళ్లపాటు తీసుకుంటూ ఉండాలన్నారు డాక్టర్లు.

సుధాకర్‌తో స్నేహం క్రమంగా ఇందిరకు పెరిగింది. క్లినిక్‌లో పని ఎక్కువగా లేనప్పుడు, డాక్టర్ జాక్సన్, సుధాకర్‌లతో కలిసి కాఫీ తీసుకుంటూ, వాళ్ళు ఏవేవో మెడికల్ ప్రాబ్లమ్స్ చర్చించుకుంటూ ఉంటే వినటం ఇందిరకు ఉత్సాహంగా ఉండేది. ఇప్పుడు క్రొత్తగా ఒక నర్స్ కూడా అక్కడ జాయిన్ అయింది. ఆవిడ సరదాగా ఉండే మనిషి. ఆవిడ భర్త ఆ ఊరి పాఠశాలలో మాస్టరుగా బదిలీ అయివచ్చాడు.

ఒక సాయంత్రం ఇందిర టైప్ చేసిన కాగితాలన్నీ సర్ది పెట్టేస్తుంటే ఆ గదిలోకి సుధాకర్ వచ్చాడు.

"ఇందిరా, నా కాగితాలు కొన్ని టైప్‌చేసి ఇవ్వగలరా? తొందరేం లేదు —"

అతను యిచ్చిన కాగితాలు చూస్తూ "ఇప్పుడే టైప్ చేస్తాను ... అయితే 'పీడియాట్రిక్స్' ఎం. డి.కి అప్లికేషన్ పెడుతున్నారన్నమాట!" అంది.

"అవును ఇందిరా! చిన్నపిల్లల జబ్బులు కుదిర్చి, వాళ్ళబాధలు తగ్గించే నేర్పు నాకు ఈ విద్య ఇస్తుంది. అసలు ఎప్పుడో చదివి ఉండవలసింది–" అతని మనసు ఏదో గతంలోకి పోయింది.

తెల్లకాగితాలు టైప్‌రైటర్‌లో బిగించింది ఇందిర, అతని మనసులో బాధ ఏమిటో – అనుకుంటూ.

ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చొని మృదువుగా ఉన్న ఆ చేతివేళ్ళను చూస్తూ అన్నాడు సుధాకర్, "సుందరి వేళ్ళూ ఇంతే ... చాలా నాజూకుగా ఉండేవి ..."

ఇందిర ఏమీ మాట్లాడలేదు. ఇంకా ఏమిటి చెప్తాడా, అన్నట్లు చూసింది.

"హైదరాబాదులో ఎం.బి.బి.ఎస్. చదువుతున్నప్పుడు నాకు పరిచయమైంది సుందరి. నా క్లాస్‌మేట్ రవి చెల్లెలు. ఆ అమ్మాయి చాలా అందంగా ఉండేది. మొదటి పరిచయంలోనే ఆకట్టుకుంది నన్ను. పరిచయం పెరిగిన కొద్దీ, సన్నిహితమైన కొద్దీ, ఆకర్షణ పెరిగి, స్నేహం ప్రేమలోకి మారింది. నా కోర్స్ పూర్తి కాగానే పెళ్ళి చేసుకోవాలనుకున్నాము. వాళ్ళ యింట్లోనూ మాకు ప్రోత్సాహమే యిచ్చారు. సుందరిని ఈ ఊరికి ఒకమారు తీసుకువచ్చి పద్మవాళ్ళకి, జాక్సన్ అంకుల్‌కి పరిచయం చేశాను. అంకుల్ శిక్షణలో పెరిగిన నేను నా చదువు ఇతరులకు ఉపయోగ పడటానికే కాని, కేవలం ధనార్జనకు కాదని భావించేవాడిని. నా ఆశయాలన్నీ సుందరికి వివరిస్తూ ఉండేవాడిని. తనూ నాతో ఏకీభవిస్తున్నట్లే మాట్లాడేది....

(ఇంకా వుంది)






# నవ్విపోదురుగాక...!



## ఏ. యస్వీ. రమణారావు.

రెండేళ్ళక్రితం ... ... ... ... నేను ఈ ఊరు బదిలీ అయి వొచ్చిన్నాటికి ... ... రామ చంద్రరావుగారికింకా పెళ్లి కాలేదు.

ముక్కూ మొహంవూ తెలియని ఈ వూళ్లో అడుగు పెట్టీ పెట్టగానే మొట్టమొదట పరిచయ మయిన్దీ; క్షణాల్లో ఆ పరిచయం ఆత్మీయమై ప్రగాఢమైన స్నేహంగా రూపొన్దిన్దీ... రామ చంద్రరావుగారొక్కర్తోనే.

అప్పటికీ... ... ...

'ఇంత జరిగినా'

ఇప్పటికీ... ... ...

'నా మట్టుకు నాకు'

స్నేహితుడూ, గురువూ, మార్గదర్శీ; నా జీవితంలో... రామచంద్రరావుగారొక్కరే. మన్నిస్తున్నంత మాత్రాన; వయసులో పెద్ద తేడా ఏం లేదు మా యిద్దరికీ. మహాయితే; ఏడాదో ఏణ్ణర్ధంవో నేనాయనకన్నా చిన్న.

ఎంచాతో మరి; 'మీరు'ని దాటి 'మీర' లేదు సంబోధన ఇట్నుంచి అట్నుంచీనూ; ప్రాణంలో ప్రాణంగా కలిసి మసిలినప్పటికీ. ఏ విషయంలో కాని అరమరికన్నదే ఎరగని అరుదైన స్నేహం, గడిపినన్నాళ్ళూను. ఈ మధ్యనే... నాన్నెల్లవు తోందనుకుంటాను... మా యిద్దరి మధ్యా... ... 'కల్యాణి' అడుగు పెట్టిన్తర్వాత కూడా...

మా 'స్నేహం' అణుమాత్రంవూ పడల్లేదు సరికదా... ఇదుగో 'ఊహించని' ఈ 'తుఫాను' వొచ్చీదాకా...

ఇద్దరికి ముగ్గురయి; ఆ అనుబంధం మరింతగా అల్లుకుంది తీవెలు సాగి పూలుపూసీ.

చిత్రం ఏవిటంటే... ...

రామచంద్రరావుగారికన్నా చాలా కాలం ముందు నా జీవితంలో తటస్థపడింది 'కల్యాణి'. ఆ అమ్మాయిది మా ఊరే. మా యిద్దరిళ్లూ పక్క పక్కనే. ఏదోవరస కోసం తీగెలులాగి కలుపుకున్న చుట్టరికం మాట అటుంచి అంతకు మించిన ఆత్మీయతా భావం మా రెండు కుటుంబాల మధ్యా ఎన్నో ఏళ్లుగా. కల్యాణి నాకన్నా నాలుగేళ్లు కాబోలు చిన్న. నేను బియ్యేవొడ్డెక్కిన్నాటికి, కల్యాణి ఇంటర్లోకొచ్చిన్ది. బ్రహ్మాండమైన మార్కులెత్తుకుని సెకన్డ్ పాసయిన పిల్లకి అక్కడితో చదువు ఆపేస్తాంవంటూ మూర్ఖప్పట్టు పట్టుక్కూర్చున్న ఆ అమ్మాయి తండ్రితో యుద్ధంచేసి ఆ అమ్మాయిని ఇంటర్లో జాయిన్చేయించటానికి మా నాన్నగారు పడ్డ అవస్థ. నాకు జ్ఞాపకం. ఉద్యోగం సద్యోగం లేకుండా ఏడాదిపాటు మా ఊరి రోడ్లు సర్వేచేస్తూ నేను బలాదూరుగా తిరిగిన రోజుల్లో; చదువుతోపాటు, అప్పుడే వయసులోకికూడా ప్రమోట్ అయిన కల్యాణి నా శిష్యురాలు. 'ప్రపంచపు తీరు' మీద అప్పుడప్పుడేవో అవగాహన ఏర్పడుతోన్న వయసు నాది. ఎదిగీ ఎదగని జ్ఞానంతో, తొలి కిరణపు తాకిడికి రేకలు విప్పుకునే మొగ్గవయసులో కల్యాణి. లేలేత వెన్నెల సోయగంతో సొగసులు దిద్దుకుంటూ, ఆకు ఆకునా పువ్వు పువ్వునా తళతళలాడే మంచు బిందువులా; చిరుగాలి తాకిడికి చిటారుకొమ్మల పరవశించే చిగురాకు కదలికలా; ఉషోదయపు అలికిడికి ఉలిక్కిపడ్డ తెలిమబ్బు తొలినవ్వులా; ప్రకృతి సౌందర్యాలన్నిటినీ కలబోసి నింపుకున్న విశాలమైన కళ్లల్లోంచి వొలికే వెలుగులు, ఎర్రటి పెదవులపై మెరిసే వెలుతురు పువ్వుల నవ్వులై ముగ్ధమనోహ రంగా స్నిగ్ధ సుకుమారంగా వుండే కల్యాణి; ఆ రోజుల్లో నాకు ఆకర్షకమైన కాలక్షేపం. ఒక్క రోజు కనపడకపోతే తోచని స్థితిలో ఏడాదిపాటు కల్యాణితో గడిపిన రోజులు నా గుండెల అట్టడుగున పదిల పరుచుకున్న మధురమైన జ్ఞాపకాలు. చదువుతోపాటు సంగీతమూ, సాహిత్యమూ; గంటల తరబడి సాగే మా కాలక్షేపపు ముచ్చట్లు. మా అత్యంత సాన్నిహిత్యానికి వో నిర్వచనం ఏర్పడే లోపల, ఎదురుచూస్తున్న ఉద్యోగం రావడం; నేను మా ఊరు విడిచిపెట్టేసాను. ఉద్యోగంతో ఊళ్లుపట్టి పోయిన నాకు, నాలుగేళ్లవరకూ మా ఊరి మొహం చూట్టంవే పళ్లేదు. అప్పుడేనా, మా ఊరెళ్లడాని క్కారణం రామచంద్రరావుగారు పట్టినపట్టు.

తమాషా ఏవిటంటే ...

మా వూళ్లో కొచ్చేన్తవరకూ;

రామచంద్రరావుగారు చూడబోయే అమ్మాయి కల్యాణేని నాకు తెలియకపోవటం.

నాలుగేళ్ల తర్వాత మళ్లీ కల్యాణిని, రామచంద రావుగారి పెళి చూపుల్లోనే, చూట్టంపడిన్ది.

నేనెరిగిన వెలుతురు మొగ్గ సహస్ర కిరణాల కాంతుల్ని అణువణువునా పొదుగుకుని విరిసిన ముద్ద మందారంలా, ముగ్ధసింధూరంలా, మచంద్రరావు

గారి నిర్ణయం కోసం తలవంచుకుని, అప్పుడే తెంపి తెచ్చిన ముద్దబంతి పువ్వులా, కూర్చున్న కల్యాణిని చూసి; ఆత్మీయతతో, అవ్యాజమైన అనురాగంతో, నా గుండె తడిసి ముద్దయిపోయింది. మా రామ చంద్రరావుగారి మంచి మనసుకి కల్యాణిలాంటి అమ్మాయి తోడుకావటం, ఇద్దరికిద్దరూ చేసుకున్న అదృష్టంవేసుకున్నాను మొట్టమొదటి క్షణంలో.

కల్యాణిన్చూసిన వెంటనే వో నిర్ణయానికి రాలేకపోతే, ఎవడికయినా, వాడి జీవితంలో వాడికి, పెళ్లి అనేది శుద్ధదండుగయిన విషయం.

తిప్పకుందామన్నా కళ్లు తిప్పకోలేనంత అసభ్యతకి ఏ మగాణ్ణయినా లోనుచేసేంత అద్భుత మైన సౌందర్యం కల్యాణిది.

రామచంద్రరావుగారికీ, కల్యాణికీ, పెళ్లి చూపులనే తతంగం 'ఆదే ప్రారంభం.

పెళ్లిచేసుకోవాలన్న నిర్ణయం వొచ్చిరాగానే, ఏర్పాటయిన మొదటి పెళ్లిచూపుల్లోనే, అంత అందమైన అమ్మాయి తటస్థపట్టంతో, ఎగిరి గంతెయ్యలేదుగాని అంత పనీచేసారు రామచంద్రరావుగారు, పెళ్లిచూపులయాక మా యింటికొచ్చి.

కళ్యాణి 'అదృష్టవంతురాలు' అనుకున్నాను రామచంద్రరావుగారి నిర్ణయం విన్న క్షణంలో.

రామచంద్రరావుగారి హడావిడి ఇంతా అంతా కాదు. ఏ విషయం కయినా వొక్క నిముషం ఆలస్యం చేయనిస్తేనా ? ఉదయం చూట్టంవూ, మధ్యాహ్నం మాటాడుకోటంవూ, సాయంకాలంకల్లా తాంబూలాలు పుచ్చేసుకుని ముహూర్తాలు నిర్ణయం చేసుకోటంవూ క్షణాలమీద జరిగిపోయాయి ఆ వొక్క రోజులో.

నెల తిరక్కుండా పెళ్లీ అయిపోయింది.

ఇట్నుంచీ అట్నుంచీ కావలసినవాణ్ణవటాన్న; పెళ్లికి రెండువేపులా పెత్తనం అంతా నాదే. నా సలహా లేకుండా, నన్ను సంప్రదించకుండా, పెళ్లి మొత్తంలో ఎంత చిన్న వ్యవహారంవూ జరగలేదు. పెళ్లయిన వారంకల్లా; కొత్త దంపతులకి, ఇల్లు చూట్టం దగ్గిర్నుంచీ కొత్త కాపరంకి కావల్సిన సరంజామా అంతా నా చేతులమీదే ఏర్పాటయింది. భార్యాభర్తలు కొత్త ఇంట పాలు పొంగించినపూట, వాళ్ల కాపరంలో విస్తరేసిన మొట్టమొదటి అతిథిన్నేనే.

అలా; మా రామచంద్రరావుగారి భార్యయినంత మాత్రంచేత, చిన్నప్పణ్ణుంచీ ఎంతో చేరికయిన కల్యాణిని 'ఏవండీ'నిగాని 'మీరూ'నిగాని పిలవటం ఎందుకనోమరి ఎంతో ఎబ్బెట్టుగామా, చాలా కృతకంగామా అనిపించింది. ఆ చిన్న విషయానికి వో ప్రాముఖ్యం ఇవ్వటం మాటటుంచి, దాన్నిగురించి పట్టించుకోనేలేదు రామచంద్రరావుగారు. ఆ దృష్టే లేదు కల్యాణికి.

కాపరం మొదలెట్టిన నాల్రోజులిక్కాబోలో రోజు రాత్రి భోజనం చేసి హోటలు మెట్లు దిగుతో, సాయంకాలపు షికారునుంచి తిరిగొస్తోన్న కొత్త దంపతుల కెదురుపడేప్పటికి, రామచంద్రరావుగారి కేం ఆలోచనొచ్చిందోమరి —

"రేపట్నుంచి మీరు మాతోపాటే మా యింట్లోనే వుంటారు" అన్నారు నన్ను చూస్తూనే.

ఆయనేదో మాటవరస కన్నట్టుగా ఎంచి తేలిగ్గా నవ్వేసాన్నేను.

"మేం సీరియస్‌గానే చెప్తున్నాం" 'కదు కల్యాణి' అన్నట్టు భార్యవేపు చూస్తూ అన్నారాయన.

"అవునండీ...అయినవాళ్లం మేం వుంటోండగా ఈ దిక్కుమాలిన హోటలు కూడు ఇంకా తినటం ఏం బావోలేదు." భర్త ప్రతిపాదనని సమర్థిస్తూ అన్న కళ్యాణి మాటలకు;

"అనవసరంగా శ్రమెందుగ్గానీ... ఇంకేవన్నా కబుర్లు చెప్పండి..." అని తప్పించుకోబోయాను.

"షడ్రసోపేతమైన హోటలు భోజనం వొదులుకుని మాతో చారూ మెతుకులు తినటం మీకు శ్రమే మరి..." నిష్ఠూరంగా అంటోన్న కల్యాణిని అడ్డుకుని;

"అదికాదు కల్యాణీ..." నచ్చచెప్పబోతున్న నన్ను మరి మాటాణ్ణీకుండా;

"ఇంక మరేం చెప్పకండి సోది. తెల్లారేసరికి, మీరు మీ పెట్టెబేడాతోసహా వొచ్చి మా ఇంట్లో వుంటారు. మీకోసం ముందు గది ఖాళీ అయి సిద్ధంగా వుంటుంది. అంతే. పద కల్యాణీ..." అంటూ వెళ్లిపోయారు నన్నలా రోడ్డుమీదొదిలేసి.

మొండికేస్తే, రామచంద్రరావుగారి సున్నితమైన మనస్తత్వం ఏ విపరీతంకి దారితీస్తుందో; ఆయనతో రెండేళ్ల సన్నిహితత్వంలో నేను బాగా ఎరిగున్న విషయం. ఆయనతో వ్యవహారాలలానే వుంటాయి. ఏ నిర్ణయానికీ అంత తొందరగా రారాయన. వొచ్చేరా ఏమాత్రం తేడాపాడా వొచ్చినా నిలదొక్కుకోలేరాయన. ఆ గాయం నుంచి వొకంతట తేరుకోలేరు. చాలా అనుభవాలే అయాయి నాకు. ఏవయితే అదయిందని, మొండికెత్తి, వాళ్ల నిర్ణయానికి తలవొగ్గకుండా వుంటే... మా జీవితాల్ని ఊహించని మలుపులకు తిప్పే... ఈ సంఘటన... జరిగుండేది కాదేవో ననిపిస్తోందిప్పుడు.

ఊహించలేకపోయాం ముగ్గురిలో ఏ వొక్కరంవూ.

రామచంద్రరావుగారిని నొప్పించకూడదనే కారణం వొక్కటే; ఆ తెల్లారేసరికి వాళ్లిద్దరి మధ్యకీ నన్ను లాక్కెళ్లింది.

నా రాకతో, రామచంద్రరావుగారి మొహంలో సంతోషంవూ... కల్యాణి కళ్లల్లో వెలుతురూ గమనించాను, వొచ్చిన మొదటి క్షణమే. పాలూనీళ్లల్లా కలిసిపోయాం ముగ్గురికి ముగ్గురంవూ.

ఆ నెలాఖర్న మాత్రం చిన్న పేచీ వొచ్చింది.

ఇద్దరికిద్దరూ ఏకంవయి నా నోరు మూయించాలన్చూసారు.

అక్కడ మాత్రం బెసకలేదు నేను.

చిన్నసైజు యుద్ధం తర్వాత, నన్ను 'పేయింగ్ గెస్టు'గా వొప్పించగలిగాను చివరికిద్దర్నీ.

బస్. ఆ అంగీకారం కుదిరిన మరుక్షణం నుంచీ ఆ దృష్టేలేదు మాలో వొక్కరికీ.

ఏ విషయంలోగాని ఎలాటి అరమరికల్లేవు మా మధ్య.

వొక్కరాత్రి పడుకునేటప్పుడు తప్ప అస్సలు ఎడవనేదే లేదు.

కబుర్లు, షికార్లు, సినిమాలు, వోహ్... రోజులకి రోజులు తెలీకుండా. సరదాగా ఏదైనా విషయంలో చర్చ అంటూ మొదలెడితే, వాదనే వొస్తే, కల్యాణీ నేనూ వో పక్షం అయిపోయి, రామచంద్రరావుగార్ని పూర్వ పక్షం చేస్సే వాళ్లం.

నేను లేకుండా భర్తతో వాదనలోకే దిగేది కాదు కల్యాణి.

చాలా విషయాల్లో ... చెప్పకేం... రామచంద్రరావుగారి పాయింట్ సబబుగా వుండేది. పూర్వాపరాలాలోచించిగాని... ఏ విషయంలోనూ... వో నిర్ణయానికి రారాయన. ... ఇదిగో... ఇప్పుడు అయన తీసుకున్న... ఘోరమైన నిర్ణయంలో తప్ప... అసబబుగా ప్రవర్తించేది లేదెప్పుడూ ఆయన. కల్యాణిది వొఠి మొండి వాదనా, ఊక దబాయింపూనూ; ఎంత చిన్న విషయం కానీ...తన జీవితమార్గాన్ని తనే నిర్ణయించుకోవాల్సొచ్చిన వొక్క ఈ దుర్ఘటనలో తప్ప. కల్యాణిని సమర్థించుకొచ్చి ఆమె మొండివాదనలో ఆమెన్నెగ్గించటానికి నాకు తలప్రాణం తోక్కొచ్చేది. విచిత్రం ఏంవిటంటే, తన వాదనలో ఎంతో బలంవున్నప్పటికీ, చివరికొచ్చే సరికి, భార్య ముందు వోడిపోయే వారాయన. ఆ సంగతి పసిగట్టిన నా వేపు 'అదంతే'న్నట్టు చిరునవ్వుతో చూసేవారాయన. వోడిపోవడం వో ముచ్చట కొంత మందికి.

నా ఆసరా చూసుకుని తెగ దబాయించేది ఆయన్ని కల్యాణి.

అతిలోక సౌందర్యంగా వుండే పెళ్లాంతో పేచీ పెట్టుకోవటం వో సరదా ఆయనకి.

తన మాట నెగ్గించుకుంటున్నంత మాత్రాన, భర్త ఎడల ఏ మాత్రం చులకన భావం కన బరిచేది కాదు కల్యాణి. సరదా కోసంవే వాదన. కాలక్షేపం కోసంవే పేచీ. ఊసుపోవడం కోసంవే తగూలాట.

ఆ గడిచిన క్షణాలన్నీ గుండెల అడుగున దాచుకున్న మధురజ్ఞాపకాలు.

అలా కాలం కదలకుండా నిలబడిపోతే...

ఆ స్వర్గం తొణక్కుండా శాశ్వతమయిపోతే...

ఆ వరం వొక్కటి తప్ప మరేవీ కోరుకోకుండా...

సాగిపోతోన్న మా జీవితాలని...

ముచ్చటగా మూణ్నెల్లు కాకుండానే ఊహించని మలుపుకి తిప్పి; తిరిగి మరి జన్మలో బయటకు రాలేని సుడిగుండంలోకి; రామచంద్రరావుగారిని నిర్దాక్షిణ్యంగా తోసేసి పోయింది కాలం.

ఏ మలుపు అయినా బ్రతుకుని అందల మెక్కిస్తే బాధలేదు అగాధంలోకి తోసేస్తేనే తప్పు.

ఆ అగాధంలోకి నన్ను తోసేసి పోయినా ఇంత బాధ వుండేది కాదు.



## నవ్విపోదురుగాక ..

'నా' కారణంగా రామచంద్రరావు గారి జీవితం తల కిందులవుతుందన్నది నేనూహించనిది. తెలిసుంటే 'వాళ్ల' జీవితాల్లోకి చొరబడుండే వాణ్ణి కాదు.

సులువుగా కల్యాణి తట్టుకోగలిగింది కానీ... ఊహించని సంఘటనకి ఒకంతట నిలదొక్కుకోలేకపోయినా... ఇద్దరికిద్దరమూ... ఆ క్షణం తీసుకున్న కఠినమైన నిర్ణయాన్ని చాలాసేపు సమర్థించలేకపోయాను, నేను. అంతగా ప్రాణంలో ప్రాణంలా మసిలిన రామచంద్రరావుగారి మూర్ఖమైన పట్టుదలని; వ్యతిరేకించటానికి గల వొక్కే వొక్క కారణం;

కల్యాణి జీవితం తెగిన గాలిపటం ఐ సంఘపు కోరల్లో చిక్కుకో కూడదనే !... నడవడికలో, జీవన విధానాల్లో, ఆలోచనల్లో, అలవాట్లల్లో, ఆచరణల్లో; రామచంద్రరావుగారిని 'మార్గదర్శకంగా' ఎంచుకున్న నేను; నాకు కాబోయే భార్యనెన్నుకునే విషయంలో కల్యాణిని 'ఆదర్శంగా' తీసుకోడంవల్ల;

---

## దేహం - దేశం

శరీరాంతర్భాగాలనే చూడండి
నిజానికి చూడలేరనుకోండి
గుండె—మూత్రపిండాలు—జీర్ణకోశం... అన్నీ
మంచినే స్వీకరించి
చెడును తృణీకరించే
బహుసాత్వికులు
మరి... శరీరాన్ని... శాసించేది ?
సాత్వికులు కావు
చెడుకు తఱచు తలవంచే
చంచలమైన — మనస్సు !
దేశముగతీ... అంతే
దేశంలో మేధావులగతీ ఇంతే.

— నల్లాన్ చక్రవర్తుల శేషాచార్లు

---

నా కోసం నడుంకట్టుకుని, మావాళ్లు తీసుకొస్తున్న, సంబంధాలొక్కటీ, నచ్చట్లేదు నాకు. చూసిన ఏ అమ్మాయన్నా నా 'ప్రామాణికం'కి, కనీసం దగ్గరగా వున్నా, నా పెళ్లెప్పుడో అయిపోయేది. 'ఈ జన్మకిహ వీడికి పెళ్లవదు కాబోలు' నన్నస్థితికి, విసుగెత్తిపోయారు మా వాళ్లంతా. పట్టువదలని విక్రమార్కుడిలా, సాగిస్తూనేవున్నాను పెళ్లి చూపుల తతంగాలు.

ఆరోజు .........

నా సహనాన్ని మరోసారి పరీక్షించిన వో పెళ్లి చూపుల వ్యవహారాన్ని ముగించుకుని మా పూర్నుంచి వొచ్చిన్నన్ను గుమ్మంలోనే అడ్డుకుని;

''కాయ ? పండా ?'' ని, ఎప్పట్లానే అడిగిన కల్యాణిని చూసి;

''కాయా'' పాత పాటే పాడుతూ, లోపలకొస్తోన్న, నా వెనకే విసురుగా వొచ్చి;

''ఇంకా ఎందరమ్మాయిల్ని చూస్తారు మహాప్రభూ ?'' విసుగ్గా అడిగింది కల్యాణి.

''ఏం చెయ్యన్మరి ? నాకు నచ్చిన అమ్మాయింకా కంటబడన్దే'' అన్నాన్నవ్వుతూ.

''ఎవరా ఊహా ఊర్వశి మహానుభావా ?''

''ఊహ కాదు. ఉద్దేశంలో వున్న అమ్మాయి కోసంవే నా వెదుకులాటంతా.''

''దొరక్కపోతే ?''

''పెళ్లికాపోతే వొచ్చిన్నష్టంవేం లేదు''

''పెళ్లిళ్లు చేసుకున్న మొగధీరులంతా, కాకముందు ఇలా ప్రగల్బాలు పలికిన వాళ్లే.''

''చూస్తూ వుండలా''

''చూడకేంగానీ ... మీ ఉద్దేశాల్లో ఊపిరి సలపకుండా నలిగిపోతోన్న ఆ అమ్మాయి పోలికలేవిటో చెప్పండి మహాశయా ... కళ్లల్లో కాగడాలు పెట్టుకున్నేనూ వెతుకుతాను.''

''పోలికల్చెప్పటం ప్రారంభిస్తే వో పెద్ద కావ్యమే అవుతుందది.''

''కావ్యం చదవొద్దుగాని ఆ కావ్యనాయిక ఎవరో చెప్పండి బాబూ''

''చెప్పాకా ... పారిపోవు కదా ?''

''అంత భయంకరంగా వుంటుందా మీ కథానాయికీ ?''

''అసూయపడతావేవోనీ''

''అసూయపడేంత అందమైన ఆ అమ్మాయి ఎలా వుంటున్దేవిటి ? ఎక్కడున్దేవిటి ?''

''ఇక్కడే''

''ఇక్కడా ?''

''ఊఁ నాకళ్లల్లో''

''ఎవరో చెప్పండి బాబూ, చంపకా''

''నేను చేసుకోబోయే అమ్మాయి, రూపంలో... గుణంలో... లక్షణాల్లో... చెప్పేయనా...?''

''ఊఁ వేగం...''

''మా కల్యాణిలా .........''

నా మాటింకా పూర్తికాలేదు;

అంతవరకూ మా సంభాషణంతా, మాక్కనబడకుండా, వరండాలో పొంచుండి వింటోన్న; రామచంద్రరావుగారు హఠాత్తుగా లోపలకొచ్చారు.

''అదేంవిటి ... మీరింకా ఇంట్లోనే ఉన్నారనుకున్నాను ......''

ఆయన్ని చూడగానే ... చాలా అనాలోచితంగా అన్న నా వంక తీక్షణంగా చూసి ; మౌనంగా లోపలికెళ్లిపోయారు రామచంద్రరావుగారు.

ఆయన ఆ సరికొత్త ప్రవర్తన మొట్టమొదటిసారిగా గమనించిన నేనూ, కల్యాణి క్షణంసేపు నిశ్చేష్టులం అయిపోయాం.

ఆయనలో ఆ 'పురుగు' అంతకుముందే ప్రవేశించిందన్న విషయం తరవాత్తర్వాత్తెలిసింది. ఆ రోజు మా సంభాషణ, దాని 'ఉనికి'ని మరింత విస్తృత పరిచింది.

''విన్నారా ... మన ఔరంగజేబుగారు మరో దండయాత్ర కొట్టొచ్చే ...''

మరుక్షణంలో మామూలుగా అయి, ఆయన

వెనకే లోపలకెళ్తూ అంటోన్న కల్యాణిని ఇంకో మాట మాట్లాణ్ణీకుండా;

''ఆ కథలన్నీ వింటూ కూర్చోటానికిక్కడెవరూ తీరిగ్గా లేరుగానీ ముందు నాకు భోజనం వొడ్డించు'' కల్యాణితోనేకాదు ... ఎవరితోన్నా ... రామచంద్రరావుగారంత కఠినంగా మాటాడుతోండగా వినటం అదే మొదటిసార్నాకు.

''ఏవయిందిప్పుడూ ? ఎందుకంత చిరాకూ?'' అడుగుతోంది కల్యాణి.

''ప్రతిదానికీ నీకు సంజాయిషీ చెప్పుకోవాలా ఏం ? వొడ్డించు వేగం నా కవతల పనున్ది.''

''వొడ్డించటానికీ, నేనింకా వంటే మొదలెట్లేదు.''

''పెత్తనాలు మొదలెట్టావుకదా, నీకింకేం గుర్తుంటుందీ ?''

''ఆదివారాల్లో వొంటిగంటక్కాని భోజనం చెయ్యని మీరు పదకొండన్నాకాకండా వొచ్చి వొడ్డించీ మంటారన్నే నూహించనా? బైటికెళ్ళేముందేవన్నా చెప్పెళ్ళారా?''

''ప్రతీదీ నువ్వు చెప్పే చేస్తున్నావా ?''

''చెయ్యకూడని పన్లేం నేన్చెయ్యటం లేదు. అయినా నేనన్నదేవిటీ ? మీరడుగుతోన్దేవిటీ ?''

''అనవసరంగా వాగక. నా కసలే చిరాగ్గా వుంది.

రామచంద్రరావుగారంత కఠినంగా మాట్లాడ గలరని కలలోకూడా ఊహించన్నేను అక్కడ ఇంకో క్షణం వుండలేకపోయాను. వున్నవాణ్ణున్నట్టు లేచి బయటకొచ్చేసాను. ఏం చెయ్యాలో తోచక, చిరాగ్గా నిలిచినచోట నిలబడలేక, ఊరంతా తిరిగాను చాలా సేపు. చాల్రోజుల్తర్వాత, అడుగుపెట్టేన్నన్నుచూసి, హోటలు ప్రొప్రయిటరు ఆశ్చర్యపోయాడు. భోజనానికోటిక్కట్టియ్యమనడిగినప్పుడయితేమరీనూ.

సహించని అన్నం కెలుకుతూ కూర్చున్ననన్ను;

''ఇదేవిటి మళ్లీ హోటలు పట్టేవూ ?''

నా వ్యవహారాలన్నీ బాగా ఎరిగున్నవాళ్లు టేబుల్ దగ్గరకొచ్చి, మొహంలో మొహంపెట్టి మరీ, పలకరింపుగా అడిగినప్పుడు; జీవంలేని వో నవ్వు వాళ్లకి సమాధానంగా నవ్వి, లేచి, చేతులు కడుక్కొని, బైటికొచ్చేసి, కొంతదూరం వచ్చేసాక, టేబుల్ మీద కళ్ళద్దాలు మరిచిపోయానన్న సంగతిగుర్తొచ్చి, మళ్లీ హోటల్లోకి వెళ్లి, భోజనాలకోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన గదిలో కదుగుపెట్టబోతోవుండగా, ఆ చిన్నగదిలోంచి, ఇందాకట్లా పలకరించిన ఇద్దరిలో ఒకడు ...

''పూర్వాశ్రమంలో ఆ రామచంద్రరావుగాడి పెళ్లాం వీడి ప్రియురాల్ట గురూ. వీడిదీ దాన్దీ వొకే వూర్లే. వీడితో కొంతకాలం గ్రంథం సాగించిన్తర్వాత, ఏవయిన్దో మరీ, ఈ రామచంద్రరావుగాడితో పెళ్లయింది. వాడూ వీడూ బంకలా అంటుకు తిరుగుతార్లే. ఆ రామచంద్రరావుగాడో మఫ్. మొగుణ్ణడ్డం పెట్టుకుని పాతప్రియుడితో వ్యవహారం సాగిస్తోన్నది. దాన్ని మధ్యలో పెట్టుకుని తెగ తిరుగుతార్లే వీళ్లిద్దరూ. ఆ మధ్యోరోజు సినిమాలో చూసాన్లే దానికి వాడటూ వీడిటూ. ఇంటర్వెల్లో పెళ్లాన్ని వీడికప్పచెప్పేసి వాడెళ్లి పోయాడు గురూ. వెనకసీట్లోనే వున్నానేవో. వీళ్లు మరి సినీమా చూశ్లేదనుకో. వొకళ్లమీద కొకళ్లు వాలిపోయి, అంటుకుపోయి, సాగించిన సరసాలు చూడాలీ ... '' వింటున్న నాకు నరనరంలో రక్తం మరిగిపోయింది. ఆ కారుకూతలు కూస్తున్న వాడిని అక్కడికక్కడే తవ్వి పాతేద్దామన్నంత కోపం గుండెల్లోంచీ తన్ను కొచ్చింది.

''వీడికి పెళ్లి పెటాకులూలేవా ?'' అవతలి వాడు అడిగిన్దానికి;

''కొబ్బరి ముక్కలాంటి గుంట అప్పనంగా దొరుకుతూ వుంటే పెళ్లెందుకురా పెదనాన్నా'ని...'' అంతే నాకు మరి వొళ్లు తెలీ లేదు. వాడి రక్తం కళ్లచూడాలని, గదిలోకడుగు పెట్టేసరికి...

''వొచ్చారాసార్... ఇదిగో మీ కళ్లజోడు... తీసి పెట్టుంచాన్సార్.'' అంటూ సర్వరడ్డొచ్చాడు. ఆ మాటలకి, నోటికొచ్చినట్టు పేలుతున్నవాడు వెనక్కి తిరిగి నన్ను చూసేసరికి, వాడి మొహంలో రక్తం ఇంకిపోయింది. వాణ్ణి కొట్టినా, రోడ్డున మొరిగే కుక్కని కొట్టినా, వొకటే ననిపించి, ఆ వెదవ్వంక అసహ్యంగా చూసి; నా వివేకం కోల్పో కుండా కాపాడిన సర్వరు వంక కృతజ్ఞతతో చూసి, కళ్లజోడందుకుని బయటకు వచ్చేసాను.

బుర్రని దొలిచేస్తోన్న ఆలోచనలతో, ఏం చెయ్యాలో తెగక, తిరుగుతోనే వున్నాను ఊరంతా. ఎదురుపడ్డ వాళ్లంతా 'శంకిస్తున్నట్టే' చూస్తున్నట్టనిపించారు. వేలెత్తి హేళన చేస్తున్నట్టే కనిపించారు. తుచ్ఛమైన భావాలకు తావులేని పవిత్రమైన మా ముగ్గురి 'అనుబంధానికీ' ఎన్ని చిలవలు పలవలు కల్పిస్తోందీలోకం అని చుట్టూ మసిలే ప్రపంచం మీద ఖాండ్రించి వుమ్మేయ్యాలన్నంత అసహ్యం ఏర్పడింది మొట్టమొదటిసారిగా. లోకం మాటలావుణ్ణీ. మనసావాచా నా స్వభావాన్ని అణువణువునా ఆకళింపు చేసుకున్న రామచంద్రరావుగారు కూడా లోకం దృష్టితోనే చూస్తున్నారన్న తలంపు వొచ్చినప్పుడల్లా బాధతో దహించుకుపోయాను. స్వచ్ఛమైనపువ్వులా, లోకమెరుగని పాపనవ్వులా, ఏపాపవూ ఎరగని 'కల్యాణి' మీద అనుమానాన్ని పెంచుకో కలిగేంత అవివేకపు స్థితికి రామచంద్రరావుగారూ దిగజారిపోయారాన్న ఆలోచనకలిగినప్పుడు నిలువెల్లా కంపించేపోయాను. ఇంకా ఉపేక్షించి కల్యాణి మనుగడని మరింత సంక్లిష్టం చెయ్యడానికి ఇంకోక్షణం అయినా వొప్పుకోలేదు మనసు. వెంటనే వాళ్లిద్దరి మధ్య నుంచీ తప్పుకోవాలి. అంతేకాదు; రామచంద్రరావుగారి అనుమానపు కోరలు వాడెక్కకముందే, వాటి బారినపడి కల్యాణి బ్రతుకు ఛిన్నాభిన్నం కాక ముందే; నా 'ఆదర్శాన్ని' 'అభిమతాన్ని' పక్కకు బెట్టి తక్షణం, ఎలాంటిదోలాంటి అమ్మాయితో నా పెళ్లి జరిగిపోవాలి వారం తిరిగే లోపల. ఆఫీసరు కాళ్లూ వేళ్లూ పట్టుకుని బతిమలాడయినా ఈ వూర్నుంచి ట్రాన్స్ఫర్చేయించుకు, నా ఉనికే తెలియనంత దూరం వెళ్లిపోవాలి.

ఆలోచన అక్కడికి తెగిన మరుక్షణంలో, మరో క్షణం ఆలశ్యం చెయ్యకుండా ఇల్లు చేరేటప్పటికి, చాలా రాత్రయిన్దారోజు.

భార్యా భర్తలప్పటికింకా పడుకోలేదు.

వీధి గది తలుపులు తీసుండటం మూలాన్న, పిలవ్వల్సిన అవసరం లేకుండా, నా గదిలోకొచ్చి, లైటువేస్తే నేనొచ్చినట్లు తెలుస్తుందని, చీకట్లోనే బట్టలు మార్చుకుంటున్నాను...

''అతనొక్కక్షణం ఈ ఇంట్లో వుంటానికి వీల్లేదు...వీల్లేదు...వీల్లేదు.'' రామచంద్రరావుగారి గొంతు వీధిలోకి వినపడేటంత బిగ్గరగా.

''ఆ ముక్కేరాగానే చెప్పండాయన్తో'' పరిశీలనగావింటే తప్ప వినపణ్ణంత నెమ్మదిగా, కల్యాణి.






''నాకేం పట్టలేదు చెప్పటానికి.''

''రా రమ్మని పిలిచిన్ది మీరా? నేనా? పిలిచిన వాళ్లే చెప్పాలి పొమ్మని''

''నాకదన్నా తెలీదు.''

''నాకూ తెలీదయితే.''

''తెలీదంటే నమ్మట్లేదు లోకం.''

''ఇప్పటికీమాట చాలాసార్లన్నారు మీరు... ''

''నేననటంకాదు... లోకమంతా కోడై కూస్తోంది...''

''లోకంతోపాటే మీరూనా ?''

''నిప్పు లేకుండా పొగ రాదుకదా...''

''నిజంగా నిప్పే గనక వుంటే... వుట్టి పొగ కాదండీ... ఆకాశాన్నంటే మంటే లేస్తుంది... ఆ అగ్నిశిఖ ముందు నిలబడే దమ్ముండదు మళ్లీ ఈ లోకానికి. ఎవళ్ల అంతరాత్మని వాళ్లు మోసం చేసుకోకుండా పవిత్రంగా వున్ననాడు... ఈ లోకం కూసే కారుకూతల్ని లెక్కచెయ్యక్కర్లేదు.''

''తెగించినవాళ్లకు ఎవడేం అనుకుంటే ఏం ఖాతరూ... ?''

''తెగించటం అంటే అర్థం... నిజంగా 'తెగించినప్పుడు' తప్పు తెలీదండీ.''

''తెలియచెయ్యడానికే సిద్ధపడ్డావన్న మాట చివరకి...''

''సహిస్తున్నకొద్దీ... ఆ సహనాన్నింకా పరీక్షిద్దామనుకుంటున్నావన్నమాట...''

''చూస్తే... చూస్తే ఏం చేస్తావు... ఏంచేస్తావే... బరితెగించి వాణ్ణి తీసుకుని లేచిపోతావా...''

''ఆపండి... ఆపండి... ఆపండి. ఈ ముక్కే మరొక్కళ్లెవళ్లేనానుంటే... వాళ్ల రక్తం కళ్ల చూసేదాన్ని... తాళి కట్టిన భర్త అయిపోయారు గనకా, ఇంకా ఆ సంప్రదాయాన్ని గౌరవిస్తున్నాను. అంత మాట అన్నా మీమీద ఇంకా నాకు మిగిలిన పూజ్యభావాన్ని దయచేసి పోగొట్టుకోకండి...''

''నోర్ముయ్... నీతులు వల్లించకు. వాడిమీదే 'రోకుం'దని ఆరోజే ఏడ్చుంటే నిక్షేపంగా వాడికే వొదిలేసుండేవాణ్ని. నోరు మెదపడానికి మళ్లా గుండెలు చాలేయికాదు ఆరోజు. నన్నడ్డం పెట్టుకుని, చాటుమాటుగా, పోగినన్నాళ్లు సాగిద్దామనుకున్నారు ఇద్దరికిద్దరూ. నా కళ్లు కప్పినా లోకం కళ్లు కప్పలేకపోయావు. నిజం బైటపడ్డాక... తెగించ డానికి సిద్ధపడ్డావు. నా రక్తం కళ్ల చూసయినా వాడితో లేచిపోదామనుకుంటున్నావు. అలాంటి నువ్వా... తాళి, భర్త సాంప్రదాయం అంటూ నీతులొలకబోస్తే... ఇంకా నమ్మేంత వెర్రికుట్టిని కాదే. కొద్దోగొప్పో హృదయం వున్న మనిషిని గనకా, మర్యాదగా వాణ్ణే పొమ్మనన్నెప్పమంటు న్నాను... గతం మరిచి కుదురుగా కాపరం చేసుకో మంటున్నాను. జుత్తు పట్టుకుని బయటకీడ్చియా ల్సిందిపోయి, దయతో క్షమిస్తున్నకొద్దీ నోటి కొచ్చినట్టు మంచిచెడ్డా మరిచి మరీ పేలుతున్నావు. వీధిలోకి గెంటేస్తే నీ బ్రతుక్కేగతి పడుతుందో ఆలోచించుకుని మరీ మసులుకో... ఈమాత్రం దయ కూడా చూపించరెవళ్లూ...''

''దయ! మీకున్నది దయ కాదండీ...నా శరీరం మీద మోజు.''

# నవ్విపోదురుగాక...

''మోజుపడే చేసుకున్నానే... నీ మోజంతా వాడిమీదున్నట్లేకా...''

''ఎవడో కూసిన కారుకూతప్ప ఆ ముక్కన్నా నికి మీకున్న ఆధారం వొక్కటంటే వొక్కటి చెప్పండి ?''

''సవాలక్ష ఆధారాల్లో ఏదన్నెప్పమంటావే ?''

''వున్నాయున్నాయన్టంకాదు. చెప్పండి ?''

''చెప్తే, అగ్నిప్రవేశం చేసేసి పాతివ్రత్యాన్ని ఋజువుపరిచేసుకుంటావేంటి సీతాదేవిలా కొంప తీస్తే...''

''యుగయుగాల్నించి ఎంతమంది సీతలు అగ్ని ప్రవేశం చేస్తేమట్టుకు మీ రామచంద్రుళ్ల అనుమానాగ్ని చల్లారింది గనకా ?''

''నీమీద మాత్రం అనుమానమేంలేదు నిక్షేపంగా వైన నమ్మకం తప్ప.''

## వాళ్ళకేం తెలుసు?

నా దేశాన్ని
పాలిస్తున్నది
శాసిస్తున్నది
''రాహువులు!''
''కేతువులు!''
వాళ్ళకేం తెలును ?
మా ''క్షుద్బాధ'' ఎంత
భయంకరంగా ఉంటుందో
మా ''మేధాసంపత్తి'' ఎంత
ఘనంగా ఉంటుందో !

— కె. కిశోరుబాబు
కె. అశోకుబాబు

''ఆహా అంత నమ్మకం వున్నవాళ్లూ మళ్లీ ఏలుకుంటాననటమెందుకో ?''

''తప్పు చేసినా, సహృదయంతో క్షమించగలిగే, మానవత్వం.''

''హుం. మానవత్వం! 'తాళి' కట్టేననే అహంకారంతో, అభం శుభం తెలియని ఆడపిల్లల్ని 'అనుమాన పిశాచం'తో, చిత్రహింసలు పెట్టే ఈ దేశపు 'మొగుళ్ల' 'అమానుషత్వం' అది...''

''ఏవిటే నీ పొగరూ... ఎవణ్ణి చూసుకునే నీ మిడిసిపాటు... ఊరుకుంటున్నకొద్దీ నోటి కొచ్చినట్టు పేలుతున్నావు... ఔట్... గెటౌట్... ఇంకొక్క క్షణం నా కళ్లముందుంటే నిన్నూ... నిన్నేం చేస్తానో నాకే తెలీదు... పో... పోయి వాడితోటే ఊరేగు... పోవే......''

ఊరు ఊరంతా వినపడేలా గావుకేకలేస్తూ, అలగాజనం కూడా ప్రవర్తించనంత అసభ్యంగా, మెడమీద చెయ్యేసి, అమానుషంగా, గెంటుకుంటూ వొచ్చి, గదితలుపులు భడాల్నతీసి, రామచంద్రరావుగారు రాక్షసంగా తోసేసరికి, ఆ విసురుకి, వీధి గదిలోకి తూలి పడబోయిన కల్యాణి, తలుపుల వెనకే నిలబడ్డ నన్ను ఆసరాచేసుకుని, నిలదొక్కుకుంది.

తలుపులు తెరవగానే కనబడిన నన్నూ ... రెప్ప పాటులో నా చేతుల్లో వొదిగున్న కల్యాణినీ ... చూసేసరికి; రామచంద్రరావుగారిలో అప్పటికే పూర్తిగా రాజుకున్న 'అనుమానం' అగ్నిపర్వతంలా భళ్లున బ్రద్దలయింది. చాలా సేపట్నుంచి, ఆసక్తిగా ఆ గొడవ వింటోన్న, ఇరుగూ పొరుగూ, రామచంద్రరావుగారి అరుపులకి, వీధి గుమ్మంముందు, క్షణాలమీద పోగయ్యేరు.

మా యిద్దరి ముందూ ......

అనుమానంతో, కుత కుత లాడిపోతోన్న రామచంద్రరావుగారూ;

మా వెనక .........

అది రాజేసిన లోకం.

చుట్టూ చీకటి.

లేనిదోషం అంటగట్టబడిన, నిరపరాధుల్లా ...

మధ్యలో మేం ఇద్దరంవూ.

తన ముందున్న 'అనుమానం'కి, 'వెన్నెముక'గా, నిలబడ్డ జనాన్ని చూసేసరికి, ఆ బలంతో పూర్తిగా రెచ్చిపోయి, వివేకాన్ని కోల్పోయిన రామచంద్రరావు గారు, నిప్పులు కురిసే కళ్లతో ......

''ఇంకేం ... సిద్ధంగా కానుకునే వున్నాడన్న మాట ... ఆ ధైర్యంతోనే, నోటికొచ్చినట్టు పేలుతున్నావన్నమాట... తెగతెంపులు చేసుకోడానికే తలపడి, కాపలా వుంచేవన్నమాటా... శబ్బాష్ ... ఇంకేం, కుక్కల్లా వీధిన పడండిద్దరూ ... పొండి... నా గుమ్మంలోంచి ముందు బయటకు నడవండి ...'' వొళ్లు మరచి కేకలు వేస్తున్నంతసేపూ, 'నన్ను' నేను అణగదొక్కుకుని, ఆయన 'ఆవేశం' ఊపిరి తీసుకునేందుకు ఆగిన క్షణంలో; నా చేతుల్లో వడగాలికి వొడిలిపోయిన చిగురుటాకులా, పెనుతుఫాను తాకిడికి దిక్కుతోచని పూలతీగెలా, క్రుంగిపోతున్న కల్యాణిని, ఆయన దగ్గరకు తీసుకెళ్లి;

ఆధారంలేని అనుమానంతో, అర్థంలేని ఆవేశంతో, మిమ్మల్ని మీరు మరిచిపోయి, లేనిపోని అభాండాలేస్తున్నారు రామచంద్రరావుగారూ ... ఆగండి ... వొక్క నిముషం మాటాణ్ణియండి నన్ను ... కల్యాణిది మా ఊరేనని, మా రెండు కుటుంబాల మధ్యా ఎన్నో ఏళ్లుగా సాన్నిహిత్యం వుందనీ, ఇవాళ మీకు కొత్తగా ఎవరో వచ్చి చెప్తే తెలిసిన విషయం కాదు కదా... వొకే వూళ్లో పక్క పక్క ఇళ్లల్లో కొన్నేళ్లుగా మసిలినప్పుడు వయసులో పెద్ద తేడాలేని వో అమ్మాయి, వో అబ్బాయి మధ్య నున్న కేవలం స్నేహం, చనువూని ఇవాళ, ఇన్నేళ్ల తర్వాత, ఎవరో వెధవలు భూతద్దంలో మీకు చూపించి 'బూతు' అంటగడితే, నమ్మేసి; మీకే సర్వస్వం అన్నమ్ముకుని, అయినవాళ్లనీ ఎన్నో ఏళ్ల ఆప్యాయతల్నీ వొదులుకుని, ముక్కూ మొహం తెలీని మీ వెంట నడిచొచ్చిన అభం శుభం తెలీని అమ్మాయికీ ... మాటల్లో, మనసులో ప్రాణంలో ప్రాణంగా మసిలిన స్నేహితుడికీ ... ఎవడో పని పాటూలేని వెధవ పనిగట్టుకుని ఏదో కూస్తే, అది పట్టుకుని 'నీచంగా' ఊహించుకుని, లేనిపోని సంబంధం అంటగట్టి, నీచాతి నీచంగా మాట్లా

ట్పంవేగాకుండా, అగ్నిసాక్షిగా కట్టుకున్న పెళ్లాన్ని అమానుషంగా వీధిలోకి తోసెయ్యటానికీ, మీ సంస్కారం ఏ మట్టిలో కలిసిపోయింది రామచంద్రరావుగారూ ? మీకు దేనిమీద నమ్మకం వుంటే దానిమీద ప్రమాణం చేసి చెప్తున్నాను ... మాయామర్మం తెలీని వయసులో, పక్క ఇంటిలోనే వున్న అమ్మాయిగా, కేవలం పరిచయం, స్నేహం తప్ప కల్యాణి మీద ఎప్పుడూ మరో భావంగానీ, ఆ దృష్టిగానీ, నాకు లేవు గాక లేవు. కల్యాణిలాంటి అమ్మాయి భార్యగా లభించటంనేది ఎవరి జీవితానికయినా అపురూపమయిన వరం. లేనిపోని అనుమానాలతో ఆ వరాన్ని కాలదన్నుకోకండి. తన బ్రతుకు టద్దంలో మీ రూపే నిలుపుకున్న ఈ అమాయకురాలి జీవితం అల్లరిపాలు చెయ్యకండి రామచంద్రరావు గారూ ......''

ఆ రోజల్లా మథనపడ్డ నా మనోవేదన, అణుచుకోలేకపోతోన్న ఆవేశం, కట్టలు తెంచుకుని గుండెల్లోంచి పెల్లుబికిన మాటల వెల్లువే అయింది. మనసు విప్పి నేను మాట్లాడిన ప్రతీ మాటా వో చల్లటి మంచుబిందువై, రామచంద్రరావుగారిలో సెగలు పొగలు గ్రక్కుతోన్న అనుమానాగ్నిని చల్లార్చి, కల్యాణి కాపరాన్ని నిలబెడుతుందన్న కొండంత ఆశా, అందుకునే చేసిన విశ్వప్రయత్నమూ, ముక్కచెక్క అయిపోయింది. నేను మాటాట్టం ఆపిన మరు క్షణం ...

''అయిందా నీ ఉపన్యాసం ? నా కళ్లు కప్పి ఇంకా మీ వ్యవహారం సాగించుకోటానికి చెప్పాల్సిందేవన్నా మిగిలుందా ? మరో మాటమాట్లాడినా... ఇంకో క్షణం నా కళ్లముందు నిలబడ్డా ... ఏం జరక్కూడదో అంతా జరుగుతుంది. అందుకు నేనేం చెయ్యిచేసుకోక్కర్లేదు ...మిత్రద్రోహంతో కాపరాలు కూల్చే నీలాంటివాళ్లని నరికిపోగులెయ్యడానికి లోకం వో కన్నేసేవుంటుం దెప్పుడూ. అజ్జరక్కుండా ముందిక్కణ్ణుంచి ప్రాణాలతో బయటపడు. చూడూ ... దయచేసి మరోళ్ల బ్రతుకుల్నీ ఇలాగే మంటగలపకు ... వెళ్లు ... వెళ్లిక్కణ్ణుంచి ... ''

అంతమంది ముందు, చెయ్యన్నేరానికన్ని మాటలన్నందుకు...ఇంకోళ్లా ఇంకోళ్లాఅయితే... ఆ రోజు నా చేతుల్లో వాళ్ల తలలెగిరిపోయుండేది. రామచంద్రరావుగారుగాకాక, కల్యాణి భర్తగా, ఆ క్షణంలో బ్రతికిపోయాడాయన. నా తొందరపాటు కల్యాణి బ్రతుకునెక్కడ ముక్కలు చేస్తుందోన్న భయం నన్ను పిరికివాణ్ణి చేసింది. రామచంద్రరావుగారన్న వొక్కోమాటకీ, నరనరాల్లోనూ ఉడుకెత్తి మొహంలోకి తన్నుకొచ్చిన రక్తపు ఉధృతాన్ని అతి కష్టంమీద అణగదొక్కుకోవాల్సివొచ్చింది. అయినా, చెయ్యన్నేరానికి, అన్ని మాటలూపడి మౌనంగా వెళ్లిపోడానికి నా ఆత్మగౌరవం ఎదురు తిరిగింది. అందుకే ... చివరగా ...

''చూడండి రామచంద్రరావుగారూ ... చెయ్యన్నేరానికి, మీరన్ని మాటలన్నా, ఏం చాతకాక వూరుకుంటున్నాననుకోకండి. చేసింది తప్పకాబట్టే నోరుమెదిపే గుండె ధైర్యంలేక తలొంచుకువెళ్లిపోతున్నాడని మీరనుకుంటే, అది—మిమ్మల్ని మీరింకా మోసం చేసుకోవటంవేని గ్రహించండి. నేనే తలుచుకుంటే మీరూ, మీ గుడ్డిలోకం ఏకంవై ఎదురొచ్చినా ఎదుర్కోగలిగే నా సత్తా ప్రదర్శించటానికి క్షణం సేపుపట్టదు. కల్యాణిమీద నాకున్న అపారమైన గౌరవం ఒక్కటే నన్ను అశక్తుణ్ణి చేసిందీక్షణంలో. వెళ్తున్నాను ... కళ్లకి అనుమానపు పొరలు కమ్ముకున్న మిమ్మల్నీ, మీకు బలంగా నిలబడ్డ లోకాన్నీ చూసి భయపడి మాత్రం కాదు. భర్తల అనుమానానికీ, అమానుషానికీ, నిర్దాక్షిణ్యంగా బలయిపోతున్న 'కల్యాణి'లాంటి నా దేశపు 'స్త్రీ'ల స్వచ్ఛత' మీద భక్తితో తలవంచి నమస్కరిస్తూ వెళ్లిపోతున్నాను. వెళ్లే ముందొక్క మాట ... 'స్త్రీ'ని గౌరవించలేనివాళ్లు ఈ దేశంలోనేకాదు ఏ దేశంలోనయినా పశువులకన్నా హీనులు. అందునా నా దేశపు 'స్త్రీ'కున్న పవిత్రత ఈ ప్రపంచంలో ఏ దేశపు స్త్రీకీలేదు. ఆ స్త్రీలను గౌరవ పరిచే పశుప్రాయులు కాకండి ... శెలవ్ ... '' చెప్పదలచుకున్నది చెప్పేసి తేలికపడ్డ మనసుతో అక్కణ్ణుంచి శాశ్వతంగా వెళ్లిపోవడానికి వెనక్కు తిరుగుతోన్న క్షణంలో.

''ఆగు ... '' రామచంద్రరావుగారి అరుపుకి ఆగి, వెనక్కి తిరిగాను.

కల్యాణి అదేచోటులో నుంచునుంది.

లోపలికెళ్లటానికి వీల్లేకుండా గుమ్మాని కడ్డంగా రామచంద్రరావుగారు.

ఈ చోద్యం అంతా ఆసక్తిగా చూస్తూ వీధి గదిముందు క్షణక్షణానికీ పోగవుతున్న జనం. వెనక్కి తిరిగిన నా కళ్లల్లోకి సూటిగా చూస్తూ ...

''కల్యాణి అంత స్వచ్ఛమైనదా ... ''

అడిగిన రామచంద్రరావుగారి గొంతులో హేళన. చూపులో వ్యంగ్యం.

పదిమందిలోనూ 'పంచాయితీ' జరుపుతోన్నట్టు ఆయన అడగటం చూస్తే వొళ్లు మండింది.

''ఏ మచ్చా మచ్చుకైనా లేదంటావయితే...''

నా మౌనాన్ని ఆసరా చేసుకుని మరింత వేళాకోళంగా అడిగినదానికి; కల్యాణి తలెత్తి చివ్వున చూసిన చూపులోని తీవ్రతకి అక్కడికక్కడే ఆయన మసికావల్సింది.

భార్య 'పవిత్రత'ని పదిమందిలోనూ నిలబెట్టి ప్రశ్నించగలిగే భర్త.

ఆ సర్వాధికార పట్టం వొక్కపురుషుడికే కట్టబెడుతూ వొచ్చిన యుగయుగాల చరిత్ర.

ఆ అహంకార రాక్షసత్వానికి తరతరాలుగా బలయిపోతున్నా నోరుమేదిపే ధైర్యంలేని ఈ దేశపు స్త్రీ.

అన్ని విధాలా 'అభ్యుదయం' సాధించావని విర్రవీగుతూ చెప్పకునే 'మగజాతి' స్త్రీని అగౌరవ బరచటంలో 'ఆటవికదశ'లోనే వుందని చెప్పటానికి 'రామచంద్రులు' ఇప్పటికీ కోకొల్లలు.

ఆ 'జాతి లో' జన్మించినందుకు సిగ్గుపడటంతో సరిపోదు. సమయం వొచ్చినప్పుడు పురుషుడికి పురుషుడే 'స్త్రీ' గురించి సరైన సమాధానం చెప్పాలి. నాకెందుకని నోరు మూసుకోవడమంత 'ఆత్మన్యూనత' మరొకటిలేదు. ఏది ఎలా జరిగినా ఆ 'ప్రశ్న'కి సరైన సమాధానం చెప్పాలనే నిర్ణయించుకున్నాక, వెనకా ముందూ ఆలోచించలేదు.

''చూడండి రామచంద్రరావుగారూ... మీరు హేళనగానే అడిగినా... మీ భార్య గురించి మీకు చెప్పవలసి రావటం నా అదృష్టం. కల్యాణి గురించి చెప్పవలసి వచ్చినందుకు గర్విస్తూ చేస్తున్నాను.






మీరూ మీ బూజుపట్టిన లోకవూ గుండెధైర్యంతో వినండి... ఆకాశం నుంచి అప్పుడే పుట్టి రాలిపడ్డ మంచు బిందువుకన్నా, ఆ మంచుబిందువులో విశ్లేషించి బ్రతుకుని సార్థక పరుచుకోడానికే తూర్పు దిశన తొలిసారిగా జన్మెత్తిన ఉదయ కిరణం కన్నా స్వచ్ఛమైనదీ... లోకమెరుగని పసిపాపనవ్వుకన్నా పవిత్రమైనది మా కల్యాణి. చాలా... ? ''

కల్యాణి ఎడల నా మనసులోగల అపారమైన గౌరవాన్ని నిస్సంకోచంగా నిర్భయంగా చెప్పింది విని;

''చాలు. కళ్యాణి పట్ల నీ కుండే 'మోజు'ని బయటపెట్టడానికి ఆ మాత్రం చాలు...'' అంటూ కల్యాణి వేపు చూసి. ''చెప్పవే... నువ్వా చెప్పు వాడి గురించి నీ గుండెల్లో పొంగిపొర్లే ప్రేమని వాడికన్నా వేడిగా...'' చాలా వ్యంగ్యంగా రామచంద్రరావు గారడిగిన మాటకి;

ఈ చోద్యం అంతా ఆసక్తిగా చూస్తూ వినోదిస్తున్న జనంలో నవ్వులు, గుసగుసలు, కలకలం. అప్పుడు చండప్రచండమైన కోపంతో కళ్యాణి కళ్లల్లో కురిసిన నిప్పులవర్షంకి మగజాతి సమూలంగా మాడి మసి అయిపోవాల్సిందే.

''చెప్పమంటారా ? చెప్తే విని తట్టుకోగల చేవుందా మీకూ ?'' స్త్రీలోకం సమస్తమూ కల్యాణి గొంతులోంచి గర్జించినట్లయింది.

''అయ్యా... విన్నారుకదా... చూసారుకదా వొకళ్లమీద వొకళ్లకున్న వ్యామోహం...'' పోగయిన జనాన్నుద్దేశించి అంటూ, కళ్యాణివేపు తిరిగి...

''ఎవళ్లకుంటుందే ? మొగుడిచాటున పరాయి మొగాడితో 'రంకు' సాగించే నీలాంటి ఆడపిశాచాన్ని తట్టుకోగలిగే చేవ ఏ మగాడికుంటుందే...'' అంటూ నావేపు చూస్తూ...

''ఏఁవన్నావు ? ఆకాశం నుండి రాలిపడ్డ మంచుబిందువా ? నువ్వా... కొంపలు కూల్చే

# నవ్విపోదురుగాక...

చలిపిడుగువి... అవునా ? పరాయివాడి పెళ్లాం గురించి వాడిక్కూడా తెలియనంతగా చెప్పగలవన్న మాట. స్త్రీలను ఉద్ధరించటానికి నువ్వొక్కడివే కంకణం కట్టుకుపుట్టావన్నమాట ఈ దేశంలో...''

జనంలోంచి పెద్దపెట్టున నవ్వు. ఆ ఆండ చూసుకుని మరింత రెచ్చిపోయి...

''అంత ధైర్యం వుందేం నీకూ? ఇంతమంది సమక్షంలో, ఇదిగో దీన్ని వదిలేస్తున్నాను. మొగుడొదిలేసిన ఆడదాన్ని... మంచుబిందువో, పువ్వో, నవ్వో, వల్లకాడో ఏదో అన్నావే ఆ ఆడదాన్ని... ఏదీ జన్మంతా నెత్తిని పెట్టుకుని పూజించే గుండెధైర్యం వుందా... వుందిరా నీకూ? వున్నా లేకున్నా ఈ క్షణంతో దీనికి నాకూ ఎలాంటి సంబంధంవూలేదు. పోవే... వాడితోటే పోతావో... వాడు ఛీ అంటే వాళ్లాటవాడే మరోడు మరోడు... ఎంతమంది లేరూ ? అవసరం తీరేక వొదిలేసే వెధవలు ... వెంకోళ్లి మార్చుకున్నా వొంట్లో బిగువూ కండల్లో కావరవూ వున్నంత కాలమూ వెళ్లిపోతుందే... ఆ తర్వాత కుక్క బ్రతుకే. మొగుణ్ణి మోసంచేస్తే ఆడదాని బ్రతుకంతేనే... పో...ఈ జన్మలో నీ మొహం చూపించకు మళ్లీ...''

ఎంత అధికారంవున్నా, ఏ మొగాడూ, వో ఆడదాని గురించి, మాటాడనంత నీచంగా; కట్టుకున్న పెళ్లాన్ని, చెయ్యన్నేరానికి, అనరాని మాటలన్నీ అని; తలుపులు ధడాల్న మూసేసి లోపలకెళ్లిపోయాడాయన; కట్టుబట్టలతో కల్యాణిని నడివీధిలో 'దోషి'గా వొదిలేసి.

అంత దారుణంగా ఆయన ప్రవర్తించినా 'ఇదేమిటని' చూస్తున్న జనంలో వొక్కరంటే వొక్కరు పెదవి విప్పి అడిగిన పుణ్యాన్నపోలేదు.

పైగా, సాక్షులుగా నిలబడ్డ వాళ్లలో ఎక్కువ భాగం స్త్రీలే. సాటి స్త్రీ పైన పిడికెడు సానుభూతి అయినా చూపించలేదు వాళ్లల్లో వొక్కళ్లయినా.

సినీమా విడిచిపెట్టినతర్వాత వెళ్లిపోయే ప్రేక్షకుల్లా ఎవరి దారిన వాళ్లు వెళ్లిపోయారు. ఏదారీ కనపడక. దిక్కుతోచని పక్షిలా మిగిలిపోయింది కల్యాణి నా ఎదుట.

అంతరాంతరాల్లో కళ్యాణి పట్ల నాకు గల ఎనలేని గౌరవానికి 'నీచత్వం' ఆపాదించి; నన్నేగాకుండా, ఏ పాపమూ ఎరుగని నిష్కళంకమైన కల్యాణిని కూడా దోషిని చేసి, దుమ్మెత్తిపోసి; రామచంద్రరావుగారూ, ఆయనోతోపాటు ఆయన కండగా నిలబడ్డ గుడ్డిలోకవూ ఏకమై; నడివీధిలో, నిర్దాక్షిణ్యంగా, ఒంటరిదాన్ని చేసి, ఒదిలేసి వెళ్లిపోతే; సమయం ఒచ్చినప్పుడు, నిర్ణయం తీసుకోవాల్సొచ్చినప్పుడు, వల్లించిన ఆదర్శాలను గాలికి ఒదిలేసి; నామూలంగా భర్త అనుమానానికి గురయి నిండు బ్రతుకు బలయిపోయిన కల్యాణిని; నేనూ వొదిలేసి, నామానాన్న నేనూ వెళ్లిపోయే నీచత్వానికి పాల్పడలేకపోయాను.

అందరిలాగా ఆమెను 'గాలి'కి వొదిలేసి, నా ఆత్మ గౌరవాన్ని కించపరుచుకుని; ఈ మనుష్యుల పట్ల ఆమెలో నా మూలంగా కొద్దో గొప్పో మిగుల్చుకున్న ఆమె ఆత్మ విశ్వాసాన్ని వమ్ము చేయలేకపోయాను.

జరిగిన అవమానానికి, నేలకు తల దించుకుని, చెయ్యాల్సిందేఁవిటో తోచక, అచేతనంగా మిగిలిపోయిన కళ్యాణికి; నేనున్నానని ధైర్యం చెప్పే తోడూ నీడా కావలసొచ్చినప్పుడు; ఈ లోకానికి జడిసే పిరికి పందనయి, ఆత్మన్యూనతకి లోనుకాలేకపోయాను.

నా సంస్కారం మీద నాకున్న ఆత్మవిశ్వాసంతో, కల్యాణి ఎడల నాకు సంపూర్ణంగా వున్న పవిత్రమైన భావంతో; ఆమెకు నా చేతినందించినప్పుడు......

పునర్జీవించిన ఆమె చైతన్యం;

ఈ లోకంమీద ... బూజుపట్టిన దాని సాంప్రదాయంమీద ... 'తిరుగుబాటు' ప్రకటిస్తూ; విశాలమైన ఆమె కళ్లల్లో అఖండంగా వెలిగిన జ్యోతిని; చూసినప్పుడనిపించింది ... 'కళ్లున్నవాడొక్కడే' చూడతగ్గ అపూర్వ సుందర దృశ్యం అదని !

కొండంత ధైర్యంతో ...

చేయీ చేయీ కలిపి, వీధిలోకి అడుగుపెట్టిన మాకు ... వెలుతురుని ప్రసవించడానికి వేగిరపడే వేగుచుక్క జాజ్వల్యమానంగా ప్రకాశిస్తూ ... ఆ చీకట్లో మా కొత్త జీవితానికి వెలుగుబాట పరిస్తే;

తలుపు సందుల్లోంచి మమ్మల్ని చూస్తున్న 'లోకం' గుసగుసగా నవ్వుకుంది, ఏం చెయ్యడానికీ దమ్మూ ధైర్యంలేక.

''నవ్విపోదురుగాక ... మాకేటి వెరవు ...'' అనుకుంటూ సాగిపోయాం ఇద్దరికిద్దరవూ... మేం ఏర్పరుచుకోబోతున్న; కొత్తలోకంలోకి ...

సరికొత్త జీవితంలోకి !!!

క్రిస్మస్ సందర్భంగా గాస్పెల్స్ మెసెంజర్స్ కల్చరల్ అకాడమీ వారు విజయవాడలోని క్షేత్రయ్య కళాక్షేత్రంలో ప్రదర్శించిన ''ఆడం అండ్ క్రైస్ట్'' నృత్యరూపకంలో క్రీస్తుపుట్టుక దశ్యం. మేరీగా కుమారి ఆనీ కిరణ్మయి, జోసెఫ్‌గా శ్రీ రవిలని చిత్రంలో చూడవచ్చు.





## పత్రికల వారిపై బలప్రయోగం !

కన్నడ వెండితెర నటుడు రాజకుమారును గురించి వోనూదిరిగా సుధాఅనే పత్రికరాసిందట. దాంతో ఆ నటుని అనుయాయులు సినిమానుంచి ఇంటికి వెళ్తూన్న ఆపత్రిక ఫోటోగ్రాఫరు శివయోగిని పట్టుకొని బలవంతంగాకారులోఎక్కించుకొని అతనివల్ల విలేఖరి గంగాధర్ ముదలియార్ అడ్రసు తెలుసుకునతన్నీ కార్లో తీసుకుని ఒక చోట నాలుగ్గంటలు నిర్బంధంలోవుంచి వారిని భయపెట్టి గంగాధర్‌చేత క్షమార్పణ పత్రం రాయించి తీసుకుని అవక వదిలేశారట.

## మంగమ్మవ్వకు పాదరసం !

కర్నూలు జిల్లాకు చెందిన మంగమ్మవ్వ అనే వోనగ్న సన్యాసిని రామకోటి అనే అతనిని తన సోదరి సావిత్రమ్మతోనూ,ఆమెభర్త పుల్లన్నతోనూ కలసి చంపిందన్న నేరం రుజువు అయినందు వల్ల కర్నూలు జిల్లా సెషన్సుజడ్జి 47 పేజీల జడ్జిమెంటులో ఆమెకు యావజ్జీవ కారాగార శిక్ష విధించారట. మొన్న డిసెంబరు తొమ్మిదో తేదీన ఈ 24 ఏళ్ళ మంగమ్మవ్వ అనే నగ్న సన్యాసిని రామకోటి అనే వోవ్యక్తితో రహస్య కామ సంబంధాలు పెట్టుకున్నదనీ, రామకోటి వివాహం చేసుకో నిశ్చయించు కున్నాక ఆశ్రమానికి రావటం మానేస్తే, ఈమె వో పథకంవేసి అతన్ని రప్పించి, వృషణాలు పిసికి చంపిందని తేలిందట. ఈ చర్యకు కేవలం మానసిక కామ అసూయే కారణమని జడ్జి గారు అభిప్రాయపడారట. ఎనిమిదవ ఏట ఇంట్లోంచి పారిపోయిన ఈమె బట్టలు విసర్జించి నగ్న సన్యాసినిగా పేరుమోసిందట. తెల్లని గోధుమరంగుతో మిలమిలలాడే శరీర వర్చస్సుతో యీమె రోజుకు కనీసంఆరుసార్లు స్నానం చేసి, జుట్టు శుభ్రపర్చుకుని చక్కని తైలాలు రాసుకుని, మంచి మెత్తని పరుపులమీద పవ్వళించేదట. కోర్టుకు కూడా నగ్నంగానే వస్తున్న యీమె ... చుట్టు

... యూగా ...

## ఎప్పటికప్పుడు కొత్తే !

రాంనగర్ టాణాకు చెందిన పుర్త్రైనా గ్రామంలో గంగారామ్ బచ్చుచు, శ్రీపాల్ యాదావ్ అనేఇద్దరు రైతులు నవంబరు 13న వారి పొలంలోనే గిరిజా సింగ్ అనే వో ధనికుడు తన అనుయాయులతో వచ్చి తుపాకులతో కాల్చి చంపేసి వారి భూమిని ఆక్రమించుకున్నాడట. పోలీసు సూపరింటెండెంట్ విచారణలో అద్భుతాలు తెలిశాయట. ఆ వూరిలో ధనికులు యీ బీదవారికి ప్రభుత్వం యిచ్చిన పొలంలో పోరంబోకు భూములు చేర్చి సుమారు ఏడువేల ఎకరాలు తమ స్వాధీనం చేసుకుని గత పది పన్నేండ్లుగా వ్యవసాయం చేస్తూ కొన్ని లక్షలు గడించారట. వారికి ఎదురు తిరగబోయిన వారి శవాలు గతపదేళ్ళలో ఘుగ్ఘూనదిలో కనిపిస్తుండేవట. ఈ విషయం ప్రభుత్వానికి లోగడ తెలియనిది కాకపోయినా ఎప్పటికప్పుడు కొత్తగా విన్న విషయంలానే రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఆశ్చర్యపోతూ యిన్నాళ్ళా గడుపు తున్నాయట.

## మానభంగానికి ఆరేళ్ళ జైలు !

పంచ్ గని అనేవూరిలో ఏడుగురు యువకులు ఒక నేపాల్ పిల్లని పట్టుకుని జనసంచారం లేని చోటుకు తీసుకుపోయి తమ కామ దాహం సమిష్టిగా విడివిడిగా తీర్చుకున్నారట. ఈ కేసు సతారా సెషన్సు జడ్జి సుభాష్ కుల్‌కర్ని విచారించి ఆ ఏడుగురికి ఆరేసేళ్ళ కారాగార శిక్ష, తలా రెండు వందలు జరిమానా విధించారట!

## ప్రచారంలో ప్రమాదాలు !

మహబూబాబాద్ తాలూకా మడుగుల గూడెం అనే గ్రామంలో చింతలూరు అప్పలయ్య అనే అతను యన్టీరామారావు తెలుగుదేశం పార్టీకి ప్రచారం చేస్తుండగా పట్టపగలు అతన్ని గునపాల తోనూ, కర్రలతోనూ కొట్టి చంపేశారట. నంద్యాలలో ఎన్నికల ప్రచారకథలు గోడలమీద రాసే శుభవేళలో ఇందిరా కాంగ్రెసూ, తెలుగుదేశం పోట్లాడుకున్నారట. అనక సుమారు మూడువందల మందిమూకుమ్మడిగా తెలుగుదేశం అభ్యర్ధి యం. సంజీవరెడ్డి గారి ఇంటిమీద విరుచుకుపడ్డారట!

## రా జ కీ య ం !

తెలుగు తెర నటుడు శ్రీ యన్టీ రామారావుకు ఎన్నికలకు గాను ఉపయోగించడానికి ప్రయత్నిస్తే ఒక హెలికాప్టరుకూడా దొరకలేదట. ఒకాయన ధైర్యంచేసి హెలికాప్టరుఅద్దెకిస్తానని ఒప్పుకుని నూరు గంటలకు నాలుగు లక్షల అరవై వేలు అద్దె అడిగి, యన్టీఆర్ ఒప్పుకునే సరికి ఆహెలికాప్టరుకు కావాల్సిన ఇంధనాన్ని ప్రభుత్వపు రిఫైనరీస్ నుంచి మీరేతెప్పించుకోవాలి అన్నారట. తాను వ్యతిరేకిస్తూన్న పార్టీ ప్రభుత్వాన్నుంచి తనాఇంధనం పొందగలడా ! పొలిటిక్సనగా నేమి !!

## పోటీలో దెబ్బతిన్న బాక్సింగ్ వీరుని మృతి

లండన్‌లో పోయినేడు జూన్‌లో బాక్సింగ్ ఆటలలో నైజీరియన్ బాక్సింగ్ చాంపియన్ యంగ్ ఆలీ అనే ఆయన్ను బార్‌మెనేగుయ్‌గన్ అనే ఆయన బాక్సింగులో ఎగిరి వో గుద్దు గుద్దారట. దాంతో ఆ ఆలీ స్పృహ తప్పి పడిపోయి, అట్నుంచి కోమాలోకి పోయి ఆర్నెల్లకాలం అలానే కోమాలో వుండి మొన్న డిసెంబరు 18వ తేదీన చనిపోయారట. *



# ఉ ద్యో గ ం

[ 10వ పేజీ తరువాయి]

ఏమైనా నష్టమా?" అని అడిగింది చెప్పులు తొడుక్కొంటున్న విశ్వాన్ని

"నష్టం నాక్కాదు! నీకు!" నవ్వుతూ సమాధానమిచ్చాడు. అర్ధంకానట్టు చూసింది లలిత.

"మరేంలేదోయ్! వాడు మళ్లీ రేపు బొంబాయి వెళ్తాడట! వేళ్తే నెలరోజులకు గాని రాడు. అందుచేత ఈ రోజే నీ ఉద్యోగం సంగతి తెల్సుకోటానికి బయల్దేరాను."

"నా ఉద్యోగం కోసమా ఈ హడా వుడంతా!" నిట్టూర్చింది లలిత.

"ఈసారి నీకు తప్పకుండా జాబ్ వస్తుం దోయ్! మన బుజ్జిగాణ్ణి ఎటూ కాన్వెంట్ హాస్టల్లో జాయిన్ చేశాం కాబట్టి వాడి సమస్య మనకిప్పుడులేదు. నీక్కూడా జాబ్ వస్తే మనం ఎంతో హాయిగా బతకవచ్చు! బుజ్జిగాణ్ని బాగా చదివించి ఇంజనీర్ చేయ వచ్చు. మనం లోన్ తీసుకొని ఓ చక్కని ఇల్లు కట్టుకోవచ్చు! మనకు కావల్సిన ఖరీదైన వస్తువులన్నింటినీ అమర్చుకో వచ్చు! ఈ కోర్కెలన్నీ తీరాలంటే నీవు కూడా ఉద్యోగంచేయాలి. కెమికల్ ఫ్యాక్టరీ మేనేజర్ శేషగిరికి ఫ్రెండట! అందులో నీకు తప్పకుండా ఉద్యోగ మిప్పిస్తానని లోగడ శేషగిరి ప్రామిస్ చేశాడు. ఈ రోజు మళ్లీ వాడితో ఆయనకు ఫోన్ చేయించి వస్తాను.." అంటూ మూలనున్న గొడుగు తీసుకొన్నాడు విశ్వం.

బయట వర్షం జోరుగా పడుతూంది.

ప్యాంటును మోకాళ్లవరకు మడతపెట్టి, చేతో గొడుగు పట్టుకొని మెల్లగా రోడ్డు మీదికి వెళ్ళాడు విశ్వం.

విశ్వం వెళ్ళిన దిక్కే చూస్తూండి పోయింది లలిత. ఆ క్షణంలో లలిత మనసులో భర్తమీద ఎనలేని అభిమానం కల్గింది.

వర్షం పడుతున్నా లెక్క చేయకుండా ఆయనలా స్నేహితుని దగ్గరకు బయల్దేర టానికి కారణం తన మీద ఆయనకున్న ప్రేమే!

తన కోసం ఆయనలా వెళ్తుంటే మనసంతా బాధగా వుంది. అసలు తన మనసులో ఉద్యోగం చేయాలన్న కోరిక ఎందుకు పుట్టిందో?

బయట వర్షం జోరు అధికమైంది.

మెరుపులు —

ఉరుములు —

వాతావరణం భయంకరంగా మారింది. లలిత వరండాలో వున్న కుర్చీలో కూర్చుండి పోయింది.

ఆమె మనసులో గతం మెదిలింది.

ఉద్యోగం చెయ్యాలన్న కోరిక తనలో కల్గి దాదాపు పదేళ్ళవుతోంది.

అవి తను స్కూల్ ఫైనల్ చదివే రోజులు ...

రాత్రనక, పగలనక కష్టపడి చదివి ఫస్ట్ క్లాసులో పాసయింది కాలేజీలో జాయిన్ కావటానికి ఎంతో ప్రయత్నించింది.

'ఇది చదివేమ్మైనా వూళ్లేలాలా? వుద్యోగాలు చేయాలా?' అంటూ అమ్మ తన చదువుకు అడు పడింది. అప్పటికి తమ ఆర్థిక పరిస్థితి కూడా అంతంత మాత్రంగానే వుంది. నాన్నగారు ఎలిమెంటరీ స్కూల్లో టీచర్. ఆయనకు వచ్చే జీతం తమ సంసారానికి ఎటూ సరిపోదు

తనతోపాటు ఇద్దరు చెల్లెళ్ళు, ముగ్గురు తమ్ముళ్ళు వున్నారు. తమ అదృష్టం కొద్దీ తాతగారు ఓ డాబాను వదిలి వెళ్ళారు కాబట్టి ఓ పోర్షన్‌లో తాముంటూ, మరో పోర్షన్‌ను అద్దెకివ్వటానికి అవకాశం కల్గింది. ఆ ఇల్లే లేకుంటే తమ కుటుంబం పస్తులుండాల్సి వచ్చేది.

అంతకు ముందున్న పోస్టుమాస్టరుగారు ఖాళీచేయగానే తమింట్లోకి టెలిఫోన్ డిపార్టుమెంట్లో పని చేస్తున్న దంపతులు దిగారు.

ఆయన సన్నగా పొడుగ్గా వుండేవారు ఆమె కొంచెం బొద్దుగా, పొట్టిగా వుండేది.

వాళ్ళిద్దర్నీ చూస్తుంటే తనకెంతో ముచ్చట వేసేది. పెళ్ళయి సంవత్సరమే అయిందట — ఒకే ఆఫీసులో ఉద్యోగం, నెలకు రెండు జీతాలు ... జీవితమంటే అలా వుండాలి అనుకొనేది తను. ఆమె చక్కగా టాయిలెటయి ఫుల్‌వాయిల్ పూల చీరెను, రూబీ ప్లెయిన్ కలర్ బ్లవుజ్ ధరించి వ్యానిటీ బ్యాగ్‌ను చేతికి తగిలించుకొని, హై హీల్స్‌ను టక టక శబ్దం చేసుకొంటూ నడుస్తుంటే ఠీవి, దర్పం కొట్టవచ్చినట్లు కన్పించేవి.

ఆమెను చూశాకే ఉద్యోగం చేయాలన్న కోరిక తొలిసారిగా తన మనసులో కల్గింది.

ఆమెతో పరిచయం కల్గాక తనక్కూడా ఉద్యోగం చేయాలని వున్నదని వివరించింది తను. స్కూల్ ఫైనల్లో తనకు వచ్చిన మార్కులను చూసి తనకు తప్పకుండా ఉద్యోగం వస్తుందని ఆశ పెట్టింది ఆమె. పోస్టల్ డిపార్టుమెంట్లో ఖాళీలున్నట్లు పేపర్లో పడటంచూసి అప్లికేషన్ తెచ్చి తనను అప్లయ్ చేయమంది ఆవిడ.

కొన్ని నెలలు గడిచాక విజయవాడకు ఇంటర్వ్యూకు రమ్మని లెటర్ వచ్చింది.

## ఉద్యోగం

వాళ్ళు అడిగిన ప్రశ్నలన్నింటికీ సరిగ్గానే సమాధానం చెప్పింది.

ఫలితంగా పోస్టింగ్ ఆర్డర్స్ వచ్చాయి.

అయితే ఉద్యోగం చేసే అదృష్టం తనకు కల్గలేదు. కారణం తన తల్లి హఠాత్తుగా కన్నుమూయటం. పెద్దకూతురైన తను తల్లి పోయాక సంసార బాధ్యతలు స్వీకరించాల్సి వచ్చింది. తనకు పోస్టింగ్ చాలా దూరాన రావటంతో ఆ పరిస్థితుల్లో ఇల్లు కదలటానికి వీల్లేక ఉద్యోగాన్ని వదులుకొంది తను.

కాలచక్రం తిరుగుతూంది ...

చెల్లెళ్ళ, తమ్ముళ్ళ పెద్దవాళ్ళవుతున్నారు. నాన్నగారు తనకు సంబంధాలు చూడసాగారు కట్నం యిచ్చేశక్తి లేనందున తనను చేసుకోటానికి ఎవ్వరూ ముందుకు రాలేదు.

ఆడదానికి పెళ్ళికంటె ముందు తన కాళ్ళమీద తను నిలబడగల అత్మస్థైర్యం అవసరమని తను తెల్సుకొంది అందుకే ప్రయివేటుగా ఇంటర్ కట్టి పాసయింది. కాళీసమయం చూసుకొని టైప్ రైటింగ్ కూడా నేర్చుకొంది.

ఆ సమయంలోనే తనకు బాబాయి ద్వారా ఈ సంబంధం రావటం, కట్నం తీసుకోకుండా తనను వివాహం చేసుకోడానికి ఆయన ఒప్పుకోటం, తన పెళ్ళి జరిగిన నెలకే తన తండ్రి కన్నుమూయటం అన్నీ వరుసగా జరిగిపోయాయి ...

పెళ్ళయినా తనకు చదువు మీద ఆసక్తి తగ్గలేదు. ఆయన ప్రోత్సాహంతో కష్టపడి చదివి డిగ్రీ పుచ్చుకొంది తను.

ఉద్యోగం చేయాలనే కోరిక మాత్రం మనసులో మిగిలిపోవటంచేత తను ఎన్నోసార్లు ఆయనకు తన కోరిక తెలియజేసింది.

అప్పట్లో తను ఉద్యోగం చేయటం ఆయనకిష్టం వుండేది కాదు.

కాని ఇప్పుడు పరిస్థితుల్లో వచ్చిన మార్పులు ఆయన మనసును కూడా మార్చకల్గాయి.

ఆయన అన్నట్లు తమ బుజ్జిగాడి భవిష్యత్తును చక్కగా తీర్చిదిద్దాలంటే డబ్బు కావాలి...

అంటే తను కూడా ఉద్యోగం చేయాలి...

కాలం ఎంత విచిత్రమైంది ?

ఒకప్పుడు తను ఉద్యోగం కావాలనుకొంది కేవలం సరదా కోసం —

కాని మరినేడో... ?

డబ్బుకోసం !

ఆయన ప్రయత్నాలు ఫలించి తనకూ్కడా ఉద్యోగం వస్తే...

ఠక్కున కరెంటు పోవటంతో లలిత ఆలోచనలు ఆగిపోయాయి.

చీకటి . చుట్టూ చీకటి...

బయట వర్షం పడ తూనే వుంది తలుపు గడియవేసి ఆ చీకట్లోనే మెల్లగా తడుము కొంటూ వంటింట్లోకి వెళ్ళింది అగ్గిపెట్టె కోసం.

కిటికీలో వున్న అగ్గిపెట్టె వానకు తడ వటం చేత కాబోలు ఎన్ని పుల్లలు గీచినా వెల్గలేదు.

అగ్గిపెట్టెను అక్కడే వదిలేసి మెల్లగా వచ్చి మంచమ్మీద కూర్చుంది లలిత.

తలంతా భారంగా వుండటంచేత మెల్లగా నడుంవాల్చి కళ్ళు మూసుకొంది...

తలుపు తట్టిన శబ్దం విని ఉలిక్కిపడి లేచింది.

గదిలో లైటు వెల్గుతూంది.

కరెంటు వచ్చి ఎంతసేపయిందో అను కొంటూ లేచి కూర్చుంది.

మళ్ళీ తలుపు తట్టిన శబ్దం.

"వస్తున్నా!" అంటూ గబగబ వెళ్ళి తలుపు తీసింది. అంతే !

ఎదురుగా కన్పించిన దృశ్యాన్ని చూడగానే ఆశ్చర్యపోయింది.

ఎవరో అపరిచితులు —

లలితకు నోటమాట రాలేదు.

కాళ్ళు వణుకసాగాయి.

"మేము విశ్వం స్నేహితులం. శేషగిరిగారి కారుకు ఏక్సిడెంటయింది. ఫ్రంట్‌సీట్లో కూర్చున్న విశ్వానికి బాగా దెబ్బలు తగిలాయి. హాస్పిటల్లో జాయిన్ చేశాం!" వాళ్ళలో ఓ వ్యక్తి చెప్పాడు.

లలితకు భూమి గిరున తిరిగినట్లయింది. శరీరంలోని నరాలన్నీ స్వాధీనం తప్పుతున్నట్ల న్పించింది. మనసు మొద్దుబారిపోయింది.

ఇంటికి తాళం వేయాలన్న ధ్యాసే లేకుండా అసంకల్పితంగా వాకిట్లో నిలబెట్టి వున్న టాక్సీలోకి వెళ్ళికూర్చుంది.

* * *

మానవ జీవితం చాలా చిత్రమైనది. ఏ క్షణంలో ఎవరి జీవితం ఎలా మలుపు తిరుగు తుందో ఊహించటం కష్టం! పుట్టిన ప్రతి ప్రాణికి మరణం తప్పదని తెల్సినా జీవితమ్మీద తీపిని పెంచుకోటం, బంగారు భవిష్యత్తును నిర్మించుకోవాలనే తపన కల్గటం, మనసులో ఎన్నెన్నో ఆశలు, కోరికలు ఉద్భవించటం అనివార్యమై పోతూంది మానవుడికి. పుట్టిన క్షణం మొదలుకొని కడ శ్వాస వదిలేవరకు మనిషిని 'కోరిక' అనే అదృశ్య శక్తి కీలు బొమ్మను చేసి ఆడిస్తుంది. నిజం చెప్పాలంటే కోరిక కూడా మనిషితోనే జన్మిస్తూంది.

ఆకలి తీర్చుకోవాలనే కోరిక కల్గి అప్పుడే పుట్టిన పసిపాప ఏడిస్తే, తన శరీరానికి తగిన రీతిలో దహన సంస్కారాలు జరుగుతాయో లేదోనని ఆఖరి శ్వాసను వదులుతూ మరొకడు ఏడుస్తాడు.

పుట్టుక, గిట్టుక మధ్య మనిషికి ఎన్నో ఆశలు... ఎన్నెన్నో కోరికలు...

ఒక కోరిక తీరితే మరో కోరిక పుట్టు కొస్తుంది. కడుపు నిండా తినాలన్న కోరిక తీరితే, ఒంటినిండా బట్టకావాలన్న కోరిక పుడుతుంది. అది తీరగానే నీడనిచ్చే ఇల్లు ఏర్పరచుకోవాలన్న కోరిక... ఇలా మనిషి కోరికల చేతిలో బానిసగా మారిపోతున్నాడు...

నిజానికి లలిత జీవితంలో కూడా అనుకోని సంఘటన జరిగిపోయింది...

తన ఉద్యోగం కోసం వెళ్ళిన భర్త ఏక్సి డెంట్లో కళ్ళు మూశాడన్న నిజాన్ని ఆమె చాలా రోజుల వరకు నమ్మలేకపోయింది.

హాస్పిటల్... ఆపరేషన్... కోమా.... పోస్ట్‌మార్టమ్... ఏడ్పులు... పెడబొబ్బలు.. దహన సంస్కారం... బంధుమిత్రుల రాక... సానుభూతి పల్కరింపులు... అన్నీ కలలోని సంఘటనల్లా ఒకదాని వెనుక మరొకటి జరిగి పోయాయి.

పదేళ్ల క్రితం తన అంతరంగంలో పుట్టిన కోరిక తన పసుపు కుంకుమలనే బలిగా తీసుకొందన్న భావన కల్గగానే లలిత చిన్న పిల్లలా ఏడ్చింది. తమ్ముళ్ళు, చెల్లెళ్ళు, దగ్గర బంధువులు ఓదార్చి ధైర్యం చెప్ప టానికి ప్రయత్నించారు. కర్మకాండలన్నీ జరి పించి బంధువులంతా వెళ్ళిపోయారు.

ఓ రోజున ఇంటిముందు కారాగటం చూసిన లలిత ఒళ్ళోవున్న బుజ్జిగాణ్ణి ప్రక్కన కూర్చోబెట్టి తను లేచి నిలబడి



## ఉద్యోగం 1

ఒంటినిండా కొంగును కప్పుకొని తల వంచుకొంది. ఓ వ్యక్తి సరాసరిన వరండాలోకి వచ్చి "అమ్మా! మేము విశ్వం ఆఫీసువాళ్లం! మా మేనేజర్ గారు వస్తున్నారు..." అన్నాడు.

అందర్నీ లోపలికి ఆహ్వానించి కూర్చోమని చెప్పి తనుకూడా ఓ కుర్చీలో కూర్చుని బుజ్జిగాడి తల నిమురసాగింది.

"ఇంత చిన్న వయసులో దేవుడు మీకు అన్యాయం చేశాడమ్మా! మా అందరికి ఎంతో బాధగా వుందమ్మా! మేము ఓ మంచి వ్యక్తిని పోగొట్టుకొన్నాం! మా సంస్థ ఓ సిన్సియర్ వర్కర్‌ను కోల్పోయింది..." మేనేజర్ గారి మాటలు వింటుంటే లలితకు దుఃఖం ఆగలేదు.

బుజ్జిగాడి తలమీద గడ్డం ఆన్చి, రెండు చేతుల్లో ముఖాన్ని దాచుకొని చిన్న పిల్లలా విలపించింది.

"మీకు కల్గిన ఈ లోటును ఎవ్వరూ తీర్చలేనిదమ్మా! కాని మా చేతనైన సహాయం మేము చేయటానికి సంకల్పించుకొన్నాం! అందుకే మీరు పుట్టెడు దుఃఖంతో బాధపడుతున్నారని తెల్సినా మిస్ కోమల్తో మీకు అప్లికేషన్ పంపించి, శితో పూర్తి చేయించి మా హెడ్డాఫీసుకు రికమెండ్ చేశాం! ఇదిగోనమ్మా, పోస్టింగ్ ఆర్డర్..." అంటూ ఓ కవరును అందించారు మేనేజర్.

లలిత కన్నీళ్లు తుడ్చుకొంటూ లేచి నిలబడి కవరు అందుకొని కృతజ్ఞతగా నమస్కారం చేసింది.

వాళ్లంతా బయటకు వెళ్ళాక చేతిలోని ఆర్డర్‌ను చూసుకొంది. తనక్కూడా.... ఉద్యోగం... వచ్చింది...

ఉద్యోగం అనగానే ఆమెకో ఫుల్‌వాయిల్ చీర, రూబీ బ్లవుజ్, వేనిటి బ్యాగ్... వగైరా గుర్తుకు రావటంలేదు... జోరుగా పడ్తున్న వర్షంలో ప్యాంటును మోకాళ్ళవరకు మడత పెట్టి, చేత్తో గొడుగు పట్టుకొని రోడ్డు మీద నడుస్తున్న విశ్వం రూపమే లలిత కళ్ళ ముందు కదలాడింది.



### కార్టూన్‌లు పంపేవారికి మనవి

కార్టూన్‌లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరు పెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ–3. అన్న చిరునామాకి టపాలో పంపాలి. వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్టవచ్చును. ఈలోగా, నేరుగా కాని, టపాలోగాని వీటిపై ఉత్తరప్రత్యుత్తరాలకు తావు ఉండదు. కార్టూన్‌లు 'టపా' లో పోయినా, దారితప్పిపోయినా సంపాదకునిబాధ్యత వుండదు. ప్రత్యేక సంచికలకు కార్టూన్‌లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి. ఈకార్టూన్‌లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

—సం.

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

### ఒక చిన్న సలహా :

ఏడేళ్ల క్రిందట మైసూరులో సుప్రసిద్ధ ఇంగ్లీషు భాషా రచయిత శ్రీ ఆర్. కె. నారాయణన్‌ను కలుసుకొన్నాను. ఆయన లండన్ సమీపంలో జరిగిన ఒక సంఘటనను తెలిపారు. శ్రీ నారాయణన్ సుప్రసిద్ధ రచయిత హక్స్‌లేను కాబోలు చూడడానికి ఎప్పుడో ఒక దశాబ్దం క్రితం వెళ్లారట. అక్కడ ఒక మహిళ కూర్చొని వుంది. ఆమె వయసు మళ్లినా చాల సుందరంగానే ఉంది. నారాయణన్ లోపలికి వెళ్లడానికి జంకారట. ఫరవాలేదు రమ్మని ఆ రచయిత చెప్పిన పిదప నారాయణన్ లోపలికి వెళ్లారట. ఈమె ఎవరో తెలుసా మీకు? అనడిగారట ఆ రచయిత. తెలియదు అన్నారట నారాయణన్. ఈమె ఒకప్పుడు ప్రపంచాన్ని వూపివేసిన చలన చిత్ర తార గ్రేటాగార్బో— అన్నారట ఆయన. నారాయణన్ అవాక్కయి పోయి, అలాగే చూడసాగారట. వయస్సు మళ్లిందేకాని ఆమె సౌందర్యం ఏమాత్రమూ చెక్కు చెదర లేదట. నారాయణన్ ఆశ్చర్యాన్ని చూచి ఆయన అన్నారట — ఈమె చలన చిత్ర నటన మానేసి దాదాపు మూడు దశాబ్దాలు గడిచాయి. ఇప్పుడొక పల్లెటూరులో స్థిరపడి హాయిగా వుంది— అని. పాశ్చాత్యుల మనస్తత్వం అది. కీర్తి పతాక గగనాంగణంలో రెపరెపలాడుతున్నప్పుడే సంతృప్తితో రంగంనుంచి విరమిస్తారు. అందరూ ఛీ, థూ, అనే వరకు పట్టుకొని వేళ్లాడరు. మనవారు కూడ ఈ పద్ధతిని అనుసరిస్తే ఎంతో బాగుండును — అన్నారు నారాయణన్. ఈ సన్నివేశాన్ని తన పుస్తకంలోను పొందుపరిచానని కూడ అన్నారు. డిసెంబర్ 27వ తేదీన రవీంద్ర భారతిలో పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మ భామాకలాపాన్ని చూచినపుడు నాకు శ్రీ ఆర్. కె. నారాయణన్ మాటలు మనస్సులో మెరిశాయి. శ్రీ సత్యనారాయణశర్మ గొప్ప నర్తకులు, విశ్వవిఖ్యాతి ఆర్జించిన వారు. సందేహం ఎంత మాత్రమూ లేదు. రెండు మూడు దశాబ్దాల క్రితం వున్నట్టు ఇప్పుడున్నారా? ఆత్మావలోకనం చేసుకోవాలి. నర్తకునికి ముఖ్యంగా వుండవలసిన లక్షణాలలో ఒకటి సన్నని నడుము. నడుము బలిసిన తర్వాత ఎంత విద్వాంసుడయినా ప్రేక్షకులను రంజింపజేయ లేడు. బుట్ట బొమ్మ తైతక్కలాడుతుండడం చూచి ఎవరూ ఆనందించలేరు గదా! కనుక శ్రీ సత్యనారాయణ శర్మ వంటి విశ్వవిఖ్యాతలు ఆత్మ పరిశీలన చేసుకొని, ఉత్తమ శిష్యులను తమను మించిన వారిని తీర్చిదిద్దడంలో శ్రద్ధ తీసుకోడం మంచిది. సత్యభామ పాత్ర భాగవత హరివంశాదులలో ఎలా వుంది? శ్రీ సత్యనారాయణ శర్మ ఒకప్పుడు ఆ అందచందాలు విరజిమ్మేవారు. అప్పుడు ఆయన దేహయష్టి, హావభావాలు స్త్రీలకూ ఉపదేశాత్మకాలుగా వుండేవి. అలాటివారు వయసు మళ్లి, ఒడలు పెరిగి, నడుము లావెక్కి మెడ తిరగక అపకీర్తి పడడం సమంజసం కాదు కదా! అంతటి గొప్ప కళాకారుడు నవ్వుల పాలు కారాదనే దృష్టితో, సహృదయతతో సలహాను స్వీకరిస్తారని విశ్వసిస్తున్నాను. విమర్శను తెలుగువారు సహించరు. కాని సహృదయులైన కళాకారులు విమర్శకులను ఆత్మీయులుగా భావించడంలోనే కళ, దానితో పాటు వారి కీర్తి విస్తరిస్తాయి.

### ఎన్‌జివోల 11 రోజుల సమ్మె :

డిసెంబర్ 14 రాత్రి నుంచి సమ్మె ప్రారంభించిన ఆరు లక్షలమంది రాష్ట్ర ప్రభుత్వం నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు, పదకొండు రోజుల పాటు సమ్మె కొనసాగించి డిసెంబర్ 25 రాత్రికి విరమించారు. ప్రభుత్వోద్యోగులు 39 కోరికలు కోరారు. వాటిలో 25 కోర్కెలను ప్రభుత్వం ఆమోదించింది. ప్రభుత్వం ఆమోదించిన వాటిలో ముఖ్యమైనవి: వేతనాల వ్యత్యాసాలను తొలగించడానికి అధికారులతో ఒక సంఘాన్ని నియమించడం, ప్రభుత్వోద్యోగులకోసం ఒక ప్రత్యేక సహకార గృహనిర్మాణం సంఘం ఏర్పాటుచేయడం, కంటింజెంటు ఉద్యోగులను రెగ్యులరైజు చేయడం కుటుంబ సంక్షేమ పథకానికి తుదిరూపమిచ్చి పదవీ విరమణచేసిన వారికి పది వేలరూపాయలు ఇవ్వడం, గ్రామ ప్రాంతాల ప్రభుత్వోద్యోగులకు నాలుగు శాతం ఇంటి అద్దె ఇవ్వడం 1976 ఆగస్టుకు ముందు కుటుంబ నియంత్రణ చేసుకున్న వారికి, పట్టభద్రులైన ఎన్. జి. ఒ. లకు ప్రోత్సాహకరమైన ఇంక్రిమెంటు, ఎన్. జి. ఒ. ల పిల్లల చదువుకోసం సంవత్సరారంభంలో ఆరు వందల అడ్వాన్సు, ఎల్. టి. సి. సౌకర్యాన్ని 75 కిలో మీటర్ల లోపు ప్రాంతానికి కూడ వర్తింప చేయడం, సమ్మె కాలాన్ని ప్రత్యేక కాజువల్ లీవుగా పరిగణించడం, ఆర్జిత సెలవు 30 రోజులకు డబ్బుచెల్లించే అవకాశం, ఆర్జిత సెలవును 240 రోజుల వరకు పేర బెట్టుకొనే అవకాశం, ఉద్యోగులకు ఉదారంగా రుణాలు మంజూరు మొదలయినవి.



## ము ఖ చి త్రం

చిరునవ్వులు చిందిస్తున్న ద్విశతచిత్రనటుడు, డాషింగ్ హీరో కృష్ణ ముఖచిత్రంతో వెలువడిన కొత్తసంవత్సరం ప్రారంభ సంచిక మమ్మల్నెంతో ఆకర్షించింది.

వేమూరి శ్రీవాణి (కరీంనగర్)

## 'ఏ కులము నీదంటే ?'

7—1—83 సంచికలో "ఏకులమునీదంటే" కథ చాల బావుంది. లక్ష్యసుద్ధి సాధించడానికిచక్కని ప్రయత్నం చేశారు రచయిత్రి. అసలు ఎప్పుడు "నందివర్ధనం"అని చదివినా, ఆ మాట విన్నా మా చనిపోయిన అమ్మమ్మ జ్ఞాపకానికి వస్తుంది. మాది సినలైన శ్రీవైష్ణవకుటుంబం. అమ్మమ్మ పొరపాటున కూడ నందివర్ధనం అని అనదు. ఆవిడ భాషలో అది గరుడవర్ధనం. అర్ధం అయింది కదా ఆవిడ శ్రీ వైష్ణవ ఆలోచనా సరళి.

జి. వి. ఎల్. ఎన్. స్వామి (బరంపురం)

## వేచియున్నాము

నూత్న రూపంతో విరాజిల్లిన ఈవారం, (14—1—82) వారపత్రిక "నటి శ్రీరూప" నయనానందకర రూపం అందించింది. ఈవారం "లోకం పోకడ" ఈ వారానికే హైలైట్. కథలలో మిగిలున్న వెలుగు, గురుదక్షిణ చాలా బాగున్నాయి. ధర్మపథంలో నియమ పాలన విషయం బాగా స్పష్టీకరించారు శ్రీయుతులు బులుసు వేంకట రమణయ్యగారు. వారికి మా కృతజ్ఞతలు. రానున్న పత్రికకై వేచియున్నాము.

పక్కి గోపాలకృష్ణపట్నాయక్, బల్లిగూడ(ఒరిస్సా)



## దేముడు ఉన్నాడు

31—12—82 తేది ఆంధ్ర సచిత్ర వారపత్రికపై ప్రచురించిన నటి సుహాసిని ముఖచిత్రము నాకు బాగా నచ్చింది. ఈ వారం కథలన్నీ చాలా అత్యద్భుతంగాఉన్నాయి. ముఖ్యంగా "దేముడు ఉన్నాడు"కథ నన్నుబాగాఆకట్టుకుంది.

వన్నెంరెడ్డి రత్నకుమారి (తిరువొత్తియూరు)

## సజాతిధృవాలు

31—12—82 వారపత్రికలో ప్రచురించిన 'సజాతి ధృవాలు' శ్రీమతి రాజ్యలక్ష్మి కొలాస్కర్ గారి కథ చాలా బావుంది. శ్రీనిజ ఆర్. హెచ్. పోజిటివ్, ఆమె భర్త సుధాకర్ ఆర్.హెచ్. నెగిటివ్ అని వ్రాశారు. ఆవిధముగా ఉంటే, రియాక్షన్ రాదు. భర్త ఆర్. హెచ్. పోజిటివ్ ఉండి, భార్య నెగెటివ్అయితేనే వస్తుంది. అదీకాకమొదటి బిడ్డ అంతగా ఎఫెక్ట్ కాదు. కాన్పులతో బాటు, ఎఫెక్ట్ అయే బిడ్డలు ఎక్కువవుతారు. అందువలన మొదటి గర్భముతోఉన్నపుడే భార్యా, భర్త కూడా ఆర్. హెచ్. బ్లడ్ గ్రూప్ చేయించుకుని, దానికి తగిన వైద్యసలహా తీసుకోవాలి.

డాక్టర్ రామలక్ష్మి (తిరుపతి)

## ఇది సంధ్యాసమయం

పెద్ద కథ "ఇదిసంధ్యా సమయం" చాలబాగుంటోంది. ఈ కథలో సుజాత పాత్ర సహజత్వానికి చాల దగ్గరగా ఉంది.రచయితకి కన్నెపిల్లల మనస్తత్వం బాగా తెల్సునని చెప్పడానికి ఈ కథ ఒక నిదర్శనం. 'ఆడపిల్లలు కళ్ళకి నచ్చినదాన్ని, ఎంత తొందరగా తమ సొంతమనిభావిస్తారో, అది పొందలేనప్పుడు కలిగే మనస్థితిని బహుచక్కగా వివరిస్తున్నారు.

కె. రాఘ సీతాదేవి (రాయ్‌పూర్, ఎం. పి.)

* * *

కృష్ణ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రపత్రిక వారపత్రిక నయనానందకరంగా ఉండినది. కథలు మెచ్చుకోదగినవి. 'ఇది సంధ్యా సమయం' హుషారుగా ఉంది.

రమ్య, చంద్రశేఖర రెడ్డి (నగరి)

* * *

31—12—82 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక మీది నటి సుహాసిని ముఖచిత్రం మాకు చాలా నచ్చింది. ఇది సంధ్యాసమయము కథ మాకు ఎంతగానో నచ్చింది. రాగాగ్ని, నీలాకాశం సీరియల్స్ చాల బావున్నాయి.

వై. కృష్ణకుమారి, కె విజయలక్ష్మి (పాతమల్లాయపాలెం)

* * *

"సుహాసిని" బొమ్మచాలా బాగా ఆకర్షించింది 'ఇది సంధ్యా సమయం' కథ చాలాబాగుంది చదవాలి చదవాలి అనిపిస్తుంది

విజయభాస్కరరెడ్డి (కలువాయి) ●

---

# హైదరాబాద్ నోట్ బుక్

### పోచంపల్లిలో గాంధీ కేంద్రం :

ఆచార్య వినోబాభావే భూదానోద్యమం ప్రారంభించిన పోచంపల్లిలో గాంధిజీ నిర్మాణ కార్యక్రమం తీవ్రప్రచారం చేయడానికి ఒక కేంద్రాన్ని స్థాపించాలని గాంధి నిర్మాణ కార్యక్రమ కార్యకర్తలు డిసెంబర్ 26 న సమావేశమై నిర్ణయించార . ఈ కేంద్రం తన పరిసరాలలోని 20 గ్రామాలలో గాంధి నిర్మాణ కార్యక్రమాన్ని అమలు పరుస్తుంది. గ్రామ సీమలలో మద్యపాన వ్యసనాన్ని రూపుమాపడానికి ఈ కేంద్రం కృషి చేయాలని స్థానికకార్యకర్తల మహిళా సంఘాల తదితర స్వచ్ఛంద కార్యకర్తల సహకారంతో గ్రామీణ సమాజం పునర్నిర్మాణానికి ప్రయత్నించాలని అఖిలభారత గాంధి స్మారక నిధి అధ్యక్షుడు శ్రీ కె. అరుణాచలం సూచించారు. ఈ సమావేశానికి ఆంధ్రప్రదేశ్ గాంధి స్మారక నిధి అధ్యక్షుడు శ్రీ కె. కోదండరామిరెడ్డి అధ్యక్షత వహించారు. ప్రారంభంలో ఆంధ్రప్రదేశ్ భూదాన బోర్డు అధ్యక్షుడు శ్రీ సి.వి. చారిప్రసంగిస్తూ గాంధి నిర్మాణ కార్యక్రమం గురించి ప్రచారం చేయవలసిన అవసరముందని అన్నారు. కేంద్ర స్థాపనకై తగుచర్యలు తీసుకోడానికి శ్రీ కోదాటి నారాయణరావుకు అధికార మిచ్చారు. చర్చలలో శ్రీయుతులు ఉమ్మెత్తల కేశవరావు, కర్నమడకల శ్రీనివాసాచార్యులు, హరి ఆదిశేషు, జమీర్ హుసేన్, రాధాకృష్ణ జోషి పాల్గొన్నారు.

### త్యాగరాజ గానసభ ఉత్సవాలు :

త్యాగరాజ గానసభ 16వ వార్షిక సంగీత నృత్య నాటక ఉత్సవాలను డిసెంబర్ 27 న రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ బి. వి. రామన్ ప్రారంభించారు. ప్రారంభోత్సవానికి విద్యాశాఖ కార్యదర్శి శ్రీ ఎస్. ఆర్. మూర్తి అధ్యక్షత వహించారు. ఉత్సవాధ్యక్షుడుగా ఎన్నికయిన ఆస్థాన నృత్యాచార్యుడు శ్రీ నటరాజ రామకృష్ణను సన్మానించారు. శంఖనాదాలు, మృదంగధ్వనులు మిన్ను ముట్టగా పుష్ప వర్షం కురుస్తుండగా సన్మానం అపూర్వంగా జరిగింది. ఆంధ్రదేశపు ప్రాచీన నృత్యాలను ప్రచారం చేయడంలో త్యాగరాజ గానసభతో తను పూర్తిగా సహకరిస్తానని శ్రీ రామకృష్ణ అన్నారు. ప్రారంభంలో సభ అధ్యక్షులు శ్రీ వి. వి. శాస్త్రి స్వాగతం చెప్పారు. వార్షికోత్సవం చెయిర్మన్ శ్రీ కళా సుబ్బారావు సభా కార్యక్రమ నివేదికను చదివారు. సభ త్వరలో నృత్య జంత్ర వాద్యాల తరగతులను ప్రారంభిస్తుందని ఆయన తెలిపారు. సంయుక్త కార్యదర్శి శ్రీ ఉలిందకొండ బదరీనాద్ ధన్యవాదాలు సమర్పించిన పిదప ఆస్థాన సంగీత విద్వాంసుడు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ పాటకచ్చేరీ జరిగింది.

### ఉ ప శ్రు తి :

"చూచావా, ఎంతపని చేశాడో నీ సుపుత్రుడు! మన ప్రమేయం లేకుండానే పెళ్లి చేసుకొన్నాడట?" అంటూ ఒక ఉత్తరాన్ని తల్లివైపు విసిరాడు తండ్రి. అంత కోపమెందుకండీ. అప్రమేయుడని పేరు పెట్టాము . దానికి తగినట్టుగానే ప్రవర్తించాడు ! అని నెమ్మదిగా అన్నది తల్లి. ★

---

**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-2. Editor : S. Radhakrishna.**


SPECIAL
CHARMINAR
10 CIGARETTES
THE VAZIR SULTAN
TOBACCO CO. LTD.
AZAMABAD HYDERABAD
మీలాంటి
మగవానికి
తృప్తినిచ్చేది–చార్మినారే!
విశ్రాంతి పొందండి! చార్మినార్ తాగండి.

1983 బొంబాయి
బిజీతార
జయప్రద

తాజా వార్తలతోపాటు
తాజా సినిమా కబుర్లు
అందించే
ఏకైక దినపత్రిక....




దినపత్రిక కావలసినవారు మా వారపత్రిక అమ్మేచోట అడగండి.
లేదా మా ఏజెంటును సంప్రదించండి.